Oum.

# Jeevabrahmykya Rajayoga Saramrutam.

BY

Paramahamsa Sachithananda Swami.

First Edition.



*Copies apply to*

**Messrs A. Rajagopal & Co.,**
Perambore Barracks,
MADRAS

**Messrs. C. Doraswamy & Bros.,**
Court View,
CUDDAPAH.

MANAGER,
**Saraswati Medical Stores,**
RAJAHMUNDRY.

## శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు వెలకుదొరుకు పుస్తకములు.

| | రు | అ | ప |
|---|---|---|---|
| ప్రచండయాదవమను గయోపాఖ్యానము | 0 | 8 | 0 |
| ప్రసన్నయాదవము | 0 | 8 | 0 |
| పారిజాతాపహరణం | 0 | 8 | 0 |
| పై మూడుపుస్తకములు గల ఏకబైండు | 1 | 12 | 0 |
| సుగుణమణి (వల్లూరు బాపిరాజుగారు) | 0 | 8 | 0 |
| చంద్రకాంత (చక్రావధానుల మాణిక్యశర్మగారు) | 0 | 8 | 0 |
| అభినవరాఘవము | 0 | 8 | 0 |
| బొబ్బిలియుద్ధనాటకము | 0 | 12 | 0 |
| ఉషాపరిణయము | 0 | 8 | 0 |
| సుశీల | 0 | 8 | 0 |
| కన్యాశుల్కము. (గురుజాడ అప్పారావుగారు) | 0 | 12 | 0 |
| రుక్మాంగద | 0 | 8 | 0 |
| రత్నమణి | 0 | 4 | 0 |
| సునీతిదేవిచరిత్ర | 0 | 4 | 0 |
| సుమిత్ర | 0 | 4 | 0 |
| మహాపతివ్రతలచరిత్రములు మొదటిభాగము | 0 | 6 | 0 |
| రెండవభాగము | 0 | 6 | 0 |

| | | | |
|---|---|---|---|
| మూడవభాగము | 0 | 6 | 0 |
| కళాపతీ కళ్యాణం సి. భాస్కరరావుగారు | 0 | 12 | 0 |
| రవీంద్రనాథఠాకూరుగారి ఉపన్యాసం | 0 | 2 | 0 |
| రాజారామమోహనరాయజీవితం | 0 | 1 | 6 |
| బుద్ధనీతి (ప్రతిబాలునియొద్ద యుండతగినది) | 0 | 1 | 0 |
| పతివ్రతాధర్మములు స్త్రీలు చదువతగినది | 0 | 1 | 0 |
| యశస్థిలక (అచ్చులోనున్నది) | | | |
| నాగసుమతీసంవాదం (హరికథ) | 0 | 2 | 0 |
| సంగీతవరపుత్రికాపరిణయం | 0 | 3 | 0 |
| వరలక్ష్మీవిలాసము (చిన్నపాట) | 0 | 1 | 0 |
| సగాహాపురాణం (నందిమల్లయ్య ఘంటసింగయ్యగార్లు) | 1 | 0 | 0 |
| లలిత (రాయప్రోలు సుబ్బారావుగారు) | 0 | 4 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానం (శంకరకవి) | 0 | 8 | 0 |
| భోజరాజీయం | 1 | 0 | 0 |
| కవిరాజమనోరంజనం | i | 0 | 0 |
| అళిహాసంగిరి | 0 | 10 | 0 |
| శృంగారవల్లి | 0 | 14 | 0 |
| స్వర్ణకుమారి | 1 | 8 | 0 |

కావలసినవారు శ్రీచింతామణీ ముద్రాక్షరశాలాధికారులగు యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారికి వ్రాసికొనవలయును.

ఓమ్

తత్సత్

పరబ్రహ్మణేనమః.

# జీవబ్రహ్మైక్య రాజయోగ సారామృతము

ఇది

శ్రీ నెట్టూరి స్వాములవారి పరంపరలోఁ జేరిన

శ్రీ నిత్యానందస్వాములవారి ప్రియశిష్యుఁడగు

## శ్రీ పరమహంస సచ్చిదానందస్వామిచే

రచియింపఁబడినది.


రాజమహేంద్రవరము:

యస్. గుణ్ణేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1914.

వెల 0-12-] [కాపీరైట్ రిజిష్టర్డ్



SWAMY PARAMAHAMSA SACHIDANANDA

BORN THURSDAY THE 16TH FEBRUARY 1865

HOE & CO PRINTERS MADRAS

# పీఠిక.

ప్రపంచమునందుండు సకలజనులు తమ యుదరపోష
ణార్థమై విద్యను నభ్యసించుచున్నారేగాని మోక్షముకొరకై
ముక్తిబొందుటకు కాదు. అస్థిరమైన యీదేహమును నమ్మి
వృధా కాలయాపనముచేసి చెడిపోక యీదేహమెత్తుటకు
ముఖ్యకారణము మోక్షము కొరకే యని తెలిసికొనుఁడు.
మోక్షమనఁగా బంధమునుండి విముక్తియగుట వీనిని బట్టి
మనము బంధమునందు కట్టుబడియున్నామని యేర్పడుచున్నది.
ఆబంధము దేనివల్ల నేర్పడినదనఁగా అజ్ఞానమువల్ల నేర్పడినది.
ఈయజ్ఞానమును విచారించగ యెండమావులవలె ఆత్మయం
దనాదికల్పితముగాఁ గానవచ్చుచున్నది. దీనిని క్రమక్రమ
ముగా యోగసాధనచేత పోఁగొట్టి చిదాకాయరూపమైన
తదాకారరూపమునందు నిలుచుటయే ముక్తియనఁబడును.
మన పూర్వులు గుంభనముగా నుంచిన వేదాంతరహస్యముల
నన్నిటిని వేదాంతులకును; నూతన యోగాభ్యాసుల కుప
యుక్తమగునటుల, భగవద్గీతాది యుపనిషత్తులయొక్క
దృష్టాంతములతో నీగ్రంథము వ్రాయఁబడినది. కాఁబట్టి
యీదేహముండునపుడే యోగాభ్యాసమువల్ల నొక్కొక్కరు
కైవల్యపదవిఁ బొందుటకు ప్రయత్నించవలెను. యోగాభ్యా

సముచేయుటకు శక్తిలేనివారు యీగ్రంథమున వ్రాయఁబడిన రీతిని బ్రహ్మాయుద్భవించినస్థానమును ఆకాశరూపము (బట్టబయలు) గాఁ జూచువిధ మొకటి, శాంభవిముద్రచే నభ్యసించుట మరియొకటి, సోహంభావధ్యానమునందుండి అసంప్రజ్ఞాత సమాధియందుండుట యింకొకవిధము. ఈ మూడువిధ యభ్యాసములలో నేదైన నొకదానిని నభ్యసించుచు వచ్చినయెడల సంకల్పమునశించి, చిత్తశాంతిగలిగి మోక్షమునుబొందగలరు.

అజ్ఞానప్రమాదమువల్ల నక్కడక్కడ కొన్నిలోపములు పడియుండవచ్చును. క్షీరోదకన్యాయములో హంసముక్షీరమును గైకొని నీరును వేరుపరచునట్లు పండితులు దీనియందలి సత్తునుగ్రహించి అసత్తుగా నుండువాటిని పరిగ్రహింతురని కోరుచున్నాను.

పండితులు యిందలి లోపములను దెలిపినచో వందన పూర్వకముగ రెండవకూర్పునందు సవరించుకొనెదను.

ఇట్లు
విన్నవించు బుధజనవిధేయుఁడు,
శ్రీ పరమహంస సచ్చిదానందస్వామి.

## విషయసూచిక.

ௐ

ப்ரணவம்




Ganapathy Bhavana
for Manasa Pooja




Vishnu Bhavana
for Vishnu
Manasa Pooja

மானஸ தியானே உபாஸன பூஜா, தேவதா விஸ்வ விராட் ரூபபா

Hoe & Co. Madras—F. 3894--5-'14.

ఓం
ప్రణవము




Parvati Sarasvati
Lakshmi Dhevi
Bhavana for
Dhevi Manasa Pooja










"మానస" ధ్యానోపాసన పూజా, దేవతా విశ్వవిరాట్ రూపభావన

ఓమ్

తత్సత్

పరబ్రహ్మణేనమః.

# జీవబ్రహ్మైక్య రాజయోగ సారామృతము.



శ్లో॥ యస్యాం తర్నాది మధ్యం నహికరచరణం నామగోత్రం నసూత్రం। నోజాతిర్నైవ వర్ణా నణవతిపురుషో నానపుంసం నచస్త్రీ। నాకారం నో వికారం నహి జనమరణా నాస్తి పుణ్యం నపాపం। నోతత్వం తత్వమేకం సహజసమరసం సద్గురుం తన్నమామి.

నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వదాసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతన్నమామి.

నిత్యానందాయదత్తాయ నిర్మలాయ చిదాత్మనే
జ్ఞానోత్తమాయగురవే తస్మై శ్రీగురువే నమః.

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.
గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః.
గురుర్శివో, గురుర్దేవో గురుర్బంధు శరీరిణాం
గురురాత్మా గురుర్జీవో గురోరన్యం నవిద్యతే.
నసుఖం వేదశాస్త్రేషు నసుఖం మంత్రయంత్రకే
గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే.
గురుర్విష్ణు స్సత్వమయో రాజసశ్చతురాననః
తామసోరుద్రరూపేణ సృజత్యవతిహంతిచ.
స్వయంబ్రహ్మ, మయోభూత్వా తత్పరం చావలోకయేత్
పరాత్పరతరంనాన్య త్సర్వగం తన్నిరామయం.
కామ్యానాం కామధేనుర్వై కల్పితే కల్పపాదపః
చింతామణిశ్చింతితస్య సర్వమంగళకారకం.
భవమూలవినాశాయ చాష్టపాశా నివృత్తయే
గురుగతాంభసిస్నానం తత్వజ్ఞ కురుతేసదా.
సత్యానందరూపాయ భోదైకసుఖకారిణె
నమోవేదాంతవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే.
సచ్చిదానందరూపాయ వ్యాపినే పరమాత్మనే
నమశ్శ్రీగురునాథాయ ప్రకాశానందమూర్తయే.

నగురో రధికం జ్ఞానం నగురో రధికం తపః
నగురో రధికం ధ్యానం నాస్తి తత్త్వం గురోః పరం.
నగురో రధికం నగురో రధికం నగురో రధికం నగురో
రధికః|శివశాసన తశ్శివశాసన తశ్శివశాసన తశ్శివశాసనతః
ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం
మమశాసనతో మమశాసనతోమమశాసనతో మమశా
సనతః|విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం
విజనం|హరిశాసనతో, హరిశాసనతో, హరిశాసనతో,
హరిశాసనతః.

ఏవంవిధంగురుధ్యాత్వా జ్ఞానముత్పద్య తేస్వయం
తథాగురూపదేశేనముక్తోహమితి భావయేత్.

గురుఃపితాతథాబోధే ఆచార్యశ్చత థైవచ
ఉపదేశేతథాప్రోక్తం గురురిత్యక్షరద్వయం
గుకార స్త్వంధకారస్యాత్ రు కార స్తన్నిరోధకః
అంధకారనిరోధత్వాత్ గురు రిత్యక్షరద్వయం.
ఉపనియ్యతుయశ్శిష్యం వేదమధ్యావయేద్యది
సరహస్యం సంకల్పంచ తమాచార్యం ప్రచక్షతే."



లోకమునందలి నరుం డెవ్వఁ డయినను నీషణత్ర యములకు జిక్కక తాపత్రయములకు దక్కక కామక్రోధాది శత్రువర్గములను నశియింపఁజేసి బాహ్యేంద్రియములను నంత రింద్రియములను గ్రహించి స్వాధీనము చేసికొని హృదయమును జలింపనీయక సర్వేశ్వరుని నిర్మల చిత్తంబున నేకాంతంబున నుపాసించుచు హింసాదిపాపకృత్య ములఁ జేయక పుణ్యకార్యములకు బ్రతిఫలము గోరక యేకర్మ చేసినను కృష్ణార్పణమ్మని చేయుచుండెనేని భ్రాంతిమమకా రంబులు లోభమోహంబులు మొదలగు దుర్గుణము లన్నియుఁ గ్రమంబుగా నశియించి జననమరణ రహితంబయి యణుప్రమా ణంబయి యఖండమయిన జీవన్ముక్తి సిద్ధించును. చిత్తము నిశ్చలమై యుండుటకు సాధన మయినయోగము నభ్యసింప వలయును. మనస్సు దేనియందును బ్రసరించకుండునట్లు సత్సహ వాసమును సద్గ్రంథపఠనమును సత్కథాశ్రవణము మొదలగు నవి నవశ్యముగా నుండవలయును. అనంతరము మానసంబు నిర్మలంబయి నిశ్చలంబయి ప్రకాశించును. అటుపిమ్మట నిశ్చల తత్వము కుదురును దానియందే జీవన్ముక్తి యులవడును. అవిద్య మొదలయిన క్లేశములును బుణ్యపాపములు ధర్మా ధర్మములును మొదలగు మిశ్రకర్మములును నాద్యంతము లును భయభ్రాంతులును లేక యాయుర్భోగములు నాదివ్యా ధులు జననమరణములు నున్నగువానిచేతను గాలత్రయము చేతను బాధింపఁబడక లొంగక చలింపక నిర్మలమై నిత్యమై ప్రకాశించుచు దివ్యజ్యోతి యేదియో యదియే యీశ్వరుం

డనఁబడును. ఇట్లు నిర్గుణుండై నిరుపాధికుఁడై సర్వజ్ఞుఁడై సర్వాంతర్యామియై యుండుపరబ్రహ్మస్వరూపమునకే ప్రణవమని పేరు. ప్రణవ మనఁగా నోంకారము అకారోకార మకారములు (అ. ఉ. మ) కూడికయే యోంకార మగును. దీనిని మాటిమాటికి జంతించుటయే జపమని చెప్పఁబడును. దానియర్థమును భావించుటయే యీశ్వరుని ధ్యానించుట యనఁబడును. ఓంకారమును జపించుటయును ధ్యానము చేయుటయే యీశ్వరు నుపాసించుట యనఁబడును. వేదార్థములను దెలిసికొనుట పురాణాదులను వినుట సాధువులను సజ్జనులను ఆర్యులను విద్వాంసులను బూజించి సేవించుట సత్యముపలుకుట మొదలగు కర్మలను జేయుచుండవలయును. పరుల నొప్పించుట వంచించుట హింసించుట దూషించుట పరస్త్రీలను మోహించుట మొదలగు నిషిద్ధకర్మలను విడువవలయును. పుణ్యపాపములు మిశ్రముతోఁ గూడినది మూఢకర్మ యనంబడును. దానిని జ్ఞానులగువారు విడనాడవలయును. ఓంకార మీశ్వరు నెఱింగించునుగాన నోంకారజపము వలన జీవాత్ముఁ డయిన పురుషుని విఘ్నములు నశించును. ఆత్మస్వరూపమును నీశ్వరస్వరూపమువంటిదే యగుటవలన నీశ్వరోపాసనమువలన నాత్మస్వరూపము తెలియంబడి యందువలన నాత్మ సాక్షాత్కారము కలుగును. దీనిని బ్రహ్మవిద్య యందు ఈవిధంబున నాచరించుట దేహికి దుర్లభముగాని సులభముగాదు. కావుననే యేకార్యమయినను సాధింపవచ్చు

వని తోఁచినపు డిదియేమి బ్రహ్మవిద్యయా ? దీని కింత యాలోచన యేల యని సామాన్యముగా వాదుదురు.

"రాజయోగసారామృత" మనుచోట రాజృ=దీప్తౌ అనుధాతువువలన పుట్టిన "రాజన్" శబ్దమునకు స్వయం ప్రకాశమైన చిద్రూపమర్థము. యోగశబ్దమునకు, రెండువస్తువులును కలియుట, అనగా నిక్కడ స్వయంప్రకాశరూపమైన యొకవస్తువే. పిండబ్రహ్మాండములను నుపాధులతో గలసి రెండుగా నున్నది. ఇప్పు డారెంటిని ఏకముగా బొందించుట రాజయోగమని యర్థము. ఇట్లు పొందించినయెడల పిండాండ మందున్న యీజీవుడు దేహధర్మమైన మరణమును వదలి యమృతుఁడగుచున్నాఁడు. ఈయర్థమును అనేక విధములయిన గ్రంథములు చెప్పుచున్నను, అన్నిగ్రంథములయం దుండు సారమును పెరుగు తరచి వెన్నతీసినట్లు, తరిచి, వెన్నవలెనే చెప్పబడెను. కనుక "రాజయోగసారామృతమని" యీగ్రంథమునకు నామ మిడువబడెను. గణపతి ప్రథమగణముల కధిపతియగుటచేత గ్రంథనిర్విఘ్నముకొఱకు గ్రంథాదిని "అదౌపూజ్యో గణాధిపః" అను న్యాయముచేత విఘ్నేశ్వరుని ముందుగా ధ్యానము చేయుచున్నాఁడు. గణపతి యనగా దేవ, మనుష్య, పశు, పక్షి, సమూహముల కధిపతి. అధిపతి యనగా నంతర్యామిగానుండి ఆయాగణములను నడిపించుచున్నాఁడనుట. ఇదిగాక గణములనఁగా కర్మేంద్రియ, జ్ఞానేం

్రియ సమూహము. వాని కధిపతిగానుండి యాయా యింద్రియములను వానివాని కార్యములయందు జాగరూకతతో వర్తింపఁజేయువాఁడని విశేషము. బ్రహ్మాండ పిండాండముల యందున్న బ్రహ్మస్వరూపమునే గణపతిశబ్దము బోధించు చున్నది. ఇందువల్ల చెప్పఁబోయెడి గ్రంథము తత్త్వగ్రంథమని సూచన చేయఁబడుచున్నది. ఆదియందు చెప్పఁబడిన గణపతి శబ్దమే విషయమును ప్రయోజనమును సూచించుచున్నది. విషయమనఁగా బ్రహ్మాత్మస్వరూపము. ప్రయోజనమనగా అన్నిసమూహములకు అధిపతియగుటచేత దేవ, మనుష్య, తిర్యగ్జాతి జంతువులును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదులును బ్రహ్మాత్మకంబె వ్యతిరిక్త మంతయు జనన మరణ ప్రవాహ రూపమైన యనర్థమంతయు పోఁగొట్టు సమర్థత కలదిగుట వలన ప్రయోజన మనఁబడుచున్నది.

" ఏకోవసి సర్వభూతాంతరాత్మా " ఒక్కటియై సర్వము వశ్యమును చేసికొని భిన్నము లయిన అన్నివస్తువుల యందు చైతన్యస్వరూపమై యున్నది. "శ్రీగణనాథుని" అనుటచే గ్రంథాదియందు "శ్రీ" శబ్దముండుటచేత లిపికి, గణములకు యతిప్రాసలకు నింద్యములేదు.

" దేవతావాచకాశ్శబ్దాయే చభద్రాదివాచకాః, తేసర్వేనైవ నింద్యాస్స్యు ర్లిపితో గణతోపిచ " అని యుండుటచేత గ్రంథము విఘ్నము లేకుండునట్లు సమాప్తి నొందును. ఇదిగాక

'శ్రీ' శబ్దప్రయోగముచేతను గూడ యోగ్యులయినవారికి ఋగ్యజుస్సామ వేదములలోనున్న యేరాజయోగముకలదో అదే సంపత్తు ఇందుకు "ఋచస్సామానియ జూగుంపి సాహిశ్రీ రమృతాసతాం" ఋగ్యజుస్సామ వేదములయందు చెప్పఁబడిన ఏమహావాక్యార్థమైతేకలదో అదే సంపత్తు. ఇందువలన జీవబ్రహ్మైక్యమని యర్థమగుటచే ఈగ్రంథమునకు జీవబ్రహ్మైక్యరాజయోగ సారామృతమని నామ మిడువబడినది. ఇందుకు శ్రుతి॥ " సాచిరాభ్యాస యోగేన వినా నశ్రీయతే క్వచిత్ " శ్రీయమేవాప్నోత్యథో ప్రజ్ఞాతఏవ " ఈ యోగముచేత నిరతిసయ సంపత్తునుపొంది ప్రజ్ఞాస్వరూపుఁడై యుండును. " ఆశ్రితపరిపాలుఁ " ఆశ్రయించినవారలను రక్షించువాఁడు భగవంతుఁడు. భగవంతుని నాశ్రయించుటయందు పలువురు పురుషులు —

గీత. అర్థో జిజ్ఞాసు వర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ. అ7_16 శ్లో
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే. అ 7_17 శ్లో.
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్. అ 7_18 శ్లో.

అనఁగా రోగార్తుఁడును, జిజ్ఞాసగలవాఁడును, ద్రవ్యాపేక్షకలవాఁడును, జ్ఞానముకలవాఁడును, ఈనలువురును భగవదాశ్రితులు. పైనజెప్పిన వారలలో ముఖ్యుఁడు జ్ఞాని, "జ్ఞాని" నా స్వరూపుఁడే యని భగవంతుఁడు చెప్పెను. ఈనలువురు భగవంతుని నాశ్రయించినవారు వీరిని ఆయనపరిపాలించును.

పరిపాలన యనఁగా, ఇహమందు, దారపుత్రాది గృహ రామక్షేత్రాదుల నిచ్చి రక్షించువాఁడు, పరమందున అనంత భోగములనిచ్చి నిత్యపదవిని కలుగఁజేయువాఁడని గూడ చెప్పఁబడును. పరిపాలన అనఁగా పరి అనే యుపసర్గతోఁగూడుకొన్న పాలనధాతువుకు పరిపూర్ణమును గలుగజేయు అనఁగా సచ్చిదానందస్వరూపునిగాఁ జేయునని తాత్పర్యము ఉపసర్గతోఁ గూడుకొన్న ధాతువు లనేకార్థములు కలవి.

"యనే వైషవృణుతేతే నలభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూస్వామ్" ఎవరైతే ఈయాత్మను ఇతరవృత్తులు మాని మోక్షమును పొందవలెననే ఇచ్ఛగలవారో వారికి నీయాత్మ తన స్వరూపమైన సచ్చిదానంద స్వరూపమును కలుగజేయును సచ్చిదానందమనఁగా నాద, బిందు, కళలు, నాదము=సత్తు, బిందు=చిత్తు, కళ=ఆనందము మొదలగునవి పుట్టుటకు బీజములు.

నాదమనఁగా—మూలాధారాది షట్చక్రములయందు నడుచుచున్న హంసధ్వనిలో అంతర్లోపిగానున్న ప్రణవము.

బిందువనఁగా—ఆప్రణవమునందు కొనయందు నున్న యొక్క స్వరూపము.

కళయనఁగా—"సోహం" మని నడుచు హంస స్వరూపము.

"శ్లో. ధ్యానే రంతర్గతం జ్యోతిర్జ్యోతిరం తర్గతం మనః।
తన్మనోవిలయంయాతి తద్విష్ణోః పరమంపదం."

ప్రాణమనోబుద్ధులనే నాదబిందు కళలని, పెద్దలు వాడు చున్నారు. ఇందుకు నాదము.

శ్లో. "ప్రాణఏవసదానాదః మనోబిందు స్తథైవచ
కళాతుబుద్ధిరిత్యుక్తం ఏవంధ్యాయేత్సదాయతిః"

ఈనాదబిందువులకు ఆధారము త్రికూటస్థానము. త్రికూట మనఁగా మూఁడు మార్గములు కలసినది దీనినే శృంగాటకమని వాడుదురు. ఇదేకాశి, ఇదియే భ్రూమధ్యస్థానము. "భ్రువో ర్మధ్యే వారాణసీ తత్రైవ పరంజ్యోతి ర్విరాజతే" మూఁడు మార్గములనఁగా ఇడా, పింగళ, సుషుమ్నలు, లేక సచ్చిదా నందము. ఈసచ్చిదానందమే నీవని ఛాందోగ్యోపనిషత్తునందు అరుణుఁడు శ్వేతకేతునకు తొమ్మిది పర్యాయములు ఉపదేశిం చెను. ఈమహావాక్యమునందు ఉపాధులతోఁ గూడుకొని అర్థము చెప్పినపుడు వాచ్యమనియు, ఉపాధులను వదలి అర్థము చెప్పినపుడు లక్ష్యమనియు రెండర్థములుకలవు. "కార్యో పాధిరయంజీవః కారణోపాధి రీశ్వరః। కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోవిశిష్యతే"

ఆలక్ష్యమునకు నిరాలంబమనియు, సర్వసాక్షియని యు, రెండువిధములైన అర్థమును అనుభవముచేత తెలియఁ దగినది. ఆ సర్వసాక్షివై నీవుండు సమయమున, నీవే పూర్ణ

బోధ స్వరూపము కాఁగలవు. ఇదియే సచ్చిదానందము. ఈ సచ్చిదానందరూపమయిన శివకళే. యుత్పత్తి, స్థితి, సంహార ముల నెరుగక, ఏకరూపముగా నుండుటచే సత్తనియు, ఆ శివకళరూపమైన సత్తునందు పుట్టిన పదార్థములను బ్రకాశింప జేయుచు, వాని సంబంధము లేకయే తాను బ్రకాశించు చున్నది గనుక, చిత్తనియు అవిరెండు ఒక్కటే స్వరూపమని తెలిసికొని, అది తానై ప్రకాశించునపుడు ఆనందము. ఈ మూడు కలసినదే సచ్చిదానందము దీనిని తత్వవేత్తలు వివేకముచేత చక్కఁగాఁ దెలిసికొనుచున్నారు.

ఇందువలన మూలాధారమునందుండు గణపతి ధ్యాన ముచేతనే యాత్మస్వరూపమును పొందిన సద్రూపులగుదురు. ఈ విశేషణముచేతను జీవ పరమాత్మయోగము సూచింప బడుచున్నది. ఆగమసంవేద్యః — ఆగమ=శాస్త్రముల చేతను, సంవేద్యః=తెలియఁ దగినవాఁడు, శాస్త్రమనఁగా శ్రుతి, స్మృతులకు శాస్త్రమని పేరు. ఒకరిచేత చెప్పఁబడక, బ్రహ్మ ముఖమునుండి నిట్టూర్పు (శ్వాసమువిడుచుట) వల్ల బయలు దేరినవి శ్రుతులు ఆశ్రుతులయొక్క అర్థమును శ్లోకరూపేణ ఋషులచేత చెప్పఁబడినవి స్మృతులు. వీటిలోనే, ఆగమేతి హాస పురాణాదులు అంతర్భాగములు. ఈ స్మృత్యాదులు పైనిచెప్పఁబడిన శ్రుతులను అనుసరించి చెప్పఁబడినప్పుడు పార మార్థికమును గురించి ప్రమాణములు లేనియెడల కావు.

శ్రుతియనఁగా వేదము, వేదమనఁగా ప్రత్యక్షాది ప్రమాణ ములచేతఁ దెలియఁబడని వస్తువును తెలియఁజేయునది. పార మార్థికమందు ప్రత్యక్షము ప్రమాణముకాదు. "యద్దృశ్యం తన్నశ్యం" అను న్యాయమును బట్టి కూడ ప్రమాణముకాదు. "నచక్షుషాగృహ్యతేన వాచానాపి మనసా" కంటిచేతను వాక్కుచేతను, మనస్సుచేతను తెలియఁబడునది కాదు. ఇప్పుడు అనుమానముకూడ ప్రమాణముకాదు. ప్రత్యక్ష వస్తువువలనే పారమార్థికవస్తువు దూరమైనదికాదు. అందుచేత హేతువును బట్టి ఊహించవలసిన పనిలేదు. "నానుమానం" ఊహించ తగినదికాదు. ఉపమానముకూడ ఇక్కడ ప్రమా ణముకాదు. రెండువస్తువు లున్నపుడు ఉపమానము. ఈతత్వ మందు రెండువస్తువులులేవు. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, "నేహనా నాస్తికించన" ఒక్కటి అనియు, రెండవది లేద నియు, నానాప్రకారములు కాదు. ఈ హేతువులచేతను శాస్త్రమే కారణము. సమన్వయమునుబట్టి పారమార్థిక తత్వము వేదమందు బోధింప బడుచున్నది. తెలియువాఁడు అనగా యోగము, కర్మ, వీటిచేత తెలియదగినవాఁడుకాఁడు "విద్" ధాతువు జ్ఞానార్థక మగుటవల్ల "యోవేదనిహి తం గుహాయాం పరమేవ్యోమన్" బుద్ధియందు యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు ముక్తుఁడు. కర్మచేత తెలియఁ బడనందుకును, జ్ఞానము చేతనే తెలియఁదగినది అగుటకు

"నకర్మణా నప్రజయాధనేనత్యాగేనైకే అమృతత్వమానశుః। న్యాః పన్థావిద్యతేయనాయ" కర్మలచేతను సంతానముచేతను, ధనముచేతను తత్వము తెలియుదు త్యాగముచేతనే అమృతస్వ రూపమును, మునులుపొందిరి. జ్ఞానముకంటె మోక్షమునకుమరి యొకమార్గము లేదు. "ఆధారసదున్నః" ఆధారమేస్థానముగాఁ గలవాఁడు. ఆధారమనఁగా వీటిలో 21600 హంసలు నడుచు చుండెడి సప్తచక్రములలో మొదటిచక్రము ప్రాణధారులైన అన్నిజంతువులకు ఈ యుదయము మొదలుకొని రేపటి యుద యము వరకు పైని చెప్పఁబడిన సంఖ్యప్రకారము హంసలు నడుచుచున్నవి. రెండువస్తువులు కలిసి అవకాశము కలిగి నప్పుడు ఒకశబ్దముపుట్టును ఆశబ్దమును లోకములోని జనులు విని, అర్థము కలిగిన శబ్దమువలననే పలుకును అటువలనే దేవ, మనుష్య, తిర్యగ్జాతి, సమస్త జంతువులయొక్క హృదయ మందు ప్రాణము అపానము, ఊర్ధ్వ, అధోగమనములు, కలిగినప్పుడు ఒక ధ్వనిరూపముగ శబ్దము పుట్టుచున్నది. దానిని, మహానుభావులైన యోగులు "హంసః" అని కనిపెట్టిరి ఆ హంస, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుధు, ఆగ్నేయ, సహస్రార, అను నీ యేడుచక్రములయందు పుట్టినధ్వని "హంస" యని కనిపెట్టిరి. "హం" అనగా మూలాధారమందు పుట్టిన ధ్వనికిపేరు. అది క్రమముగా ఆరు చక్రములయందు నడిచి ఆగ్నేయచక్రమునకు వచ్చి

నప్పుడు " స " కారమని ధ్వని పుట్టినది. ఈ రెంటియొక్క కలియుటకే " హంస " అనిపేరు. ఇది గురుమూలకముగా నుపదేసింపఁబడి నప్పుడు పైని చెప్పఁబడిన " స " కారము మొదటి యక్షరముగాను రెండవదియగు " హం " తర్వాత చెప్పఁబడి పలుకునప్పుడు " సోహ " మని రూపమైనది. ఇది ఆరు స్థలములయందు ఆరుపేరులుగల దేవతలైనవి. 1 గణపతి 2 ప్రజాపతి 3 విష్ణు 4 రుద్రుడు 5 జీవుడు 6 ఈశ్వరుడు 7 పరమాత్మ వీరియందు, ఈ హంసలు నడుచును ఎట్లనగా

మూలాధారమునకు అధిపతి గణపతియగుటచేత వీనికి ఉదయము 600 హంసలు నడిచినట్టియిన గర్భమునిండి స్వాతిష్ఠానమునకు ప్రవేశించును. స్వాతిష్ఠానమునకు అధిపతి ప్రజాపతి యగుటచేత వీనికి 6000 హంసలు నడిచినట్టియిన గర్భము నిండి మణిపూరకమును ప్రవేశించును. మణిపూరకమునకు అధిదేవత విష్ణు, యగుటచేత వీనికి 6000 హంసలు నడచినట్టియిన గర్భమునిండి అనాహితమునకు ప్రవేశించును అనాహితమునకు అధిదేవత రుద్రుడు వీనికి 6000 హంసలు నడచినట్టయిన గర్భమునిండి విసుత్తునకు ప్రవేశించును విసుత్తునకు అధిదేవత జీవుఁడు వీనికి 1000 హంసలునడచినట్టయినగర్భము నిండిఆగ్నేయమునకు ప్రవేశించును ఆగ్నేయమునకు అధిదేవత ఈశ్వరుఁడు వీనికి1000హంసలునడచిగర్భమునిండిసహస్రారము నకుప్రవేశించును. వీనికిఅధిదేవతపరమాత్మావీనికి1000హంసలున

డచిగర్భమునిండి మరునాడుదయము మరియుమూలాధారము నకుప్రవేశించునుఇవియన్నియుకలసిదినమొక్కటికి 21600హంస కళాస్వరూపమై నడచును. పరమాత్మకే చెప్పబడిన 1000 నిమ్కళారూపముగ నడుచును. ఇదిఅంతయు కలసిరాత్రిపగలు అను వ్యవహారము కలుగుచున్నవి.యోగులైనవారు ఏడుచక్రములయందునడుచు21600హంసలనుతిన్నఁగానడిపిసుమారుఒక నెలకు సహస్రారమునకు తెచ్చినిలుపుటచేతఆదినముసరికిఒకదిన మగును. ఈవిధమున వారలుహంసలను తిన్నఁగా నడిపి మౌన నిష్ఠయందుండి ఆయువును వృద్ధిచేసికొనుచున్నారు. నిష్ఠయందుండునపుడు హంస నడవక నిలచిపోవును, ఈరీతిని హంసను సేకరించుకొని అనేక సంవత్సరములు జీవించియున్నారు. మన యాయుర్భాగము ఈహంస సూత్రమేగాని సూర్యచంద్రులు తిరుగుదినములుకాదు. ఇట్టి పరమరహస్యమును మనము తెలిసికొనలేక, ఆటపాట వ్యవహారములయందును, వృధాకాలక్షేపములు నిద్రించుట, పరుగెత్తుట మొదలగు వాటివలన ఒక్కొక్కరు దినమొక్కటికి 50, 60 వేలు హంసలను వృధా ఖర్చు పెట్టుటచేత శీఘ్రకాలములోనే మరణము నొందుచున్నారు. మనము అనేక దినములు జీవించియుండుటకు ఈ హంస సూత్రమే యాధారము. ఆధారమనఁగా అధోకుండలివలె అది నాలుగు పలుకులు గలదై బ్రహ్మరంధ్రము మొదలుకొని వీణాదండమువలె యుండును. దానియందు నిచ్చెనమెట్లవలనే యేడు చక్రములు ప్రవర్తించుచున్నవి. పైని చెప్పఁబడిన " హంస " మంత్రములు వ్యత్యాసము చేయునప్పుడు

"సోహం" మని చెప్పబడుచున్నది. సోహమనగా "స" కారమునకు మాయను వశ్యముచేసికొని సర్వజ్ఞత్వాది గుణములు కలిగినవాఁడు ఈశ్వరుఁడని యర్థము "అహం" కారమునకు అవిద్యావశ్యుఁడై దేహము నేననుకొని కించిజ్ఞత్వాది గుణములు కలిగినవాఁడు జీవుఁడు. ఈయర్థము చెప్పినయెడల ఐక్యమునకు బాధకలుగును. గనుక వాఖ్యమునకు అర్థము చెప్పినప్పుడు బాధకగిలిన యర్థమునకు వాచ్యార్థమని పేరు వాచ్యార్థ బాధకలిగినప్పుడు లక్ష్యార్థమును గ్రహించవలయును. ఇందుకు ప్రమాణము, సూత్రము-"వాచ్యార్థానుపపత్యా తత్సంబంధి న్యారోపిత శబ్దవ్యాపారోలక్షణా" శబ్దమునకు అర్థము వాచ్యము అని రెండువిధములు వాచ్యార్థమునకు వీలులేనప్పుడు లక్ష్యార్థమును చెప్పవలెను. లక్షణ-మూఁడువిధములు. జహత్తు, అజహత్తు, జహదజహత్తు, జహత్తనగా వాచ్యార్థమును వదలి అన్యార్థమును చెప్పుట. ఉదాహరణము — "గంగాయాం ఘోషః" అనగా గంగయందు గొల్లపల్లె కలదని అర్థము గనుక ప్రవాహమందు గొల్లపల్లె కలదని చెప్పుట వీలుకాదు. దానికి సంబంధమయిన తీరమందు ఉన్నదని చెప్పుట ప్రవాహార్థమును వదలి తీర్థార్థమును చెప్పుటచేత "జహత్తు" అనగా వదిలిన లక్షణ అయ్యెను "అజహత్తు" ననగా వాచ్యార్థమును వదలక అన్యార్థమును చెప్పుట ఉదాహరణము. "మంచాః క్రోశంతి" అనగా, మంచెలు అరచుచున్నవని అర్థము. ఈయర్థము చెప్పినయెడల మంచెలు చైతన్యములు కావు గనుక ఆక్రోశించుట

బాధ. ఇందునిమిత్తమై మంచలయందుండు జనము ఆరోపించు చున్నదని చెప్పవలెను. ఇట్లు చెప్పినయెడల మంచలను వదలక దానియందున్న జనులను అర్థముగా చెప్పుట.

"సోఽయం దేవదత్తః" అనే స్థలమందు వాఁడే యీ దేవదత్తుఁడు అని అర్థము చెప్పినపుడు బాధ కలుగుచున్నది. "సోహ" మనునప్పుడు సకారమును "హ" కారమును వదలి "స" కారముమీద నుండే "ఓం" కారమున్ను "హ" కారమందుండే పూర్ణానుస్వారమును తీసికొని, పలికినప్పుడు "ఓం" అనే రూపము సిద్ధించుచున్నది "హంస" అనునప్పుడు కూడ ఇట్లే "హ" కార "స" కారములు వదలి పలికిన శబ్దము లేక పోయినది కనుక నిశ్శబ్దము బ్రహ్మస్వరూపము. అట్టి బ్రహ్మమును ప్రణవరూపముతో ధ్యానము చేసినయెడల నిశ్శబ్దమైన బ్రహ్మముతో నగును.

"నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే శబ్దబ్రహ్మణి నిష్ఠాతః పరం బ్రహ్మేతి గచ్ఛతి" శబ్దరూపమైన ప్రణవబ్రహ్మనిష్ఠవల్ల పరబ్రహ్మమైన నిశ్శబ్దమును పొందును

శ్లో. ఆదిత్య శ్చాంబికా విష్ణు ర్గణనాథో మహేశ్వరః
ధర్మార్థ కామ జ్ఞానానాం మోక్షస్యా పీశ్వరాః క్రమాత్.

ధర్మార్థ కామ, జ్ఞాన, మోక్షములకు, సూర్య, అంబిక, విష్ణు గణనాథ, మహేశ్వరులు, అయిదుగురు అధిష్ఠాన దేవతలై యున్నారు. ఈయైదుగురిని అధ్యాత్మయందు అనఁగా యీశ

రీరమందు, నేత్రములకు, కుండలి, మణిపూరక, మూలాధార అనాహితమునకు, అదిష్ఠాన దేవతలై యుండిరి. వీరినే ముఖ్యముగా జీవుఁడైన తన్ను, భ్రూమధ్యమందలి నిలిపి పైచెప్పిన ఆ అదిష్ఠాన దేవతను ఉపాశన చేయవలయునని శ్రీమద్ చ్ఛంకరా చార్యులవారు భాష్యమందొక పీఠమందు యీయయిదుగురుని నిలిపి యేకముగా పూజచేయవలయునని చెప్పియున్నారు. ఆ హేతువుచేతనే స్మార్థులు పంచదేవతా పూజను చేయుచున్నారు. ఈశ్వరుని ఎల్లప్పుడును ధ్యానము చేసి అనఁగా సర్వకాలముయందును యెడతెగని ప్రవాహమువలె జపించుట ముఖ్యము. జపమనఁగా వాచక, మానసిక కాయిక భేదములను బట్టి, ఉత్తము, మధ్యము, అధమాధికారులకును, మానసికము, ఉత్తమాధికారులకును చెప్పఁబడెను. వాచకము రెండువిధములు. ఉపాంశుకమని, శాబ్దికమని, ఉపాంశుకమనఁగా ఇతరులకు శబ్దము తెలియకుండ పెదువులు కలిపి పలుకు శబ్దము. శాబ్దికమనగా, ఇతరులకు తెలియునట్లు కంఠబ్బలమున్నంతవరకు శబ్దము. జపమనఁగా, వాక్కుచేత పైని చెప్పఁబడిన వేదము రెండువిధములుగానున్నవి.విష్ణుసహస్రనామములు భగవన్నామములు, స్మరించుట, ఇందుకు వ్యాసస్మృతి ప్రమాణము

౹౹కృతేతపశ్చరేన్నైవ త్రేతాయాంయజ్ఞమేవచ
ద్వాపరే పూజయాచ్చైవః కలౌసంకీర్త్యకేశవం

హరేర్నామైవ నామైవ నామైవ మమజీవనం
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా.
కృష్ణేతిమంగళం నామయస్యవాచిప్రవర్తతే
భస్మీభవంతి రాజేంద్రమహాపాతక కోటయః
వాచకం మానసంపాతం కర్మణాసముపార్జితం
శ్రీరామస్మరణే నైవవ్యపోహతినసంశయః
మహాదేవేతివక్తారం దృష్ట్వైవయమకింకరాః
పలాయంతే మహాభీతాః స్మరంతో యమశాసనం."

అని యుండుటచేత ఈభగవన్నామమును స్మరించుట వాచకజపమని పేరు. కాయికమనగా శరీరముచేత చేయబడు కర్మలుఅనగా దేవాలయమునందు ప్రదక్షిణములు సూర్యనమస్కారములు హస్తములచేత చేయు పూజలు మొదలుగునవి. ఈకాయికజపము, గురువునందు కూడ, ముఖ్యముగ చెప్పఁబడుచున్నది. "యథాదేవేతథాగురౌ" అనియుండుటచేత చతుర్విధ శుశ్రూషలు కూడ కాయికమని చెప్పఁబడుచున్నది. చతుర్విధశుశ్రూషలనఁగా, అంగశుశ్రూష, వాచకశుశ్రూష, ఏకాంతశుశ్రూష, పరిచర్యశుశ్రూష అని చెప్పఁబడును. అంగశుశ్రూష యనఁగా గురువుయొక్క పాదములు, దేహము మొదలగు వానిని సమర్దనచేయుట వాచకశుశ్రూషయనఁగా చెప్పినవాక్యమును చేయుట ఏకాంతశుశ్రూష యనగా బ్రహ్మము నీవని చెప్పిన వాక్యమును శ్రవ

ణముచేసి దానిని అనుసంధానముచేయుట, పరిచర్య శుశ్రూష యనఁగా బాహ్యమునందు గురువుచెప్పిన పనులన్ని చేయుట అంతరమునందు గురువువల్ల శ్రవణముచేసిన ప్రకారము మననముచేసి శ్రవణమననములచేత తేలిన అర్థమును, ధ్యానము చేయుట. ఉపాసన యనఁగా పైనిచెప్పఁబడిన నామములను మంత్రములను ఆలోచించుట. ఉపాసనము మూడువిధములు, స్థూలము, సూక్ష్మము అతిసూక్ష్మము. స్థూలమనఁగా మంత్రములయొక్క అక్షరములను యోచించుట. సూక్ష్మమనఁగా మంత్రమందుండే అక్షరములయొక్క స్థానములను కనిపెట్టి, ఏయేఅక్షరములు ఏయేస్థానములయందున్నవో, ఆయాస్థానములను యోచించుట అతిసూక్ష్మమనఁగా, దేహమునకు మధ్యస్థానము కుండలి అని పేరు లేక కందమని పేరు. దేహము 96 అంగుళములు 8జానులుకలది దీనిమధ్యప్రదేశము మూలాధారమునకు ఆరు అంగుళములపైనను స్వాధిష్ఠానమునకు 9 అంగుళములకు క్రిందను కుండలియుండును. అది సర్పాకారముగా మూలాధారము మొదలుకొని సహస్రారమువరకు వీణాదండమువలెనే 33 మెట్లుకలదై యుండును. దేహమందుండు 72 వేల నాడులలో 101 నాడులు ప్రధానములైనవి. ఈ 101 నాడులలో 10 నాడులు మిక్కిలి ప్రధానము. ఈ 10 నాడులలో 3 నాడులు అంతకంటె ప్రధానము యీ 3 టిలో ముఖ్యము ఇడా, పింగళా, సుషుమ్న అని పేరు. ఇడా అనఁగా కుడిముక్కు

మొదలుకొని గుదస్థానము వరకు వ్యాపించిననాడి. పింగళ యనఁగా వామభాగము మొదలుకొని గుదస్థానము వరకు వ్యాపించిననాడి. సుషుమ్న యనఁగా మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి తాలువులమధ్య అధోముఖముగా మేక గళస్తనముల వలనే సూక్ష్మరంధ్రము కలదై ఇడా పింగళా మధ్యనున్నది. పై చెప్పిన కుండలి సుషుమ్నయొక్క అధోముఖరంధ్రమును పడగ చేత కప్పి బ్రహ్మరంధ్రము పర్యంతము ఉండుటచేత బ్రహ్మరంధ్రమును మూయుచున్నది. కాబట్టి సర్వవ్యాపకమై నిరామయమై నిర్వికల్పమైయున్న బ్రహ్మము బ్రహ్మరంధ్రమందు తేజోమయ స్వరూపమై పైని చెప్పబడిన సుషుమ్నానాడియందున్న సూక్ష్మరంధ్రముద్వారా అధోముఖమై వాయువు స్వరూపమై ప్రాణరూపమై ఆగ్నేయచక్రము మొదలు మూలాధార పర్యంతము వచ్చి ఆప్రాణరూపమైన వాయువు తిరిగి పైకి నడుచునప్పుడు సుషుమ్న రంధ్రమును కుండలి కప్పుటచేత కుడివైపుగాని యెడమవైపుగాని నడిచి నాశారంధ్రములనుండి తిరిగి సుషుమ్నలోకి వెళ్ళక వెలుపలకు 12 అంగుళములు వచ్చుచున్నది. తిరిగి నాశికారంధ్రములలోనికి పోవునప్పుడు 9 అంగుళములు మాత్రమే పోవుచున్నది. 3 అంగుళములు వెలుపల వాయువుతో గలసి పోవుటచేత పురుషునకు క్షణక్షణే ఆయువు క్షీణమవుచున్నది.

ఇట్లు వాచక, కాయిక, మానసికములైన మూడువిధములచేతను ఎల్లప్పుడు "అతిభక్తిబెంచి" ధ్యానము చేయవలయును.

భక్తి మూడువిధములు.

క్రియాభక్తి, యేకాంతభక్తి, రహస్యభక్తి. క్రియాభక్తి రెండువిధములు భాహ్యము, అంతరము. భాహ్యమనఁగా విగ్రహాకారాదులయందు పూజాస్తోత్రాదులు చేయుట.

అంతరమనఁగా—తనయిష్టమైన దైవమును ఒక విగ్రహాకృతిగా మనస్సునందుంచి మానసికము చేతను పూజా, స్తవాదులు చేయుట, యేకాంతభక్తి యనఁగా రెండవ స్వరూపము లేదని ఉన్నది ఒకటేయని ధ్యానముచేయుట అని రెండువిధములు. వైకుంఠ కైలాశాదులయందు శివవిష్ణు స్వరూపములు అనంతకల్యాణగుణ విశిష్టముగ నున్నవని ధ్యానముచేయుట ఒకటి. ఆశివవిష్ణువులనే హృదయ పద్మమందు నిలిపి నేనని ధ్యానముచేయుట రెండు. రహస్యభక్తి అనఁగా జీవాత్మ పరమాత్ములను ఏకీభవింపఁజేసి ప్రణవాత్మకమైన బ్రహ్మస్వరూపమును దహ్రమందు ధ్యానముచేయుట, దహ్రమనఁగా జాగ్రత్స్వప్న, సుషుప్తులను తెలిసికొనిన తెలివి. దానియందు ఆత్మైక్యాను సంధానము చేయుట అని రెండువిధములు బ్రహ్మస్వరూపము సర్వవ్యాపకమై సర్వస్వరూపమైయున్నది. అది సత్వరజ స్సు

మోగుణములతో గలసి సృష్టిస్థితిలయములనుచేయు కర్తలైన బ్రహ్మ,విష్ణు, రుద్ర, స్వరూపములుగ ఉన్నదని తెలిసికొనుట ఒకటి జాగ్ర, త్స్వప్న, సుషుప్తుల ననుభవించుటకు స్థానములైన స్థూల, సూక్ష్మకారణ దేహములయందు విషయములను బాగుగ దెలిసికొనుటయును మనఃకల్పితములయిన వాసనా విషయములను, తెలిసికొనుటయును విషయము లేనప్పుడు అజ్ఞానముతో గలసి స్వరూప సుఖమును అనుభవించుటయును తెలిసికొని దేనియందు నంటకయే యవస్త వచ్చినప్పుడు ఆ యవస్తను యేవిషయము దగ్గిరకు వచ్చినప్పుడు ఆవిషయమును తెలిసికొని స్పటికమందు యేపుష్పకాంతి వచ్చినప్పుడు ఆకాంతిని ప్రతిఫలించినట్టును యేరంగుగల గాజుపాత్రమునం దుంచిన దీపము ఆరంగువలెనే ప్రకాశించునట్లు అవస్త్రాత్రయమునకు సాక్షియైన తన తెలివి కాలత్రయమందు నశించని బ్రహ్మస్వరూపమే బ్రహ్మస్వరూపము తనరూపమైన తెలివియేయని అతిసూక్ష్మముగా ధ్యానించుట. రెండవవిధము యీ మూడువిధములైన భక్తులను హెచ్చుచేసిరి.

ధ్యానము, ప్రదక్షిణము, నమస్కారము, నీనామ సంకీర్తనలు ఉత్కృష్టమైన జపముచేయుట. అంతరింద్రియ నిగ్రహము, మోక్షము, నిదర్శనములని అష్టవిధములు.

ధ్యానమనఁగా—ప్రతిబంధములేక ఆత్మ తానని నిశ్చయమును బొందుట యదార్థమైన ధ్యానము. అంతఃకర

జాల సాక్షినై అంతఃకరణ ప్రతిబింబ క్రియలను పొందక యుండుటయే విస్తారముగా భక్తి చేత ప్రాప్తించి సర్వపరిపూర్ణ సాక్షియుండు చలించక యుండుటే ప్రదక్షిణము. బాగుగా తాంపభావమును నొంది సోహంభావమును పొందుటే నమస్కారము. ఆత్మజ్ఞానమందు కదలిక లేక ఏకనిష్ఠగా ఆనందమును పొందుటే నీనామ సంకీర్తనలు చేయుట. ఎక్కడమాంది యు లోపల వెలుపల నిండి పూర్ణ భావ సంపత్తులను పొందుట ఉత్కృష్టమయిన జపము చేయుట. విచారించిన, యెదుట కలుగు పుణ్యపాపములను నిద్రించుచున్నవాని వలెనే మరచి యుండుట. దివ్యమైన అంతరింద్రియ నిగ్రహము. లోపల వెలుపల కనబడు పదార్థము లన్నిటిని, నామరూపములు వదలి, అఖండ భావమును పొందియుండుట అనిర్వాచ్యమయిన మోక్షము. ఈ మోక్షమే నిదర్శనము ఇంతియె కాని నేనైన ఆత్మ బ్రహ్మమునందు వేరుగా నొక దానిని మనస్సుచే భావించుట పనిలేదు. మనస్సు రెండు విధములు.

“మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధంచా శుద్ధమేవచ
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం
బంధాయ విషయాసక్తం ముక్తినిర్విషయం స్మృతం.”

అని చెప్పుటచేత మనస్సును రెండుమార్గములు తేర్పడెను. ప్రవర్తన అనియు రహస్యమనియు చెప్పబడును. ప్రవర్తన

అనఁగా ఇంద్రియాదుల ద్వారా వెలుపలకు బయలుదేరి ఎదుట నున్న విషయము ఎట్టియాకృతి అయితే తానుకూడ అట్టిస్వరూపములు కలదై నాది, నాసంబంధమయినదని గ్రహించు జ్ఞానము.

రహస్యమనఁగా శబ్దాదివిషయములను శ్రోత్రాది ఇంద్రియముల కంటకుండ మనస్సును బ్రహ్మాత్మానుభవజ్ఞానముగా నుంచుటకు యోగపతంజలి సూత్రము కఠోపనిషత్తుయం దేమి చెప్పుచున్న దనఁగా

"చిత్తవృత్తి నిరోధో యోగః తన తత్త్వావస్థానం మోక్షః" ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చపరంమనః "మనసస్తు పరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః పురుషాన్న పరంకించిత్సాకాష్ఠా సాపరాగతిః"

ఇంద్రియములను గుఱ్ఱములుగాను మనస్సు కళ్లెముగాను బుద్ధిసారథిగాను, ఆత్మను రథికునిగాను, చెప్పి, వశ్యములైన ఇంద్రియములు ఉత్తమాశ్వములు వలననే చేరతగిన స్థానమును పొందించుచున్నవి. అదియే రహస్యమార్గము. దుష్టాశ్వములు వలెనే వశ్యముగాని యింద్రియములు సన్మార్గమును తప్పించి విషయరూపమైన సంసారమునకు చేర్చును. ఇదియే ప్రకటనమార్గము.

"ఆత్మానంరథినంవిద్ధి శరీరం రథమేవతత్
ఇంద్రియాణి హయానాహు ర్మనః ప్రగ్రహఏవచ
బుద్ధించ సారథింవిద్ధ్యాత్ ఇతిప్రాహుర్మనీషిణః"

అని యీశ్రుతి అంతయు రహస్యమార్గమునే బోధించుచున్నది. ఇదియునుగాక రహస్యశబ్దమునకు గుహ; అనికూడ అర్థము, ఆ గుహరూపమే పరమాత్మస్వరూపము ఇందుకు ప్రమాణము.

"కరణాత్ కారణం కర్త వికర్త గహనోగుహః యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్ త్రిణిగుహాయాం దేహాభ్యాంతం ప్రాణః ప్రాణాదభ్యంతరం మనః తతఃకర్తా తతోభోక్తా గుహాసేయం పరంపరా" అని విష్ణుసహస్రనామములయందును విద్యారణ్యులు పంచదశియందు గుహాశబ్దార్థమును వివరించియున్నారు. అతిశయించునట్లు గంగాయమునాస్వరూపమయిన, ఇడాపింగళయొక్క, మధ్యను, అనగా ఇడాపింగళలను నాడులు కుడియెడమలయందు నలుపు తెలుపు వర్ణములుగలవై యుండును ఋగ్వేదమంత్రము ప్రమాణము.

"సితాసితేసరితేయత్ర సంగతే తత్రాప్లుతాసః దివముత్పతంతీ యేవైతన్వాం విసృజంతి ధీరాస్తే మృతాసో అమృతత్వభజంతి." అని యుండుటచేత నలుపు తెలుపుగలిగిన నదులు అనగా గంగాయమునలు అవే కుడియెడమ నాడులు. వాని మధ్యయందున్న సరస్వతి యను పేరుగల సుషుమ్నా నాడి.

యందు పై చెప్పఁబడిన రెండు నాడులు కలియుచున్నవి. అక్కడ స్నానముచేయువారు స్వస్వరూపమును పొందుచున్నారు. అక్కడ దేహము వదలినవారు మరణధర్మములేని జ్ఞప్తియైన స్వప్రకాశమే యగుచున్నారు.

> ఇడా భాగీరథీగంగా పింగళా యమునానదీ
> తయోర్మధ్యగతానాడి సుషుమ్నాఖ్యా సరస్వతీ
> ధ్యానహ్రదేజ్ఞానజలే రాగద్వేషమలాపహే
> యస్స్నాతిమానసేతీర్థే సయాతిపరమాంగతిం. ''

ఇదియునుగాక అదియే కాశీక్షేత్రము అని చెప్పఁబడుచున్నది. కాశి యనఁగా స్వయంప్రకాశముగ ప్రకాశించు జ్ఞప్తి అదియే వారణాసి యని కూడ చెప్పఁబడును. వారణాసి యనఁగా పాపము లన్నిటిని నివారణచేసి అనర్థకమయిన మూలవిద్యను నశింపఁజేయునది. దీనికే పిండబ్రహ్మాండైక్యము చెప్పఁబడి బ్రహ్మాండము అంతయు దేహమందు ఉన్నట్లు చూచే దృష్టి చేత పైని చెప్పఁబడిన త్రివేణిసంగమము భ్రూమధ్యమని చెప్పఁబడును. ''వారాణసీ భృగోర్మధ్యే ప్రకాశతే'' అనియుండుటచేత కాశీ పంచక్రోశముల దూరముగలది. దేహము పంచకోశములు గలది గనుక కాశీక్షేత్రము శరీరము త్రివేణీసంగమము శృంగాటకము. అనఁగా భ్రూమధ్యస్థానము త్రికూటమనిపేరు. ఆనాడుల నడుమ స్వప్రకాశమైన, కాంతి

"గతిషు" అనే సూత్రముచేత ప్రకాశమని చెప్పఁబడును. అట్టి నాడికాగ్రమున వీణాదండమువలె మూలాధారము మొదలు భ్రూమధ్యమువరకు వ్యాపించియున్న నాడియొక్క అగ్రమునందు పొంది, వరుసగా ఆ రెంటిమీఁద పైన చెప్పఁబడిన ఇడాపింగళాస్వరూపము లయిన గంగ యమునమీఁద నొప్పునట్లుగా మేరువుపర్వతముయొక్క శిఖరమునందు, ఇక్కడ మేరువుశబ్దమునకు పైన చెప్పబఁడిన త్రికూటస్థానము అర్థము. సప్తకుల పర్వతములు బ్రహాండమం దున్నవి. అవి యిక్కడ భ్రూమధ్యము, చక్షుస్సులు, నాశికలు, ముఖము, అష్టదళ పద్మములు అను తాలుమూలములు, ఈ పదింటియందు యేడు పర్వతములు. ఉన్నవి.

"మేరుస్థానం భ్రూమధ్యం" అను శ్రుతి ప్రకారం మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహిత, విసుత్తు, అజ్ఞేయ మను యారుచక్రములే తిరుపతి ఆరుపర్వతములుగలదై ఏడవపర్వతమున శ్రీవేంకటేశ్వర పెరుమాళ్లు నివసించునట్లును శ్రీరంగమునం దారుప్రాకారములే మనయం దారు చక్రములుగాను ఏడవప్రాకారమునందు శ్రీరంగనాదుఁడు నివసించియుండునట్లు మనయం దేడవయాధారమునందుండు సహస్రారమునందు ఆపోజ్యోతియున్నది ఈయర్థమునుబట్టి పై దేవాలయము లేర్పడినవి. ఆమేరువుయొక్క అగ్రమందు ప్రకాశించునట్లుగ జ్ఞానస్వరూపమైన కళయగును అనగా ఇడాపింగళయందు ఊర్ధ్వ క్షిప్రపసరించు

నపుడు రాత్రియు పగలునై జాగ్ర, త్స్వప్న, సుషుప్తులను హృదయము, కంఠ, నేత్ర, స్థానములయందు పొందుచున్నది. అట్టి జ్ఞప్తిని. అధోముఖముగా వ్యాపించిన కుండలిని ఊర్ధ్వ ముగా చేయునపుడు పైనిచెప్పిన భ్రూమధ్యస్థానమందు తుల్యమై జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను, తెలిసికొనే జ్ఞప్తి కళా మాత్రుఁడై యోగియుండును. అట్టిస్వరూపుఁడై నట్టియు, మహా దవ్యక్తాదులకు, పరమైన ప్రణవస్వరూపముగుచు అనఁగా ప్రణ వములు రెండుభాగములు — అవి పరయని, అపరయని చెప్పఁ బడును అపరయనఁగా — ఋగ్వేదాదులు, వానియందు చెప్ప బడిన కర్మలు వానిని చేయడమునకు చెప్పఁబడిన ఆశ్రమములు, జాతులు, ఇవియన్నియు అపరయని చెప్పఁబడును పరమనఁగా— నేత్రాది ఇంద్రియములకు తెలియనిదియు, మనస్సుకు అందని దియు, అన్నిటిని తెలిసికొనే జ్ఞప్తిస్వరూపమైన అక్షరము అనఁగా కూటస్థుఁడు "ద్వేదివే వ్యేదితవ్యే, పరాచా, పరాచా" ఇక్కడ దివ్యయనఁగా ప్రణవమున కర్థము, ప్రణవము విభజింపఁ బడినపుడు, జ్ఞానకాండ, కర్మకాండ లైన వేదమగును. అట్టి విభాగముచేతను, తెలిసికోబడిన పరాస్వరూపుఁడైనట్టి యని అర్థము. అంతకు పైని మరియొకటి లేదు. ఇతరప్రకాశములు లేకుండ తానే ప్రకాశించునట్టి సుబ్రహ్మణ్యుఁడనే పేరుగల గురువుయొక్క సుబ్రహ్మణ్యగురువనఁగా "బ్రహ్మణేస్థితః బ్రహ్మ ణ్యః సృష్టుబ్రహ్మణ్యః సుబ్రహ్మణ్యః" బ్రహ్మయందున్నవాఁడు

బ్రహ్మణ్యుఁడు తిరిగి అవ్యక్తాదులను పొంది వాని కార్యముల యందు మోహము లేనివాఁడు బ్రాహ్మణుఁడు (బ్రహ్మాత్మైకానుసంధానము చేయువాఁడు బ్రాహ్మణుఁడు.

"తమేవధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాంకుర్వీత బ్రాహ్మణః" అప్రసిద్ధమై నిత్యనిరతిశయమై వెలుగుచున్న తెలివి తానని యెరుగువాఁడు బ్రాహ్మణుఁడు బ్రహ్మాత్మ స్వరూపము బ్రహ్మ ప్రణవము. ఆప్రణవము తెలియనివాఁడు బ్రాహ్మణుఁడు కాఁడని చెప్పుచున్నది.

"అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం ఓంకారం యోనజానాతి బ్రాహ్మణోనభవేత్తుసః ఋచోఅక్షరే పరమేవ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుర్య స్తన్నవేద కిమృచాకరిష్యతి యఇ త్తద్విదు స్తఇమే సమాసతే" "ఓంకారయేవేదంసర్వం"

అనఁగా ఈశ్వరత్రయము (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుఁడు, జీవత్రయము (ఇడా, పింగళా, సుషుమ్నా) ప్రత్యగాత్మ, పరమాత్మయను భేదము మాయచే వచ్చినది అకార, ఉకార, మకార, తుర్యములు (అ, ఉ, మ, తుర్య) చతుష్పాదములు జాగ్రిత, స్వప్న, సుషుప్తులు, త్రిస్థానములు, (బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, రుద్ర, సదాశివులును పంచదేవతలతో గూడి

చదిజగత్తు, ఇదియే ఓంకారము ఈఓంకారమే నాలుగు వేదములుగా యున్నది దీని నెరుగువాఁడే బ్రాహ్మణుఁడు. ఈజగమంతయు నోంకారమే ఓంకారమే సమస్తభాగముల. నున్నది ఓం, అనెడు ఏకాక్షర ప్రణవమంత్రమును శ్వాస మును బీల్చునపుడు ఆశ్వాసముతో గూడ ఓం అను ప్రణవ మంత్రమును జేర్చి ఓంకారముతో బీల్చుకొని కూటస్థబ్రహ్మ ములో కొంతసేపు ప్రణవమంత్రములతో కుభించి శ్వాస మును విడుచునపుడు శ్వాసముతో నోంకారమును జేర్చి ఉఛ్వాస నిశ్వాసలు తిన్నఁగా విడుచుచుండవలయును. ఇట్లు అభ్యసించువాఁడుహరి, హరాదిదేవతలకుసమానుఁడగుచున్నాఁ డని బ్రహ్మవిద్యోపనిషత్తుయందు చెప్పుచున్నది. ఇట్టి బ్రహ్మ త్వమును ఆచార్యునిచే పొందవలయును. ఆచార్యుఁ డనఁగా "అచినోతి, అర్థాదితి ఆచార్యం" సమస్తవేదవేదాంత రహ స్యములను బోధించువాఁడు ఆచార్యుఁడు ఆచార్యునకును, దేవునికిని భేదములేదు. "యథాదేవే తథాగురౌ" అని చెప్పుటచేత త్రిమూర్తి స్వరూపుఁడు గురువు.

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురువేనమః" కనుక ఇట్టి గురువువలన ఆత్మజ్ఞానమును పొందవలయును గురువనఁగా నిర్గుణపరబ్రహ్మము, చరణములనఁగా ఆబ్రహ్మమునందు కల్పిత మయిన సత్వరజో గుణములు, అవి యెరుపు తెలుపుగలవియని

ఆచార్యులవారిచేత చెప్పఁబడును. శిష్యునియొక్క హృదయ
పరిపాకమును తెలిసికొని అజ్ఞానమును పోఁగొట్టుటకు హ స్త
మ స్తక సంయోగముచేత నీవు బ్రహ్మవని మహావాక్యమును
ఉపదేశించిన దేశికస్వామికి అనాత్మస్వరూపములయిన సంప
దావత్తుల, దేహాది, ప్రాణములను వారికి సమర్పించి ఆత్మజ్ఞాన
మును పొందవలయును. శ్లో॥ వందేగురుపదద్వం ద్వమనా
జ్ఞానసగోచరం రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం
మహః॥ "అక్షరత్వా రేణ్యత్వాద్ధూత సంసారబంధనాత్ తత్వ
మస్యాది లక్ష్యత్వాదవధూతఇ తీర్యతే" 'అచలితపరమహం
సాఖ్యసద్గురులకు' చలించనట్టి పరమహంసయను పేరుగల
యోగ్యమయిన గురుస్వాములను ఇచ్చుట, పరమహంసశబ్దము
నకు సన్యాసాశ్రమములయిన ఆరింటిలో నాలుగవ యాశ్ర
మము సన్యాసాశ్రమములు ఆరువిధములు ఏవనఁగా కుటీచక,
బహూదక, హంస, పరమహంస, అవదూత దిగంబరులని
చెప్పఁబడును, కుటీచకు డనఁగా—తన గృహమందు దారా
పుత్రాదులతో నుండి, ఒక యజ్ఞోపవీతము, అర్ధశిఖా, కాషా
యవస్త్ర, దండ, కమండలములను ధరించి వైరాగ్యము కలి
గెనా, లేదా యని సంశయము పోవువరకు నుండువాఁడు,
బహూదకుఁ డనఁగా, తనయింటియెదుట మఠముగాని, శాల
గాని కట్టించుకొని దారాపుత్రాదులను జూచుచు పయిని
చెప్పిన ప్రకారము యజ్ఞోపవీతాదులను ధరించి అష్టగృహముల

యందు మధుకరము తెచ్చుకొని భక్షించువాఁడు. హంస యనఁ పయినచెప్పిన ప్రకారము యజ్ఞోపవీతాదులను ధరించి జటాధారి యయి ఒక ఉట్టి తవుగాల భిక్షాపాత్రి పుచ్చుకొని దేశాటనము చేయువాఁడు. పరమ హంసయనఁగా ఈషణాత్ర యత్యాగము జేసి శిఖా యజ్ఞోపవీతములను వదలి శ్రుతి యందు చెప్పిన ప్రకారము తుత్కాలమందు తన్నివృత్తి చేయుచు నిదిధ్యాసను పొంది లోకోపకారార్థముగా తిరుగు వాఁడు. ఈచెప్పఁబడిన నలుగురిలో కుటీచక, బహూదక, హంస, బాహ్యావృత్తిగలవాఁడు, పరమహంస అఖండాకార వృత్తిగలవాఁడు పై మువ్వరు సాధకులు. పరమహంస బ్రహ్మస్వరూపుఁడు. అవధూత యనఁగా అధికార తారతమ్య ముచేత ఆత్మ తాను ఒక్కటైన సమాధిని పొంది బాహ్యా భ్యంతర వృత్తులను దండక మండలములను పరిత్యజించి కంఠము మొదలు పాదమువరకు ఏకశాటిగలవాఁడై కాలత్రయానుష్ఠా నమును వదలి అరణ్యగ్రామములయందు హింసాది జంతు భయములేక ఒక్కఁడునై కరపాత్రచేత భిక్షాహారము చేయు వాఁడు. దిగంబరుఁ డనఁగా ఏకశాటిని కూడ వదలి చెట్టు క్రిందగాని లేక దేవాలయమునందుగాని పాడుఇండ్లయందు గాని ఘోరాటవియందుగాని కొండచలమువలె పడియుండి బాహ్యాభ్యంతరవృత్తులను స్వయంప్రకాశమైన తనయందు అగ్నియందు బుట్టిన మినుగురులు వలనే, చూచుచు నోటికి

అందినవస్తువును, ఘణాతుర వ్యాయమముగ ననుభవించుచు, నుండువాఁడు. ఈయూరుగురిలో పరమహంస—లోకరక్షణ ముగ, నితరులను గూర్చి బోధించి ముక్తిని బొందఁజేయు వాఁడు.

బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, సన్యాసి, అని నాలుగాశ్రమములు—వీనిలో ఒకదానిని వదలి యొకదానినిపొంద వలసినది. ఏబ్రహ్మవేత్తలు అరణ్యమందు తపంబుచేయుచు భిక్షాచర్యను జేయుచున్నారో వారు ఆత్మను బొందుచున్నారు. కర్మచేతను సంతానముచేతను, ధనముచేతను, మోక్షమురాఁజాలదు సంతానములేని గృహస్థు ఈసంసారము దుఃఖమని తెలిసి భార్యతోఁ గూడ నరణ్యమునకు వెళ్ళి అక్కడ అగ్నిహోత్రాదికము చేయుచు యమాదుల నభ్యసించవలెను. సంతానముగల విద్వాంసుఁడు భార్యను కుమారునకు ఒప్పగించి తాను అరణ్యమునకుఁ బోయి తపంబుచేయువలయును. స్త్రీ చిన్నతనమందు తల్లిదండ్రుల యాజ్ఞ మీరగూడదనియు యవ్వనమందు పతియాజ్ఞయందును వార్ధక్యమందు పుత్రుని యాజ్ఞయందు నుండి పతివలనగాని కుమారునివలనగాని వైరాగ్యాది బోధకలదిగా నుండవలయుననెడి ధర్మములు చెప్పఁబడినది.

## తారకయోగ లక్షణము.

ఈ తారకయోగము రెండువిధములై యున్నది. ఈ రెండువిధములైన తారకము "నేనె" "ఇంకొకటికాదు" పూర్వతారక ఉత్తరతారకమని చెప్పఁబడును. వీనిలో ముందుగా పూర్వతారకయోగము ప్రేమతో చెప్పుచున్నాఁడు. యోగ్యముగా సకలమూర్తి స్వరూపంబై, ప్రకాశించుచున్న విలాసరూపము, గుణము గలిగినట్టి, ఆసూర్య, చంద్రబింబముల మధ్యయందు తళతళయసి వెలుగుచున్న నల్లగ్రుడ్డులోవల ఉనికిగా అక్కడ ప్రకాశించుచున్న ఆతెలివిని భ్రూమధ్యస్థానమునందు బొంధించి కొంచెముగా నాకళను, భ్రూమధ్యస్థానమునందు ప్రకాశింపఁజేసి, ఆపైని కొంచెము నేత్రములపైకి నెక్కించి సుషుమ్నా (భ్రూమధ్య)స్థానమునందు నిలిపి చూచినయెడల అక్కడ ఆత్మజ్ఞాన ప్రవాహము ఆ సమయమందు విశేషమై అనేకవిధములుగా తోఁచును. అనేకవిధములుగ తోచిన ఆత్మప్రవాహము, చిత్కళారూపమై యుండునుఆచిత్కళను మనస్సు చూచుచు మనస్సు చలనము లేక దట్టమైన జ్ఞానము ఆకళయందే నిలిచియుండును. మనస్సు ఆచిత్కళలను చూచుచు నిలిచియున్న సమయమందు, అప్పుడు మూ ప్రాణవాయువును పట్టుదలతో నక్కడనే నిలిచియుండును. మనస్సు నిలిచినప్పుడు ప్రాణవాయువు సహితము

నిలిచిపోవును. అనుకూలముగా మనఃప్రాణములు రెండు కలసియున్నప్పుడు నిరుపమానమైన బుద్ధికి, అప్పుడు ఏకాగ్రత కలుగును. ఆ ఏకాగ్రత గల్గినబుద్ధి, సగుణభావంబు లన్నియును పొరపాటు లేకుండునటుల చూచుచుండును. ఆచిత్కళలను చూచునట్టి దృష్టియొక్క ప్రవాహమును అభ్యాసము చేయు మార్గముచేత చూడఁగా చూడఁగా సచ్చిదానందమ నెడి అమృత సముద్రమందు కనఁబడు పదార్థము లన్నియు లీనమైయుండు సమయమందున యీ కనఁబడు పదార్థములన్నిటిని తెలిసికొన్న ఆత్మయొక్కటె మిగిలియుండును. ప్రకాశించుచున్న ధ్యాతృ, ధ్యాన, ధ్యేయములలో ధ్యాత, ధ్యానములను వదలి, కేవల ధ్యేయరూపమైన యీ చిత్కళను వదలక ప్రకాశించుచుండును, అదియె అమనస్కమని పేరుగల శ్రేష్ఠమైన యోగము దానికంటె నెక్కువైనదిలేదు. అధికమైన గౌరవము కలుగునట్లు త్రికూటస్థానమునకు పూర్వాభాగమందు నాలోచించగా పవిత్రమైన స్థలమునందు పృథివి మొదలగు నైదు తత్వములు పట్టుగా నైదు రంగులతోఁ ప్రకాశించుచుండును. ఆ పంచభూతములయొక్క రంగులలో, అగ్నిమండలమున్ను అగ్నిమండలములో, సూర్యమండలమున్ను, సూర్యమండలములో చంద్రమండలము నుండును. స్వల్పమైనట్టి యంకుర మొకటి యామండలత్రయ మధ్యమం దుండును. అది శుభప్రదమై, విశేషమైన కాంతు

లచే బ్రకాశించుచున్నదయి యున్నది. ఆయంకురము సకల ప్రపంచమునకు కారణమై యున్నది. ప్రపంచమునకు గారణమైన కాంతులచే బ్రకాశించుచున్నదయి యున్నది. ప్రపంచమునకు గారణమైన యాస్థలమందు సమస్తదృశ్యములు ప్రవర్తించుచుండును. ప్రసిద్ధముగ దృశ్యము మొదలు మహత్తువరకు ప్రకాశింపఁజేయుచున్న, అవ్యక్తముకంటెఁ బరమైన, బ్రహ్మము విచారించగా మిక్కిలి యాపోజ్యోతి యనే గమనముచేతను లేక హంసగమనముచేతను రాత్రింబగళ్ళు పూనికతో లోపల వెలుపల ప్రకాశించుచుండును. ఈవిధమున నుపనిషదర్థములను సూచనచేయునట్టి వాక్యములను రెండవ చిత్తమును వదలి దృఢముగా శ్రవణము చేసినయెడల పరికాశించునట్లు నల్లని మేఘ మధ్యమందు వెలుఁగుచున్న మెరుపు తీఁగెవలెను, పరికాశించుచున్న నివ్వరి ధాన్యము యొక్క గింజవలెను యున్నటువంటియు, విచారించగా పచ్చనయిన కాంతితో సమానముగా బ్రకాశించుచు మిక్కిలి యగ్నిజ్వాలయొక్క మధ్యమందు బాగుగ వ్యాపించి నిర్గుణ నిర్వికారమైన పరమాత్మ యుండును. ఈ పరమాత్మయే బ్రహ్మము, శివుఁడు, విష్ణువు, దేవేంద్రుఁడు, అక్షరుఁడు, అవ్యక్తపరమయినట్టి స్వరాట్టు, నామరూపములకు నాధారమయిన సత్తాయనియు జీవన్ముక్తులయిన ఋషులు చెప్పుదురు, భేదవాదములలో నెంతమాత్రము ప్రవేశింపరు. తత్వ

మును తెలియనివారు మాకు యుక్తిచేత నెక్కువ జ్ఞానము కలదని మిక్కిలి దైవమందు భేదము కలదని చెప్పెదరు. బాగుగ శ్రవణ, మననాదులు చేసినయెడల నీ పరమాత్మ యందు భేదము కొంచెమైనను లేదు. బంగారు యొకటియై అనేకాభరణములయి శృంగారములచేత చిత్రంబులైన నామ రూపంబులు వేరుగా నుండును. ఉన్న బంగారము కొంచె మైన భేదముండదు. ఆ సువర్ణము వలనే ప్రకాశించు సదా నంద రూపమైన పరమాత్మను చూచుటకు ఉనికిపట్టయిన శాంభవిముద్రకలదు.

ఏకమై, రెండవదిలేనిదై ప్రకాశించున్న నాయాత్మను సావదాన చిత్తముచేత, పాడ్యమి, అమావాస్య, పౌర్ణమి, యను మూడువిధములైనదృష్టులు కలిగిన శాంభవీముద్రను తెలిసికొనవలయును. అనఁగా నిమీలితదృష్టి, పాడ్యమిదృష్టి యనియు కన్నులుమూసికొని చూచిన దృష్టి అమావాశ్య యనియు రెప్పపాటులేక చూచినదృష్టి పౌర్ణమాస్యయని చెప్పఁబడును. ఈమూటిలో మొదటి రెండును వదలి రెప్ప పాటులేకుండ పౌర్ణమాస్యదృష్టిని బొందవలయును తరువాత ఉపాయముచేత లక్ష్యమనెడి వెలుపలదృష్టిచేత చూచుచు రెప్పపాటులు లేకుండునటుల ప్రకాశించునది శాంభవిముద్ర యని చెప్పఁబడును. ఈశాంభవీముద్రను నభ్యసించి చిత్త మును ఏకాగ్రమునందు నిలిపి రెండుజాములు అభ్యసించగా

నప్పుడు మనఃపవనములు రెండును ‘‘యథా జలేజలం క్షిప్తం క్షీరంక్షీరే ఘృతం ఘృతే। అవిశేషో భవేత్తద్వత్ జీవాత్మ పరమాత్మనోః।యథోదకే తోయ మనుప్రవిష్టం తథాత్మరూపో నిరుపాధి సంస్థితః’’ జలములో జలము,పాలలో పాలు, నేతిలో నేయి, కలసి ఏకమై పోవునట్లు జీవోపాధినశించిఆత్మ బ్రహ్మము నందుకలసి యేకమై నిలిచి యుండును. నామనః పవనములలో నొకటి చలించినయెడల రెండవదియు నామార్గమందే ప్రకాశించును. ఆమనః పవనములను రెంటిని చలించనటుల నొకస్థలమందు జేర్చి, అవ్యక్తాది దృశ్యపర్యంతమయిన బాహ్యాభ్యంతరములను మరచి చలనములేకుండును. అదియే ప్రకాశించుచున్న శాంభవిముద్రయని చెప్పఁబడుచున్నది. అనఁగా రెండు నల్లగ్రుడ్లను భ్రూమధ్యంబునందు తెచ్చి, కండ్లను బాగుగ తెరిచి ఆభ్రూమధ్యస్థానమునందు దృష్టిని నిలిపి ఆ పైభాగమునే చూచుచుండుట, పౌర్ణమాస్యదృష్టి యనఁబడును. ఆసమయమున కనుగ్రుడ్లకు బాధకలిగి మంటబుట్టి జలము కారుచుండును. ఆబాధలకు ఓర్చుకొని రెండుజాములు అభ్యసించినయెడల మనఃప్రాణములు ఐక్యమగును. ఇందుకు శ్రుతి.

శ్లో. ‘‘అంతర్లక్ష్యం బహిర్దృష్టి, ర్నిమేషోన్మేషవర్జితా ఏషాసాశాంభవీజ్ఞేయా, సర్వతంత్రేషు గోపితా, తద్దర్శనేత్రిస్రో దృష్టయః, అమాప్రతిపత్పూర్ణిమనేతి, నిమీలితదర్శనమమా

ద్దృష్టిః, అర్ధోన్మీలితం ప్రతిపత్, సర్వోన్మీలిసంపూర్ణిమాభవ
తి, తాసుపూర్ణిమాభ్యాసః కర్తవ్యః, తల్లక్ష్యంనాసాగ్రం,
తదా, తాలుమూలేగాఢతమోదృశ్యతే, తదభ్యాసాదఖండ
మండలాకార జ్యోతిర్దృశ్యతే, తదేవసచ్చిదానందం, బ్రహ్మ
భవతి, తామేవఖేచరీమాహుః, తదభ్యాసాన్మనస్థైర్యం, తతో
వాయుస్థైర్యం, తచ్చిహ్నాని, ఆదౌ తారకవద్దృశ్యతే, తతో
వజ్రకీటకం, తతఃపరిపూర్ణచంద్రమండలం, తతో నవరత్న
ప్రభామండలం, తతో మధ్యాహ్నార్కమండలం, తతోవహ్ని
శిఖామండలం, త్రమాదృశ్యతే, అహన్యహన్యర్ధరాత్రౌ మధ్య
యాభ్యాసేన మనఃప్రాణయోరైక్యంభవతి.'' ఈయర్థమునే
శంకరాచార్యులవారు, హరిస్తుతియందు చెప్పియున్నారు.
''ప్రాణానాయమ్యోమితిచిత్తంహృదిరుద్ధ్వానాన్యత్స్మృత్వాత
త్పునరత్రైవవిలాప్య, క్షీణేచిత్తేభాదృశిరస్మీతివిదుర్యం తం
సంసారధ్వాంత వినాశంహరిమీడే.''

ఈకనఁబడు సకలశరీరములతోఁ గూడుకొనిన పశు, పక్షి మృగాదులయందును నధిష్ఠానముగాఁ బ్రకాశించుచున్న నీపూర్వయోగము, సూర్య, చంద్ర, బింబములయొక్క మధ్యయందు అనఁగా, ఇడా, పింగళలమధ్యయందు, ధగ ధగ ప్రకాశించుచునున్న నల్లగ్రుడ్డులోపల రెండు నేత్రములయందున్న సూక్ష్మరంధ్రములలో నాకాశరూపముగా నున్నది

యొక్కఁటే రూపము, దానిని ఫాలభాగమందు బ్రవేశపెట్టి భ్రూమధ్యస్థానమును గూర్చి క్రమముగాఁ బొందించునట్టి నా తెలివిని నడిమి యిల్లయిన సుషుమ్నా నాడియందు నిలిపి, చూచినయెడల నక్కడ మెరుపులవలెను నక్షత్రములవలెను, మినుగురు పురుగువలెను ననేకవిధములైన నాచిత్కళలును జూచుచున్న మనస్సు చలనములేక విస్తారమైన తెలివితో నాకళలను జూచుచుండును మనస్సు యెక్కడనుండునో ప్రాణముకూడ, అక్కడనే యుండును, ఆమనఃప్రాణములు కలిసి, ఉపమానరహితమైన బుద్ధికి నప్పుడు ఏకాగ్రత కలుగును, ఆయేకాగ్రమందు నీవు దోచునటుల ననేకరూపములయిన సగుణభావములు కనుపించును, వానిని చూచుచున్న దృష్టి చిత్ప్రవాహరూపమైన మార్గమునందు ప్రవేశించును. క్రమముగ నాచిత్కళలను నభ్యసించి చూడఁగాఁ జూడఁగా అప్పుడు మిగిలిన తెలివిధ్యాతృధ్యానములను వదలి, కేవలధ్యేయరూపమై, అమనస్కమను పేరుతోఁ బ్రకాశించును. దీనికంటె నధికమైనది వేరొకటిలేదు.

మంత్ర, లయ, హఠ, యోగములలో రాజై ప్రకాశించుటచే రాజయోగమను పేరు కలిగినది. పవిత్రమైనట్టియు రహస్యమైనట్టియు త్రికూటస్థానమునందు, అనఁగా భ్రూమధ్యస్థానమందు దృగ్, దృశ్య, ద్రష్టలను తెలిసికొనినట్టియు, పవిత్రమైన రంగులు అనఁగా ఎరుపు, నలుపు, తెలుపు, పసుపు

ఆకుపచ్చయును మొదలయినవి కనుపించును. ఆకాంతులలో అగ్నిమండలము, చంద్రమండలము, సూర్యమండలము, ఒక దానిలో నొకటి కనుపించును. ఆమధ్యను నొకయంకురము కనుపించును. ఆయంకురమే సమస్తజగత్తుకు కారణమై యుండును, ఆయంకురమందు బుట్టిన సమస్త దృశ్యములు అవ్యక్తముకంటె బరమైన బ్రహ్మమే అయియుండును. అది సోహంరూపముచేత పగలు రాత్రి అంతర్బాహ్యములయందు యిరువదియొక్క వెయ్యారు నూరులు హంసలు నడుచుచుండును. ఈ " సోహం " " హంసః " అను శబ్దములో రహస్యమైన ప్రణవము ప్రకాశించుచున్నది యదియే యన్నియుపనిషత్తులయొక్క అర్థమై ప్రకాశించుచున్న పరమాత్మ దానిని చిత్తచలనములేక బాగుగ శ్రవణము చేయవలయును.

దీనినే తారకమంత్రమని చెప్పఁబడును. " తారయతి, సంసారార్ణవాదితి, " తారకం. సంసారసముద్రము నెల్లతరింపఁజేయునది తారకము. ఇదియే ప్రణవము. ప్రణవమనును, నీయర్థమే కలుగుచున్నది. " అవతి సంసారార్ణవాదితి. " ఓం " అవ, రక్షణే, యను ధాతువునుండి పుట్టినది. ఈ తారక ప్రణవరూపకమైన యర్థమునందు రామానుజాచార్యులవారు, మధ్వాచార్యులవారు, శంకరాచార్యులవారు, ముగ్గురు మూడువిధములైన యభిప్రాయము పడిరి. ఆ యభిప్రాయము, ఉత్తమ, మధ్యమ, అధమాధికారులకుబోధించునిమి

త్తముకాని విరోధముకాదు. "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ" అను శ్రుతికి, ఓంకారము ఒక యక్షరమే యని మధ్వాచార్యుల వారు చెప్పిరి. రామానుజాచార్యులవారు మూడు అక్షరములు కలిసి 'ఓం' అయినదని చెప్పిరి, "అకార ఉకార మకార ఇతి తానేకధా సమభవతదేతదోమితి అనఁగా—అ కార, ఉ కార, మకారములు కలిసి ఓం కారమైనదని సిద్ధాంతపరిచిరి. శ్రీశంకరాచార్యులవారు, అనుభవమునకు సమముగా నాలుగు లేక ఐదక్షరములు కలవని చెప్పిరి. ఇందుకు శ్రుతి "అకార ఉకార, మకారార్థమాత్రాః" "ఓంకారస్య పతచస్థానాని, అకార, ఉకార, మకారతుర్య తుర్యాతీతాః" నాలుగని చెప్పినను, ఐదని చెప్పినను, అర్థముయొక్క టె. తుర్య, తుర్యాతీతములను కలిపి "సోయమాత్మా చతుష్పాత్" అను శ్రుతిచేతను ఒక్కటిగానె చెప్పిరి. ఒకానొక శిష్యుని బుద్ధికి బట్టదని విడదీసి అయిదుగా కనఁబరచిరి. అర్ధమాత్ర యనఁగా - "ఓం" అని పలుకు నపుడు కలుగు నాదము. నాదమువరకు ఉపాసనో పాస్య భావము ఉన్నది. అతీతమందు స్వరూప యునికి తప్ప రెండవది లేదు. యోగమనఁగా—"యుజ్యతయిత, యోగః," అనఁగా రెండు పదార్థములను నొక్కటిగా పొందించునది. ఈ యోగమునకు పతంజలులవారు "చిత్తవృత్తి నిరోధో యోగః" అని వ్రాసిరి. సోపాధిక, నిరుపాధికముల చేత యోగము రెండు విధములు—సోపాధిక యోగమంతయు నశించునదియె, నిరు

పాధికమనఁగా, నేను, అను శబ్దమును, అవస్థలు, శరీరములు, ఇంద్రియములు, సాక్షులు, వీనిని తెలిసికొనిన తెలివియని వీని మధ్యనుంచి వేరుచేసి బ్రహ్మశబ్ద శ్రవణముజేసి ఆరెంటికి ఏకత్వమును బొందించుటయే.

"ముంచాదిషీకేవ" అనఁగా చెత్తమధ్యయందున్న దర్భను చెత్తవిడదీసి గ్రహించునటుల, ఈ మాయాకల్పిత మైన బాహ్యాభ్యంతరములను విడదీసి యేకముగా దెలిసి కొనుట అనఁగా జీవాత్మా, పరమాత్మ ఒక్కటియని యర్థము. "శతంచైకాచహృదయస్య నాడ్యస్తాసాంమూర్థాన మభీని శృత్తికా, తయోర్ధమాయమృతత్వామిఛన్ విష్వఙ్ఞన్యా ఉత్క్రమణేభవంతి." లక్షణమనఁగా — ఒకవస్తువును తెలిసి కొనుటకు దగిన గురుతును దెలియజేయు వాక్యము. ఇది రెండువిధములు — వ్యావర్తకమని, వ్యవహార్యమని, వ్యావర్తకమనఁగా— రెండు వస్తువులయొక్క భేదమును తెలియ జేసినదానికంటె నిది వేరు అని చెప్పునది వ్యవహార్యమనఁగా దానియొక్క ప్రత్యక్షరూపమును జెప్పుట. "వ్యావృత్తి వ్యవహారోవాలక్షణస్యప్రయోజనం" ఇక్కడ సచ్చిదానం త్వము బ్రహ్మకులక్షణమని చెప్పుట స్వరూపలక్షణము. దీనికే వ్యవహార లక్షణమనిపేరు. జగత్కర్తృత్వము చెప్పినప్పుడు వ్యావృత్తి లక్షణము—అనఁగా జగద్బ్రహ్మలయందు గలుగు గుణములను కనఁబరచి యొకదానికంటె నొకదాని వేరుగ

చెప్పుట, అనఁగా, అన్నృతజడ దుఃఖత్వము జగత్తునకు లక్షణము. సచ్చిదానందత్వము బ్రహ్మకు లక్షణము. అన్నృతమునకు భిన్నమయిన సత్యము. జడమునకు భిన్నమయిన చిత్తు, దుఃఖమునకు వేరయినది, ఆనందము. అందుచేత జగత్తునందున్న, అన్నృతజడదుఃఖత్వము బ్రహ్మమునందు లేదు. బ్రహ్మమందున్న సచ్చిదానందత్వము జగత్తునందు లేదు. కనుక పయినిచెప్పిన వ్యావృత్తి వ్యవహార లక్షణములను వేదాంత శాస్త్రమందు స్వరూపలక్షణమని, తటస్థలక్షణమని చెప్పఁబడును. లోకమునందు ననేక విధములైన యోగములు కలవు. అవి మంత్ర, లయ. హఠ రాజయోగములని వ్యవహరింపఁబడుచున్నది. అందు యమ, నియమాసన, ప్రాణాయామ, ప్రత్యహార, ధారణ, ధ్యాన, సమాధులు. ఇవి యెంతనేర్పుచేత నెన్నివిధములు దెలిసికొనినను జ్ఞానము లేనియెడల వ్యర్థము. ఇది గారడివలె నుండును కనుక నన్నియోగములలోను మునుపు చెప్పిన తారకయోగమే శ్రేష్ఠమైనది. "సర్వేయోగా అధఃపాతయంతి తారకమూర్ధంగచ్ఛతి" "సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణం" ఈతారకము పూర్వమని, యుత్తరమని రెండువిధములు. ఇందులో నుత్తరతారకము శ్రేష్ఠము. ఐనను చిత్తశుద్ధికొరకై క్రమముగా నుత్తరతారకము పొందవలెను. పూర్వతారకమనఁగా—అనేకవిధములైన నామరూపములతోఁ గూడినదృశ్యపదార్థములను కంటిమధ్యయందు

చూచుట. ".సర్వమూర్తిమయం తారకందృశ్యం భవతి" దీని యభ్యాసము సూర్య, చంద్రనాడులని పేరుగల, ఇడా పింగళ, మధ్యయందు, అనఁగా భ్రూమధ్యమందు రెండు నేత్రములచేత పైదృష్టిచే చూచిన చూపుయొక్కటె యయి యున్నది. ఆచూపును యేకమని తెలిసికొని నిలుపవలెను. ఈదృష్టిను నిలుఃపుట, ముక్కుయొక్క చివరనైన నిలుప వచ్చును. అట్లు నిలిపినయెడల ధగధగాయమానముగా అనేక చిక్కళలు అక్కడ కనుపించును. "ఇడాతువామని శ్వాసా" "నేత్రయోః కృష్ణతారగ్ర మధ్యేదహారం, తద్ధ హారేదృశ్యమానే, అగ్నికీటక నక్షత్రవత్, చిక్కళాదృశ్యంతే" తరువాత క్రమముగా నాదృష్టిను సౌధసోపానన్యాయము వలెనే పైకెక్కించి క్రమముగా మరికొన్ని చిక్కళను జూడ వలయును.

శ్లో॥ విజాతీయం, పరిత్యజ్యచిదూ్రపందర్శయేత్సవా॥
ఇట్లు ప్రత్యాహారము చేసినయెడల మనఃప్రాణములు రెండును నొక్కచోటనే నిలుచును.

"ద్వేబీజే చిత్తవృక్షస్య మనఃప్రాణౌ తదైవచ
వాయుస్పందే మనస్పందం మనసోవిషయంతతః
ఏకన్నిశ్చలతాంనీత్వా అన్యంనిశ్చలమాప్నుయాత్
ప్రాణాయామే కృతేపిస్యాత్ మనసోనిగ్రహంకృతం
తస్మాత్సర్వ ప్రయత్నేన మనోనిశ్చలితాభయాత్॥

షాసగమారుత మనంబులు గూడియున్న అనుచోట్ల మొదలు ఎరుక, తా శేషించి యుండువరకు మనఃప్రాణములు ఏకమయిన చూపులో చూడఁగాఁ జూడఁగా సచ్చిదానంద సముద్రములో కనఁబడు పదార్థములు అణగిపోవును. ఆ పదార్థములు చూచు తెలివిమాత్రము మిగిలియుండును. "యథానద్యస్సముద్రే స్తంగచ్ఛంతి, నామరూపే విహాయ" "సయథేమానద్యస్స్యన్దమానా స్సముద్రాయణా స్సముద్రం ప్రాప్య స్తంగచ్ఛన్తిభిద్యేతే తాసాంనామరూపేసముద్రఇత్యేవం ప్రోచ్యతే॥ "అరాఇవర థనాభౌక లాయస్మిసన్ప్రతిష్ఠితాః" మొనసి ధ్యాత ధ్యానములు లేక యుండు మొదలు పరికించి తననొప్పుపావన స్థలమువరకు ధ్యాత, ధ్యానములు లేక కలుగు యునికికి సహజామనస్క రాజయోగమని పేరు. ఇంతకంటె రహస్యమయినట్టి పవిత్రమయిన సుఖమయినట్టి యోగము మరియొకటిలేదు గనుక బుద్ధియందు గలుగు పాండిత్యముచేత నీయోగమునే యభ్యసించవలయును. ఈయోగాను సంధానముచేయుటకు భ్రూమధ్యము, స్థానము. ఇందుకు శ్రుతి—"ధ్యాతృ ధ్యానే విహాయ ధ్యేయైక గోచరోభవేత్." ఈయమనస్కరాజయోగము, రెండువిధములచేతను తెలియఁ బడును. అనఁగా సర్వము బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మ బ్రహ్మాత్మరూపముకంటె వేరు ఒక వస్తువు లేదును. అనే జ్ఞానము ఒకటి. ఏదియేదిబుద్ధియొక్క వృత్తికి

దెలియఁబడునో అది నేనుకాదు. దానిని ప్రకాశింపఁజేయు జ్యోతిరూపమైన జ్ఞానానంద స్వరూపుఁడును, అని తెలిసికొను రెండవది. మొదటిదానికి శ్రుతి, యుక్తులు-ముత్యపుచిప్ప యందు తోచు, వెండి యేలాగుననో పరమార్థమయినట్టియు, సద్వ్యాధిష్ఠానమయినట్టియు, తనకంటె అన్యము లేదని తెలిసి కొనుట యుక్తి—"సర్వం ఖల్విదం బ్రహ్మ, ఆత్మైవేదగుం సర్వం। బ్రహ్మైవేదగుంసర్వం ఇదగుం సర్వంయదయమాత్మా। పురుషఏ వేదంవిశ్వం, అహమేవేదగుంసర్వం॥ రెండవదానికి శ్రుతి, యుక్తులు-అహమని తోచుచు విషయములను పొందక, విషయములమధ్యను చీకటింటిలోని దీపమువలెనే ప్రకాశిం చుచున్నది. దీనిభావము-శరీరత్రయమునకు, అవస్థాత్రయ మునకు, పంచకోశములకు, సాక్షిత్రయమునకు నధిష్ఠానమై ప్రకాశించుచునను జ్ఞప్తి, సంకల్పవికల్పములను మనస్సుచేయు చున్నను యీజ్ఞప్తిచేయుటలేదు. ఈవిధముననే బుద్ధి, అహంకారము,చిత్తము,వానిపనులు,అవిచేయుచున్నప్పటికి నేను చేయడములేదు. ప్రాణవాయువుచేతను, అంతఃకరణకదిలి, ఇంద్రియాదులు ద్వారా బయటకు వచ్చి కంటితోఁ జూచినను నేను చూడలేదు. వినినను నేను వినలేదు. ఆఘ్రాణించినను నేను ఆఘ్రాణించలేదు. మాట్లాడినను నేను మాట్లాడ లేదు. స్పృశించినను నేను స్పృశింపలేదు. ఈ విధ ములనే కర్మేంద్రియముల ద్వారా బయలుదేరిన అంతః

శరణము వచనాదానగమన, విసర్గ, ఆనందములను పొంది నను అంతరమందుండు "నేను" అనుజ్యోతి దేనిని చేయుట లేదు. పైని చెప్పినప్రకారము బ్రహ్మాత్మకంటె నన్యము లేకపోవుటచేతను, ఏవిషయమందు గలసినప్పుడు ఆవిషయమునే పొంది నశించకపోవుటచేతను, ఈదేహ మధ్యమందున్న "నేనను" తెలివి దేనిని చేయుటలేదు.

"బ్రహ్మణోన్యం నకించిన, ఆత్మనోన్యంనకించన, సర్వం దృశ్యం పరిత్యజ్య, స్వయమేవతిష్ఠతి" ఇందుకు శంకరాచార్యుల వారిచే చెప్పఁబడిన హరిస్తుతి ప్రమాణము.

"శ్లో॥ యద్వ్యద్వేద్యం వస్తుసతత్త్వ, విషయాఖ్యం తత్తద్బ్రహ్మై, వేతివిదిత్వాతదహంచ ధ్యాయంత్యేవంయంశన కాద్యామునయోంజంతంసంసారధ్వాంత [illegible]నాశం హరిమీడే"॥

"యద్యద్వేద్యం తత్తదహం నేతివి[illegible]స్యాత్మ జ్యోతిర్జ్ఞానమయానన్దమవాప్య, తస్మిన్నస్మీత[illegible]త్రపి[illegible]ంవిదురీశం తం సంసార ధ్వాన్తవినాశం హరిమీడే"॥

"అంసంగో వ్యాయమాత్మా, యద్వైతం పశ్యతి, పశ్యన్వైతన్న పశ్యతి, నహి[illegible]త్ర ష్టుర్ద్రష్టేరిపు పరిలోకోయుద్యతే, అవినాశిత్వాత్, నతుతద్వితీయమస్తితతోన్య ద్విభక్తం యత్పశ్యేత్"

దానిపై భూమ్యాది తత్వము లైదు మొదలు పరమా త్మను జూచుట వరకు భ్రూమధ్యస్థానమందు దృష్టిని నిలిపి చూచినయెడల పంచభూతములయొక్క వర్ణములు, మండల త్రయమును, కనుపించి, చంద్రమండలములో సమస్తజగత్తును ప్రవర్తింపజేయు నొక యంకురము బీజరూపముగ గనుపించును. దానిని జూచుచు గురుసమీపమున శ్రవణము చేయవలెను. చేయునప్పుడు పైనిచెప్పిన అహంపదార్థము దేహమధ్యమందు, ఆపోజ్యోతిగాను నేత్రమధ్యమందు, నీల మేఘచ్ఛాయవలె యుండును. అదియే, నివ్వరిధాన్యము యొక్క ముల్లువలెను పచ్చని చాయగలదియై, నాభి, హృదయ, నేత్రములయందు ప్రకాశించుచున్నది. ఆప్రకాశము యొక్క మధ్యమునందు అగ్నిశిఖకలదు, ఆయగ్నిశిఖయొక్క చివర పరమాత్మ ప్రకాశించుచున్నాఁడు. ఆప్రకాశించు పరమాత్మే బ్రహ్మాదిదేవతలగాను, సత్తామాత్రముగాను, తెలిసికొనిన మహాత్ములు భేదవాదములను పొందక, సువర్ణము, లనేకాభరణములైనట్లు తెలిసికొనెదరు.

“యోవేదాదౌస్వరః ప్రోక్తోవేదాంతే చప్రతిష్ఠితః, తస్యప్రకృతిలీనశ్చ, యఃపరస్సమహేశ్వర” “పంచభూతకారణం, తత్కూటాభం, తద్వచ్ఛతుఃపీఠః తన్మధ్యేతత్వప్రకాశో భవతి. తత్సమయే, నీల, పీత, హారిత, శ్వేత, రక్త, ప్రకాశాః ప్రవర్తంతే, తదుపరి సూర్యమండలం, తన్మధ్యేఅగ్నిమండలం,

తన్మధ్యే, చంద్రమండలం, తన్మధ్యే, అఖండబ్రహ్మతేజో మండలం, తదేవజగద్బీజం''

''ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోం''
''మిత్రావరుణౌ, నిడహ్యాం తయోరూపం సోహంభవతి''
''నీలతో, యదమధ్యస్థా, విద్యుల్లేఖేవభాస్వరా, నీవారశూక వత్తన్వీ, పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయమధ్యే, పరమాత్మావ్యవస్థితః, సబ్రహ్మ, సశివ, సహరి, స్సేన్ద్రస్సోక్షరః పరమస్వరాట్'' ''ఇంద్రం, మిత్రం, వరుణమగ్నిమాహురథో దివ్యస్స, సువర్ణో, గరుత్మాన్ ఏకంసద్విప్రాబహుధావదన్తి అగ్నింయమంమాత రిశ్వానమాహుః''

''తదేవాగ్ని, స్తద్వాయు, స్తత్సూర్య స్తదుచన్ద్రమాః తదేవశుక్రమమృతంతద్బ్రహ్మ తదాపస్సప్రజాపతిః'' ''త్వమేకోసీబహూనను ప్రవిష్టః'' ''యదాపశ్యఃపశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం, పురుషంపరస్తాత్'' నాభి, హృదయము, కంఠ, నేత్రస్థానములయందు నీ అహం ప్రత్యయరూపమైన కళలు నివ్వరిధాన్యపుముల్లువలెను, ప్రాదేశమాత్రముగాను, గోలాంగూలముయొక్క లోమములో నూరవభాగముగాను మెరుపు తీగెగాను, ఉపాసనచేయవలయును. దీనినే బ్రహ్మాండమందు మనకుఁ గనఁబడు సూర్యమండలమందును, దానిలోనున్న హిరణ్యగర్భునియందును, దీనియందున్న అవ్యాకృతునియందును ప్రకాశించుచున్న బ్రహ్మకళలుగాను నుపాసనచేసినయె

డల పూర్ణానందమును బొందును. ఈయుపాసన నేతత్వ సిద్ధిని గలుగఁజేసి జీవన్ముక్తిని బొందించును.

## ఉత్తరతారకలక్షణము.

ప్రకాశించుచున్న కంటినడుమనున్న నల్లనిప్రకాశము నందు స్వయంప్రకాశరూపమయినట్టియు, ఉ, కారస్వరూపమై నట్టి బిందువు ప్రకాశించుచున్నది. బిందురూపమైన యా శ్వయం ప్రకాశమునందు, స్ఫటికముతో సమానమైనట్టియు, జీవ, పరమాత్మైక్యరూపమైనట్టియు సృష్టి, స్థితి, సంహారము లను బొందక, స్థిరమైనట్టియు, జాగ్ర, త్స్వప్న, సుషుప్తులకు సాక్షియై. తురియరూపమై, ప్రకాశించుచున్న, ఆపరమశివ కళయై యున్నది. ఆసచ్చిదానందరూపమయిన శివకళే, యుత్పత్తి, స్థితి, సంహారములనెరుగక, యేకరూపముగా నుం డుటచే, సత్తనియు, ఆశివకళారూపమైన సత్తునందు బుట్టిన పదార్థములను బ్రకాశింపఁజేయుచు, వాని సంబంధము లేక యే తాను బ్రకాశించుచున్నది గనుక, చిత్తనియు, అవి రెండును ఒక్కటే స్వరూపమని తెలిసికొని, అది తానై, ప్రకా శించునపుడు ఆనందమనియు, తత్వవేత్తలు వివేకముచేత చక్కఁగాఁ దెలిసికొనుచున్నారు.

ఈకంటికిఁ గనఁబడునట్టియు, అంతఃకరణమందుఁ దోఁచు నట్టి సర్వనామరూపములయందు నధిష్ఠానముగాఁ బ్రకాశిం

చుచు సచ్చిదానందమున్నది. ఈకనఁబడు ఘటపటాదినామ రూపములయందు నధిష్ఠానముగా నంటియున్నట్టి, అస్తి, భాతి, ప్రియము, అనఁగా, ఉన్నది, ప్రకాశించుచున్నది, ఆనంద ముగా నున్నది, అనే యనుభవమును, విచారించగా సచ్చిదా నందముకాదా? ఇదే, సచ్చిదానందమని తెలిసికొనుము.

ఈసచ్చిదానందముయొక్క అర్థమును, మరియొకవిధము గలదు. సత్తనఁగా లింగము, చిత్తనఁగా అంగము, ఆనందమనఁగా లింగాంగసంయోగము. సచ్చిదానందార్థకమైన లింగాంగములు రెండును నొక్కటే? అనఁగా—అవ్యక్తాది విషయపర్యంతము వరకు కనఁబడు ప్రపంచమునకు కారణమై, ఈప్రపంచమును గర్భమందు ధరించుచున్నదై ప్రకాశించుచున్నది.

పైజెప్పినట్టి యంగలింగసంయోగమే, నాద, బిందు, కళలని చెప్పఁబడుచున్నది. లింగము, నాదము, అంగము, బిందు, అంగలింగసంయోగము, కళ. ఈమూడును శివకళా రూపమైన సచ్చిదానందమే. కళయనఁగా నశింపక ప్రకా శించునది. ఈసచ్చిదానందరూపమైన అఖండప్రకాశమునకు నీదేహమందు నిక నెక్కడయని అడిగితివా, మృదువైన యాజ్ఞేయచక్రస్థానమునకు త్రికూటస్థానమని పేరు లేక శృంగా టకమనియును పేరు. అట్టి త్రికూటస్థలమందు మృదువుగా రెండునేత్రములమధ్యయందు నొక నల్లని నీడ కనుపించును. ఆనీడలో నొక సన్నరంధ్రముకలదు దానికి ఆపోజ్యోతియని

పేరు. అనఁగా నుదకము చేత నిండి ప్రకాశించుచున్నది. అట్టి ప్రకాశమధ్యయందు బ్రహ్మమును జ్ఞప్తియైన బిందువు ఆత్మ స్వరూపమై ప్రకాశించుచున్నది.

పైనిచెప్పఁబడిన చిత్తు, అంగము, బిందువు, అని ప్రకాశించు చున్న జ్ఞప్తిలో నేను బ్రహ్మమని ఒకధ్వని పలుకుచున్నది, ఆధ్వని వ్యావహారికమందు జాగ్రదవస్థ. అదియే పరమార్థ మందు హృదయ, కంఠ, నేత్రస్థానములయందు నేకరూపమై కలసి వెలుగుచున్న నాదబిందు కళలు. అదియే, సత్వ, రజస్త మోగుణములయొక్క కలయిక రూపమైన మూలప్రకృతి. ఆమూలప్రకృతి మూలాధారాది ఆజ్ఞేయ చక్రపర్యంతము ‟సోహ" మను నాదముచేత తిరుగుచున్నది. అది బహిర్గత మైనప్పుడు అవస్థాత్రయమును గలుగఁజేసి సంసారదుఃఖమును పుట్టించును. దీనినే వివేకులు అంతర్ముఖమునందు ప్రణవముగా జూచెదరు.

ఈ చెప్పిన యర్థమును నీవు పట్టుదలతో మననము చేసినయెడల ‟తత్వమసి" యను మహావాక్యార్థము స్పష్ట ముగా దెలియుచున్నది. అట్టి మహావాక్య లక్ష్యార్థమును నీవు భావించి వినుము.

విచారించగా ‟త్వం" పదార్థముతురీయుఁడైనజీవుఁడు, తత్పదార్థము సృష్టికి పూర్వమందున్న నచాత్మ ఈ రెంటికి ‟అసి" పదముఐక్యమునుబొందించుచున్నది. జీవాత్మ,పరమాత్మైక్యము

ను, ఉపనిషదర్థ సారముచేతను దాని పద్ధతిని భావనచేయుము. అదియే, తత్వము, అదియే భావము, అదే నిరాలంబము. అట్టి జీవాత్మ, పరమాత్మైక్య రూపమైన జ్ఞప్తియే, సర్వసాక్షి, అదియేనీవు. విచారించగా నీస్వరూప మెల్లప్పుడును నీచెప్పిన విధముచే అంతర్లక్ష్యమందు భావము చేయుము. బాహ్యాభ్యంతరములయొక్క లోపలను, వెలుపలను, నడుమను, పూని శతకోటి రంధ్రములవలెఁ బ్రకాశించుచున్న, ఆయాపోజ్యోతి యందు, తురీయ రూపమైన నీజ్ఞప్తిని, అక్కడ పొందించి; నిద్రపోవు రీతిగా నున్నయెడల, నిదియే, అంతర్లక్ష్యమని చెప్పఁబడుచున్నది.

## అంతర్లక్ష్య చిత్తాకాశము.

---

బ్రహ్మము నేనను జ్ఞప్తి, భూతాకాశమనియు, చిత్తాకాశమనియు, చిదాకాశమనియు, మూడు విధములుగా ప్రకాశించుచున్నది. "నీవు" అను జ్ఞప్తి, నీకుఁ గనఁబడు దృశ్యమును యావత్తు వదలి యీ చెప్పఁబడిన ఆకాశములుగా భావనచేయుము. ఎట్లనఁగా—భూతాకాశము, చిత్తాకాశమందును, చిత్తాకాశమును, సర్వపరిపూర్ణముగా వెలుఁగుచున్న, చిదాకాశమందునుపొందించి, సర్వపరిపూర్ణమైనఆచిదాకాశ స్థలమందు నీ చిత్తాకాశమును నిలిపినయెడల అంతర్లక్ష్యమని చెప్పఁబడును. చిత్తమును పైన చెప్పినరీతిని, క్రమక్రమ

ముగ బ్రహ్మము నేనను తెలివియందు పొందించి చలింపఁ జేయక పూనికతో నీయంతర్లక్ష్యమును, విషయములు నీయెదుట చలించుచున్నప్పటికిని మరువవద్దు. అట్లు మరచినయెడల నింద్యాదులకైన సంశయములు దుఃఖములు కలుగక మానవు. బ్రహ్మము తానసే యనుభవమునందు ప్రతిబంధకము లేకుండ నిలిచినయెడల నెరుక నీవగుదువు. అట్టి నీవయిన యెరుక నీవని తెలిసినపిమ్మట క్రమముగ దేహేంద్రియాది వాసనలు తిరిగి కలిగినయెడల నీవు నీవయి యుండుటచేత నీకు మాయ అంటదు. మాయ యేదియని యడిగితివా? నీ స్వస్వరూపము నీకుఁ దెలియక నీయం దారోపితమైనట్టియు, జాగ్ర, త్స్వప్న, సుషుప్తులకు కారణమై పొందుచున్న దేహము, నీవని భ్రమ పడి, నాటినుండి, వ్యవహారమందే జ్ఞప్తిని నిలుపుచు పరమార్థము నెరుగక యుండుటేమాయ, ఇంతకంటె వేరుకాదు.

బుద్ధిచేత విచారించినయెడల మాయకు నేరూపములు లేదు. అదిసత్తని, అసత్తని, సదసద్విలక్షణమని చెప్పుటకు వీలు లేదు. గనుకనే యది యనిర్వచనీయము. సిద్ధాంతమందు నదిలేనిది. విచారించినయెడల నున్నది. అదియే యవిద్య, నిర్మలమైన యాకాశమందు నల్లని ఛాయ కనబడు విధమున నే అవ్యక్త మహదహంకారములు లేనటువంటియు, నిర్మలమైనట్టియు, నిర్గుణమైనట్టియు, స్వయంప్రకాశమైన నీయందు కర్మవలన గలిగిన మాయ, యెక్కడెక్కడజూచిన మాయమైపోయి

సచ్చిదానందమే కనుపించును మాయను, నున్నదానిగాఁ జూచినయెడల నున్నది. ఎక్కడలేదని జూచినయెడల లేనే లేదు. ఆకాశమందుఁ గనఁబడు నలుపు, విచారించిన యేవిధముగ నబద్ధమో, ఆవిధముననే, ఎరుకతో, నీజ్ఞప్తిని కలిపి, జ్ఞప్తికంటె నితరమైన అవ్యక్తాదులు జడమని తెలిసికొనినపక్షమందు మాయ అబద్ధమై పోవును. ఇంతవరకు నిన్ను మరుపు చేసిన మాయబుద్ధిచే నీవు విచారించినయెడల మాయ మాయమై పోవును. మాయనుబోగొట్టునట్టి మాయ, అధికమైన మాయ. అదినేను బ్రహ్మమునను, అఖండజ్ఞప్తితోఁ గూడిం నిర్గుణమాయ.

ఇట్టి పరమార్థము, ఈభూమియందు, కుటిలచిత్తము గలవారులకును, యోగ్యమైన గురువులను దూషించువారలకును, మిక్కిలి విషయేంద్రియములయందు నాసక్తిగలవారలకును, సత్యము తెలియక, సంశయమనస్సుగలవారలకును, నేను యీదేహేంద్రియములను వదలి యెట్టి యునికిలోనుందునని భయముగలవారలకును, మిత్రభేదము చేయువారలకును, లేక, జీవాత్మ, పరమాత్మలులేరని వాదించువారలకును, నీతిలేని వారలకును, దయలేనివారలకును, సర్వదా అహంకారమే ప్రధానముగాఁ గల మనస్సుగలవారలకును, కామకర్మలయందు నాసక్తిగలిగి విషయలోలురై తిరుగువారులకును, నీ మహావాక్యోపదేశము చేయఁగూడదు. చేసినయెడల పూర్వ

ముకంటె సంశయ విపర్యయాదులు కలిగి చెడిపోదురు. ఇంతియెగాక దృఢమైన జ్ఞానము లేనివారలగుదురు. బ్రహ్మవేత్తసంసారియైనను, సన్న్యాసియైనను, బ్రహ్మము తానుగా నెరుగుటయందు, విచారించగా భేదములేదు. ఈయిద్దరికి మార్గమొక్కటే? నీవు బుద్ధియందు నీమహిమను దెలిసికొని, నీబుద్ధికి తగినమార్గమునందు ప్రవేశించి, నిన్ను తీగవలె చుట్టుకొనియున్న నీపంచకోశములకున్ను, వేరై బ్రహ్మను భావమునందు ప్రవేశింపుము.

ఈలోకము అసత్యము శరీరము మృత్యువశమై యున్నది దీనిని తెలిసికొని యజ్ఞాదులు జేసి పరలోకభోగమును కోరక ఈలోకమువలనే పరలోక భోగము గూడ హిరణ్యగర్భలోకము పర్యంతము నశించునది యని తెలిసికొని బ్రహ్మాత్మానుభవమును విచారించి చిత్తవృత్తిలేక ఆత్మానుభవము కలుగదు. గనుక ఇదివరలో అనేక శ్రుతిస్మృత్యాదులు గద్యపద్యగీతాదికమైన అనేక కావ్యములును పాటలును ఉండినను స్త్రీబాలురకు మిక్కిలి యుపయోగమగునట్లు యీగ్రంథము చేయబడెను.

## ప్రపంచ విరక్తిమార్గము.

మనుజులకు, యీజన్మమునకు బూర్వమందు సంచిత కర్మబంధమువలన కలిగిన తల్లిదండ్రులు, పుత్రులు, పుత్రికలు,

భార్యలు, భర్తలు, మొదలగువారు నీళ్లమీఁద గాలిచేత గలిగిన బుగ్గలవంటివారనియు, దేహములును ఇట్టివేయనియు నిశ్చయింపవలెను. ఇవి మాయచేత పుట్టినవను అజ్ఞానులైన మనుజులు, శరీరము నిత్యమనియు యీసంసారమే శాశ్వత మని మాయచేత కట్టుబడి శరీరము, శరీరసంబంధమైన దారా పుత్రాదులు చూచుచుండగా మృతులైనను, వారల కొఱకు, దుఃఖించుచు మరల ప్రయత్నించును. దుర్మార్గమును బొంది బుద్ధి యందు యెక్కువైన కామ, క్రోధ, లోభ, మోహ, మదమత్స, రాదులను అనేకవిధములుగ విస్తరింపఁజేసికొని మనకేవి ధము చేతనైన ద్రవ్యముగలిగితే చాలునని తుచ్ఛములైన పనులను జేయుచు ద్రవ్యమును సంపాదించి ఇదియే మనకు సుఖము, ఇంతకంటె వేరుసుఖము లేదని గుడ్డివాండ్రవలెనే, కామముచేత తమకు ఏగతి కలుగునో తెలియలేక స్త్రీలనే వలలలోబడి, పశువులవలె లేవలేక, యీషణత్రయములనే సముద్రములో మునిగి ఆలుబిడ్డలయందు మమకారము యెక్కు వయి వారినిమిత్తము ధనము సంపాదించి వారివలన సుఖమును బొందలేక, కాలమంతయు నీరీతిగ గడపి, శరీరము పడిపోవు కాలమందు యమునిచేత ననేకవిధములైన బాధలు పొంది నరకకూపములో కొన్నిదినములుండి పాపాత్ములై ప్రపంచము నందు పుట్టుచు, చచ్చుచు, యీలోకమునుండి పరలోకము నకు, బరలోకమునుండి యీలోకమునకు లెక్కలేకుండ తిరు

గుచు బాధలు పడుచున్నారు. సూక్ష్మదృష్టిచేత చూచిన యెడల దేహము వేరు తాను వేరుగ కనుపించుచున్నది. అయి నను భ్రాంతి త్రాడుముడివేసినట్లు దేహము తాను యొక్కటి యని ముడివడినదానిలోబడి షడ్వర్గములను అత్యాసచేత వృద్ధి పొందించుచున్నది. కామ, క్రోధ, లోభ మోహ, మద, మత్సర్యములు, అరిషడ్వర్గములనఁబడును.

1. కామమనఁగా—ధనము, ధాన్యము, పుత్రపౌత్రా దులయందు, అధికప్రీతిని యుంచుట.

2. క్రోధమనఁగా_ఒకరిని చెరుచుటకు ప్రయత్నించుట.

3. లోభమనఁగా—తనసొత్తుయందు జ్ఞానులకుకూడా కించిత్తు ఇవ్వకూడదని తలంచుట.

4. మోహమనఁగా—తల్లి పుత్రకళత్రాదులయందు అధికప్రీతిని యుంచి తనకు గలిగిన ద్రవ్యము చాలదని మరి కొంత యెక్కువ కావలయుననెడి యాశ.

5. మదమనఁగా—ద్రవ్యము అధికరించుటచేత ఇతరు లను లక్ష్యపెట్టకుండుట.

6. మత్సరమనఁగా—తనవలె నితరు లుండగూడ దనియు నుండినయెడల క్రిందికి నడగద్రొక్కవలయు ననెడి చిత్తవృత్తి.

దీనికి ప్రమాణము. ॥శ్లో. కామః క్రోధంచ, లోభంచ, దేహేతిష్ఠంతి తస్కరాః జ్ఞానరత్నా పహారేణ తస్మాజ్జాగ్రత

జాగ్రత" తుచ్ఛసుఖ మిచ్ఛగించి తమగతి కానలేక కామాంధులై నొకరికంటె నొకరు అనుభవించు సుఖము తుచ్ఛము. భూమియంతయు పరిపాలనము చేసినను ఇంద్రాదిపత్యము రావలయునని తోచును. తా ననుభవించుచున్నది తక్కువ యనియు, ఇంద్రాదిపత్యము యెక్కువ యనియు అనుకొని బ్రహ్మలోక పర్యంతము కోరినప్పటికి తుచ్ఛసుఖమే యగును. స్వస్వరూపస్థితిని బొంది మోక్షమును బొందినవానికి ఇవి యన్నియు తుచ్ఛములే. భామల వలలోబడి లేవలేక క్రిమి న్యాయముగా దారి దొరకక బురదలో బడినవానివలె పడిపోవుచున్నారు.

శ్లో. జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః
సంసార సాగరందుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత
ఆశయా బధ్యతేలోకః కర్మణా బహుచింతయా
ఆయుఃక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రతజాగ్రత.
అంగార సదృశానారీ ఘృతకుంభసమఃపుమాన్
తస్మాన్ నారీషు సంసర్గం దూరతః పరివర్జయేత్.

ఈషణాత్రయమనఁగా—1 దారేషణము 2 ధనేషణము 3 పుత్రేషణము.

1. దారేషణమనఁగా—భార్యమొదలైన స్త్రీలయందలియాశ.

2. ధనేషణమనఁగా—ద్రవ్యమందలియాశ.

3. పుత్రేషణయనఁగా— కుమారులయందలి యాశ.

ఇది సముద్రములవంటిది దారపుత్రాదులను సంపాదించి స్వస్వరూపస్థితిని మరచి వారల కొఱకై తను జీవించు కాలము కొంచెమైనను తెలిసికొనజాలక, మరణపర్యంతము ద్రవ్యము నే ఆర్జించుచుండును. అంత్యకాలము వచ్చినప్పుడు తన స్వస్వరూపమును తెలిసికొనఁజాలక సంసార సాగరములో మునుఁగుట బ్రహ్మ, అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రులు, పంచమహాభూతములు, ఇవి యన్నియు గలసి ప్రపంచమనఁబడెను.

బ్రహ్మస్వరూపము తెలిసికొనలేకపోవుట అవ్యక్తము, అదియే త్రిగుణగర్భము దానియందు శుద్ధసత్వ, మలినసత్వము అను నామములుగల మహత్తు గలిగెను. ఆమహత్తు, బ్రహ్మాండమందు, సూర్య, చంద్ర రూపమాయెను. ఇదియే అర్చిరాది మార్గము, ధూమాదిమార్గము, బ్రహ్మ, అవ్యక్తము, మహత్తు యీ మూడును గలసి, యొక దేహమాయెను. ఆదేహమందు బ్రహ్మము, చైతన్యస్వరూపముగ నుండెను. అట్టి చైతన్యమందు అహంకారముకలిగెను. అట్టి అహంకారయుక్తమైనజీవుఁడు శరీరత్రయమందు అవస్థాత్రయము ననుభవించుచుండును. నిత్యము జాగ్రత్స్వప్నములంటు శ్రమకలిగి యెటుబోవుటకు స్థానము గానక, తన కుపాదానకారణమైన అహంకారమందు ప్రవేశించి, కొంతవరకువిశ్రమించికార్యరూపమైనస్థూలదేహము ప్రవేశించి,

పూర్వము తాను ఏయేవాసనలతో నుండెనో అట్టి వాసనల చేత కర్మలను జేయుచు నుండగా కొంతకాలమునకు ఈ శరీరమును వదలి అహంకారమునకు కారణమైన మహత్తులో ప్రవేశించి తాను చేసిన పుణ్యపాప కర్మలకు తగిన మార్గమందు ప్రవేశించి ఆయా యీ కర్మలను అనుభవించి, తిరిగి క్రిందకు వచ్చుచుండును. మృత్యువునకు లోబడి పురుగులు దీపమును జూచి పండవి భ్రమజెందినట్లు దారాపుత్రాదులను జూచి భ్రమబొందుచు వారి సంరక్షణార్థమై పాపమునకు వెరువక ద్రవ్యమును సంపాదించుచు కొంతకాలమునకు మృత్యువువల్ల శరీరమువదలి యమబాధలు అనేక విధములుగబడి తిరిగి మనుష్యజన్మ మెత్తుచున్నారు.

## విశ్వోత్పత్తిఘటము.

సృష్టికంటె పూర్వమందు నాశము లేనట్టియు, చలనము లేనట్టియు వికారము లేనట్టియు కాలత్రయమునందు బాధింపఁబడనట్టియు సృష్టికి అభిముఖమయినట్టియు సర్వస్వరూపుఁడయినట్టి యొక్క పరబ్రహ్మము కలదు. దానియందు ఆది లేనిదై నిరాకారమయినదయి సృష్టిని చేయుటకు సమర్థమయినదయి ప్రధానమను పేరుగల ప్రకృతిగలదు. ఈ ప్రకృతియందు పయిని చెప్పఁబడిన నిర్వికారాది ధర్మములు గలిగినట్టి బ్రహ్మము కలిసి ఈశ్వరుఁడను లేక అవ్యాకృతుఁడను పేరు

కలిగెను. ఆ యీశ్వరునియందు హిరణ్యగర్భుఁడను లేక సృష్టి కర్తయనువాఁడు పుట్టెను ఆ హిరణ్యగర్భునియందు విరాట్టు లేక వైశ్వానరుఁడు అనువాఁడు పుట్టెను. ఆవిరాట్టునందు మహత్తు, ఆ మహత్తునందు అహంకారము. అహంకారము నందు పయిన చెప్పఁబడిన ప్రకృతి సత్వరజస్తమోగుణములు కల విభాగముకలదాయెను. ఆ ప్రకృతియొక్క సత్వగుణ మందు జ్ఞానేంద్రియములు, రజోగుణము వలన కర్మేంద్రియ ములు, తమోగుణమువలన వాటి విషయములు ఆ జ్ఞానేం ద్రియ విషయముల వలన క్రమముగ, అధిదేవతలతోఁ గూడిన పంచమహాభూతములును పుట్టెను. అనఁగా శబ్దము వలన సదాశివుఁ డధిదేవతగాఁ గలిగిన ఆకాశము స్పర్శము వలన యీశ్వరుఁడు అధిదేవతగాఁ గలిగెను. వాయువును, రూపమువలన రుద్రుఁడు అధిదేవతగాఁ గలిగిన అగ్నియును రసమువలన, విష్ణువు, అధిదేవతగాఁ గలిగిన జలమును, గంధము వలన, బ్రహ్మ అధిదేవతగాఁ గలగిన భూమియును కలిగెను. పై చెప్పఁబడిన పరమేశ్వరుఁడు, యీ విధమున సూక్ష్మసృష్టిని బుట్టించి స్థూలసృష్టి కొరకై తిరిగి సంకల్పించెను.

## పంచీకరణములు.

———:0:———

పై చెప్పఁబడిన పంచమహాభూతములనుఒక్కొక్క భూతమును తక్కిన భూతములతో కలిపినప్పుడు పంచీకరణమాయెను.

ఎట్లనఁగా ఆకాశమును రెండుభాగములుచేసి అందులో ఒక భాగమును సమష్టిభాగముగాను రెండవభాగమును వ్యష్టి భాగముగాను చేయవలయును. ఈవిధముననే ప్రతిభూతమును విడదీసి పంచవలెను. ఆకాశముయొక్క సమష్టిభాగము జ్ఞాత యాయెను. వ్యష్టిభాగము నాలుగు భాగములుచేసి వాయు వుతో కలిపినప్పుడు మనస్సును, అగ్నితో కలిపినప్పుడు, బుద్ధి యును, జలముతో కలిపినప్పుడు చిత్తమును, భూమితో కలిపి నప్పుడు అహంకారమును పుట్టినవి. వాయువును, పై చెప్పిన విధమున రెండుభాగములు చేసి, సమష్టిభాగమును వ్యానవాయువుగాను, తక్కిన వ్యష్టిభాగమును నాలుగుభాగ ములుచేసి ఒక్కభాగమును భూమితో కలిపినప్పుడు ప్రాణ మును, ఉదకముతో కలిపినప్పుడు అపానమును, అగ్నితో కలిపినప్పుడు సమానమును, ఆకాశముతో కలిపినప్పుడు ఉదా నమును ఆయెను. ఈవిధముగనే అగ్ని రెండుభాగములుచేసి, సమష్టిభాగమును చక్షువుగాను తక్కిన వ్యష్టిభాగమయిన నాలిగింటిని వాయువుతోఁ గలిపినప్పుడు త్వక్కును, ఆకాశ ముతో గలిపినప్పుడు శ్రోత్రమును, ఉదకముతో గలిపిన ప్పుడు జిహ్వాయును, భూమితోగలిపినప్పుడు ఘ్రాణము పుట్టెను. జలముయొక్క సముష్టిభాగమును రసనేంద్రియ ముగాను తక్కిన వ్యష్టిభాగమయిన నాలిగింటిని, భూమితో కలపినప్పుడు గంధమును, అగ్నితో కలిపినప్పుడు రూపమును,

వాయువుతో కలిపినప్పుడు స్పర్శమును, ఆకాశముతో కలిపినప్పుడు శబ్దమును పుట్టెను. భూమియొక్క సమష్టిభాగము, వాయువింద్రియముగాను తక్కిన వ్యష్టిభాగమయిన నాల్గింటిని జలముతో గలిపినప్పుడు ఘ్రాణేంద్రియమును, అగ్నితో కలిపినప్పుడు వాక్కును, వాయువుతోకలిపినప్పుడు, హస్తములును, ఆకాశముతో కలిపినప్పుడు పాదములును, పుట్టెను. ఇవియంతయు కలసి 25 తత్వము లాయెను. ఈ 25 తత్వములున్ను ఆత్మను ఎరుగఁ జాలదు. కాఁబట్టి జడములనఁబడును. మరణమైన వెంటనే ఈదేహమునందుండు పంచభూతములున్ను ఆయా భూతములతోఁ గలసిపోవును. ఆత్మ జ్ఞానస్వరూపుఁడగుటవలన చిత్తు అనఁబడును. ఈ 25 తత్వములతోఁ గూడిన ఈశరీరము మూఁడువిధములు.

## శరీరత్రియము.

స్థూల, సూక్ష్మ, కారణములనని శరీరములు మూఁడువిధములు. కాలు, చేతులు, తల, కన్నులు ముక్కు, దేహముఁ మొదలగు అవయవములతోఁ గూడిన ఈమాంసశరీరము చేతితో బట్టుటకు కఠినముగా, మృదువుగా, పొడుగుగా, పొట్టిగా, లావుగా, సన్నముగా, తోఁచుటవలన ఇది స్థూలశరీరమనఁబడును. జ్ఞానేంద్రియంబు లైదు కర్మేంద్రియములైదు పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, అనెడి 17 అవయవ

ములతోఁ గూడినదే స్థూలశరీరము, లేక లింగశరీరమనఁ బడును. కంటికి తెలియక, చేతులతో పట్టుటకు సాధ్యపడక ఈస్థూలశరీరము లోపలనుండునదే సూక్ష్మశరీరము. అజ్ఞానమే కారణశరీరము 'శీర్యతే శరీరం' జీర్ణించిపోవునది గనుక వీనిని శరీరములనియు 'దహ్యతే దేహః' దహింపఁబడుచున్నవి గాన దేహమనియు చెప్పఁబడును. (1) ఆహారము లేకున్న ఈస్థూలశరీరము జీర్ణించిపోవును, మఱియు వ్యాధులు, ముసలితనమున జీర్ణించిపోవును. ప్రాణము వెళ్ళినతర్వాత ఈస్థూల శరీరము శ్మశానాగ్నిలో దహించిపోవును. (2) రాగద్వేష కామక్రోధములు నానాట విశేషించుటచేత సూక్ష్మశరీరము వృద్ధిజెందును. ఈరాగద్వేషాదులు నానాట తగ్గిపోవుట చేత సూక్ష్మశరీరము జీర్ణించిపోవును. ఈరాగద్వేషాదులు సూక్ష్మశరీర వికారములు. (3) అజ్ఞానమువలన నేను నాదియనెడి అభిమానము నానాట విశేషించుటవలన కారణశరీరము వృద్ధిబొందును. అభిమానము నానాట ఉడుగుటవలన కారణశరీరము జీర్ణించును. సూక్ష్మకారణశరీరములు రెండున్ను జ్ఞానాగ్నిచేత రూపులేక దహించిపోవును. ఐతే మాంసమయమగు స్థూలశరీరము ప్రత్యక్షముగా కనఁబడుచున్నది, సూక్ష్మశరీరము కనఁబడుటలేదు. కాఁబట్టి అదిఉన్నదని ఎట్లుచెప్పవచ్చుననఁగా, నిద్ర మరణము, మూర్ఛలు, సంభవించిన సమయమున స్థూలశరీరమునందు, నేత్రములు,

కర్ణములు, మొదలగు ఇంద్రియము లుండినను ఆనేత్రములు చూచుటలేదు, ఆకర్ణములు వినుటలేదు, ఇట్లు ఒక్కొక్క ఇంద్రియములున్ను దాని దాని కార్యములు చేయుటలేదు కాఁబట్టి స్థూలశరీరము సకలకార్యములు చేయుచున్నదని చెప్పఁగూడదు. ఈస్థూలశరీరములోపల సూక్ష్మశరీరము ఒకటి యుండియే సమస్తకార్యములను చేయుచున్నది. ఐతే ఈసూక్ష్మశరీరము తనంతట యేకార్యములు చేయుటలేదు, అగ్ని కట్టెలయందు వ్యాపించి సకలము భస్మము చేయునట్లు సూక్ష్మశరీరము ఈస్థూలశరీరమునందు వ్యాపించి సకలకార్యములను చేయుచున్నది. అగ్ని లేనికట్టెలు ఏప్రకారము ఒక పదార్థమును దహింపజాలదో ఆరీతిని సూక్ష్మశరీరము వెళ్ళి పోయినవెనుక ఈస్థూలశరీరము ఏకార్యమును చేయజాలదు. కాబట్టి స్థూలశరీరమునకంటె వేరుగా దీనిలోపల సూక్ష్మశరీరమొకటి యున్నది. ఈస్థూలశరీరమందుండు నేత్రములందు సూక్ష్మమగు నేత్రేంద్రియ ముండుటవల్లనే స్థూలశరీర నేత్రములు సర్వమును చూచుచుండును. ఆసూక్ష్మనేత్రేంద్రియము లేనియెడల ఈస్థూలశరీరనేత్రము దేనిని చూడఁ జాలదు. స్థూలశరీరమందుండు కర్ణములందు సూక్ష్మమగు కర్ణేంద్రియము ఒకటియుండుటవల్లనే స్థూలశరీరకర్ణములు సకల శబ్దములను వినుచుండును. ఆసూక్ష్మమగు కర్ణేంద్రియము లేనియెడల ఈస్థూలశరీర కర్ణములు వెయ్యియుండి

నను శబ్దమును వినఁజాలము. ఈరీతిని ఒక్కొక్క సూక్ష్మేం
ద్రియము వ్యాపించియుండుటవల్లనే స్థూలశరీరమునందలి
సర్వేంద్రియములు తమతమ కార్యములను చేయుచుండును.
సూక్ష్మేంద్రియములు లేనియెడల ఈస్థూలశరీరమునందలి
ఇంద్రియములు ఏకార్యములను చేయఁజాలదు. కాఁబట్టి
ఈస్థూలశరీరమునకంటెను వేరుగా దీనిలోపల సూక్ష్మశరీర
మొకటి యున్నది. ఈస్థూల సూక్ష్మములు రెండున్ను కార్య
రూపములుగా నున్నది. పొగవచ్చుటచే అగ్నిని పొగవచ్చు
చున్నదని నిశ్చయించునట్లు, కార్యరూపముగల స్థూల సూక్ష్మ
శరీరములు కలుగుటకు కారణమొకటి కలదని నిశ్చయింప
వచ్చును. అదే జ్ఞానస్వరూపమగు కారణశరీరము. నేను అజ్ఞా
నిని అనుటవలన అజ్ఞానము ప్రత్యక్షముగా నున్నది. అజ్ఞానమే
కారణశరీరము. దానివల్లనే స్థూల సూక్ష్మ శరీరములు కలు
గుచు, జననమరణములు గలుగుచుండును. ఎట్లనఁగా "అజ్ఞా
నా దవివేకః అవివేకా దభిమానః అభిమానా-ద్రాగాదయః
రాగాదయం-కర్మాణి కర్మణా-శరీర-పరిగ్రహః" అజ్ఞానము
వలన అవివేకము, అవివేకమువలన నేను నాదియనెడి అభి
మానమును, ఆయభిమానమువలన కామక్రోధాదులు, కామ
క్రోధాదులవలన అనేక కర్మలు చేయుచు, కర్మవశమున
ఈజీవాత్మ జననమరణములను బొందుచు మరల పూర్వ
సంచితకర్మవశమున బుట్టుచు చచ్చుచు ఇట్లు అనేక కోటి

జన్మము లెత్తుచు దుఃఖించుచుండును కాఁబట్టి కారణశరీరము నశించకుండిన ముక్తిలేదు. "తదా-విద్వాన్-బ్రహ్మజ్ఞానాగ్ని నా-కర్మబంధం-నిర్దహేత్" అనెడి పైంగలోపనిషత్తురీతిగా బ్రహ్మజ్ఞానాగ్నివలన అజ్ఞానమును సకల సంచిత కర్మలు న్ను నశించి జీవుఁడు ముక్తిబొందును సుమా. పైనిచెప్పిన పంచభూతములు సరియయినవికావని నైయాకిమతస్థులు, వైశేషికమతస్థులు, సాంఖ్యమతస్థులు, సాంఖ్యులలో మరి కొందరు, యోగమతస్థులు, వైయాకరణమతస్థులు, విరాణ్మ తస్థులు శైవ, వైష్ణవ, గాణాపత్య, శాక్త, సౌర, కపాలి కలు, బహువిధముగా వాదించుచున్నారు.

1. ఇందు నైయాకిమతస్థులు ఈ జగత్తునందు పంచ భూతములు కనుపించుచున్నవి. ఆ భూతములయొక్క యణు వులే జగత్కారము. చిన్నచిన్న దారములను పడుగు, పేకగా, కలుపుటచేతను, పెద్దవస్త్రము యేర్పడినట్లె అణువులన్నియు కలసి జగత్తు అయినదని చెప్పుచున్నారు. ఇందుకు "సూక్ష్మా సూక్ష్మరంకించిత్" అని యుండుటచేతను సూక్ష్మము వలన, స్థూలపదార్థములు పుట్టవలెను. దీనివలన యణు వులే కారణమని తెలియఁదగినది.

2. మరికొందరు వైశేషిక మతస్థులు పైనజెప్పిన పంచభూతములు సృష్టికంటె పూర్వమునందు ధూళిరూప ముగ, నున్నది. కనుక యణువులు కారణముకాదు. ఆధూళి

రూపమే జగత్తునకు కారణమని పాటించుచున్నారు. ఇందుకు శ్రుతి " జగత్కర్తారః పీలవః " అని చెప్పుచున్నారు.

3. మరికొందరు సాంఖ్యమతస్థులు, సుఖ, దుఃఖరూపమైన యీ జగత్తునకు, సత్వ, రజో, గుణాత్మకమైన ప్రకృతియే కారణము, అని వాదించుచున్నారు. ఇందుకు శ్రుతి " అజామేకాం లోహితశుక్లకృష్ణాం, బహ్వీం, ప్రజాంజనయంతీంసరూపాః " అని చెప్పుచున్నారు.

4. ఈ సాంఖ్యులలో మరికొందరు, కేవల ప్రకృతి పరము. కాఁబట్టి ఈశ్వర సన్నిధానమువలన ప్రకృతిజగత్తులు పుట్టించుచున్నదని చెప్పుచున్నారు. ఇందుకు శ్రుతి " తత్సాన్నిధ్యాజగదిదంప్రవర్తేత్ " యని కూడా చెప్పుచున్నారు.

5. మరికొందరు యోగమతస్థులు, ఈవిధమగు పలు విధములయిన జగమును, సృజించడమునకు జడమయిన ప్రకృతి యొక్కటియే కారణముకాదు. స్త్రీపురుష సంయోగమువలన సంతానము కలుగునట్లు ప్రకృతి పురుష సంయోగమువలన జగత్తు పుట్టుచున్నదని వాదించుచున్నారు. ఇందుకు శ్రుతి " మాయాంతు ప్రకృతివిద్యాత్ । మయినంతు మహేశ్వరం। తత్సంసర్గవశాచ్చైవ । ఏతత్సర్వం ప్రజాయతే " అని పలుకుచున్నారు.

6. వైయాకరణమతస్థులు శబ్దమే బ్రహ్మమనియు శబ్దమువలననే ఈ సమస్తమును పుట్టుచున్నదని చెప్పుచు

న్నారు. ఇందుకు శ్రుతి "చత్వారి శృంగాత్రయోఅస్య పాదాః । ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య త్రిధాబద్ధో వృషభోరోర వీతి, మహోదేవో । మర్త్యాగుంఆవివేశ" అని శ్రుతిని చెప్పుచున్నారు,

7. కొందరు విరాణ్మతస్థులు, అనేకమైన శిరస్సులు, చేతులు కాళ్ళుగల విరాట్పురుషుఁడే జగత్కర్తయని వాదించు చున్నారు. ఇందుకు శ్రుతి "సహస్రశీర్షపురుష స్సహస్రాక్షః స్సహస్రపాత్" అని ప్రమాణము చెప్పుచున్నారు.

8. ఇటువలనే మరికొందరు శైవ, వైష్ణవ, గాణాపత్య, శాక్త, సౌర, కాపాలికులు, బహువిధములుగ వాదించు చున్నారు. వీరిలో శైవులు స్మృతి—"శివాత్పరతరంనాస్తి।ఏక ఏవరుద్రోనద్వితీయాయతస్థే, కారణాత్కారణంశివః" అని శ్రుతిస్మృతుల ననుసరించి, శివుఁడే జగత్కర్తయని చెప్పు చున్నారు. వైష్ణవులు శ్రుతి "నారాయణోవా అకామయత ప్రజాస్సృజేయేతి" అని, శ్రుతి ననుసరించి విష్ణువే జగత్కారణమని చెప్పుచున్నారు. శాక్తులు "చిదేవ, బహిరంతరనుప్రవిశ్య, స్వయమేకైవవిభాతి" అను శ్రుతి ననుసరించి, శక్తియే జగత్కారణమని చెప్పుచున్నారు. సౌరులు శ్రుతి "సూర్య, ఆత్మాజగతస్తస్థుషశ్చ" అను శ్రుతి ననుసరించి, సూర్యుఁడే జగత్కర్తయని చెప్పుచున్నారు.

కాపాలిక మతస్థులు కాశీయందు భైరవునియొక్క యాజ్ఞ కలదు. ఆహేతువుచేత భైరవుఁడే జగత్కర్తయని చెప్పు చున్నారు. స్మృతి "భైరవాదన్యోనవిద్యతే" అని చెప్పు చున్నారు. గాణాపత్యులు శ్రుతి — "గణపతిరేవాగ్రఆసీత్" అను శ్రుతి ననుసరించి, గణపతియే జగత్కర్తయని పలుకు చున్నారు.

9. హైరణ్యగర్భ మతస్థులు, శ్రుతి — "హిరణ్య గర్భస్సమవర్తతాగ్రేజాతః పతిరేక ఆసీత్" అనుశ్రుతి ననుస రించి, హిరణ్యగర్భుఁడే జగత్కర్తయని వాదించుచున్నారు.

ఇటుల, పలువిధములుగ కలహించుచుండఁగ, నిర్వి కల్ప స్వరూపమైన పరబ్రహ్మమే జగత్కారణమని చెప్పుటకు కారణమేమి ? ఇదిగాక వీరందరు జగజ్జీవేశ్వరులు భేదముగా నున్నారని చెప్పుచుండఁగ, నిర్వికల్ప రూపమైన, బ్రహ్మమే యని చెప్పుటకు కారణమేమి ? ఈ విధముగ పూర్వపక్షము రాగా సమాధానము చెప్పఁబడుచున్నది. ఈ తొమ్మండు గురు మతస్థులు జగజ్జీవేశ్వర భేదమును చెప్పినను, అనేకులు గ్రుడ్డివాండ్రు, ఒక్క కన్నుగలవానికి రూపదర్శనమందు ప్రతిపక్షులు కాఁజాలరు.

ఆవిధముననే, ఉపనిషత్తులన్నియు, ఉపక్రమోప సంహా రాది, షడ్విధ తాత్పర్యములచేతను, స్వానుభవముచేతను. తెలిసికొనిన, బ్రహ్మవేత్తకు పైని చెప్పఁబడిన మతస్థులంద

రును శ్రుతి స్మృతుల ననుసరించి చెప్పిన పూర్వపక్షముల విచారించగా వారు వర్ణించిన శ్రుతులు ముందు, వెనుక ఆలోచించినవిగావు. ఇదిగాక వారివారి వాదమునకు దగిన యొక్క శ్రుత్యంతరమును దీసికొని కలహించుచున్నారు. వారిచేత చెప్పఁబడు యుక్తులు, వారిలోనే పరస్పరభేదమును బుట్టించుచున్నవి. కనుక అనుభవము లేనేలేదు. దీనిని విద్యారణ్య స్వాములవారు పంచదశిలో శ్రుతి సమన్వయము చేసి, యుక్తులను, కుయుక్తులని చెప్పిరి శ్లో. "పూర్వాపర విమర్శ్య, వికలాస్తత్రకేచన। వాక్యాభాసాన్, స్వస్వపక్షే, యోజయంతిహ్యాలజ్జయాం" అనఁగా లోకమునందు పిచ్చివాండ్రు ఏదోయొక వాక్యమును దీసికొని పైని చెప్పఁబడినది ఏదియో తెలియఁజాలక మాటాడిన విధముననే, నీమతస్థులు శ్రుతియుక్తు లున్నవని మాధవాచార్యులు ఖండించిరి. ఇటులనే శ్రీ శంకరభగవత్పాదులవారును శారీరక, మీమాంస భాష్యమందు ఖండించిరి. మేరువు పర్వతముయొక్క శిఖరమందు గూర్చున్న మనుజుని జూచి భూమిపై నడుచుచున్న మనుజులు నవ్వినట్లు భేదమతివాదులయొక్క వాక్య మిట్లున్నవని శంకరులవారు వర్ణించిరి.

ఉపనిషత్తులయొక్క సమన్వయము యీక్రింద చెప్పఁబోవు విధమున చేయవలయును. అట్లు చేసినయెడల సమస్త

మయిన శ్రుతులు, పరస్పర విరోధము లేకుండునట్లు సమన్వ యించును. శ్లో. " ఉపక్రమోపసంహార అభ్యాసశ్చా పూర్వ తాఫలం|అర్థవాదోప పత్తిశ్చ లింగం తాత్పర్యనిర్ణయే " అనఁగా ఉపక్రమోప సంహారములు ఒకటి, అభ్యాసము రెండు, అపూర్వత మూడు, ఫలం నాలుగు, అర్థవాదము అయిదు, ఉపపత్తి ఆరు. ఈ యారును షడ్లింగములు. వీటిచేత చేయు సమన్వయమే, సర్వశ్రుతి సమన్వయము. ఉపక్రమోప సంహారమనఁగా, ఒక యుపనిషత్తును బుచ్చుకొని దాని ప్రారంభమందు చెప్పఁబడిన వాక్యమును, ఆ యుపనిషత్తు యొక్క చివర చెప్పఁబడిన వాక్యమును, ఒక అర్థమునే తెలి యఁజేయవలయును. అనఁగా, ఐతరేయోపనిషత్తునందు " ఆత్మానా ఇదమేకఏవాగ్రఆసీత్, నాన్యత్కించనమిషత్ " అని సృష్టికంటె పూర్వమునందు నిర్వికల్పమయిన యాత్మ యొక్కటియే యున్నది మరియొక్కటియేమియులేదు. అని ఉపక్రమించి ప్రజ్ఞానం బ్రహ్మయని ఉపసంహారము చేయఁబడి నది. అనఁగా అనిర్వికల్పకమయిన యాత్మే, మనుజునియొక్క ఇంద్రియము లన్నిటియందును సృష్టియైన సమస్త బ్రహ్మాండ మందు నుండు తెలివియే ఆయాత్మ. ఆయాత్మయే తెలివి. అని చెప్పుట యొక లింగము. అభ్యాసము అనగా, ఆత్మే, ప్రపంచమందుండు జ్ఞానము, జ్ఞానమే యాత్మ. అని యనేక సార్లు చెప్పుట. అపూర్వత అనఁగా, కర్మకాండయందు శ్రుతి

యొక్కటే ప్రమాణము, ఇక్కడ శ్రుతి అనుభవము కూడ ప్రమాణము అని చెప్పుట. ఫలము అనఁగా, ఈ దేహేంద్రియాది దుఃఖమును వదలి పైని చెప్పఁబడిన బ్రహ్మాత్మత్వము పొందుట. అర్థవాదము అనఁగా, చెప్పఁబడిన వాక్యమందు వేరైన అర్థము తోఁచుచున్నప్పటికి మొదట నుపక్రమింపఁబడిన అంశమును తాత్పర్యముగ చెప్పుట. ఉపపత్తి అనఁగా, ఏయధికారికి నేవిధముగ బోధించవలయునో ఆవిధముగ బోధించుట.

## పంచవింశతి తత్త్వప్రకరణము.

నిత్య-నిర్మల-నిర్వికార-నిరామయ-నిర్గుణ-సర్వాత్మక-సత్యస్వరూపుఁడై నట్టిది యొక్కటియే సృష్టికంటె పూర్వము నందున్నది. రెండవది లేదు. అదియే బ్రహ్మమని చెప్పఁబడుచున్నది. అట్టిబ్రహ్మమునందు అనాదియైనట్టియు బ్రహ్మమువలెనే నిర్వికారమైనట్టి ప్రకృతి యొకటికలదు. ఆప్రకృతి శుద్ధసత్త్వమని మలినసత్త్వమని రెండుభాగములుగా నున్నవి. పైనిచెప్పిన బ్రహ్మచైతన్యము శుద్ధసత్త్వమందు ప్రతిబింబించినప్పుడు ఈశ్వరుఁడని ఈ యీశ్వరుఁడు మలినసత్త్వమందు ప్రతిబింబించి జీవుఁ డనెడి సంజ్ఞను వహించెను శుద్ధసత్త్వమునకు మాయ యనియు మలినసత్త్వమునకు అవిద్యయనియు

పేసు. ఈ రెండును ప్రకృతిస్వరూపములే మాయయందు ప్రతిబింబించిన ఈశ్వరునివల్ల హిరణ్యగర్భునివలన విరాట్టు పుట్టెను. విరాట్టునకు పూర్వమందు హిరణ్యగర్భునివలన మహత్తత్వమును, మహత్తువలన, అహంకారమును, కలిగెను. ఈ అహంకారము సత్వ, రజస్తమో గుణాత్మకమై యాయెను. అందు సత్వగుణమందు జ్ఞానేంద్రియములును, రజస్సునందు కర్మేంద్రియములును, తమస్సునందు, ఆపదియింద్రియముల కును, విషయములును, వరుసగా కలిగెను. అందు సత్వ మందు కలిగిన శబ్దమువలన సదాశివుఁడు అధిదేవతయైనట్టి, అకాశముపుట్టెను, స్పర్శగుణమువలన యీశ్వరుఁడు అధిదే వతకలిగిన వాయువుపుట్టెను. రూపమువలన రుద్రుఁడు అధి దేవతగా కలిగిన అగ్నిపుట్టెను. రసమువలన, విష్ణువు అధి దేవతగా కలిగిన జలముపుట్టెను. గంధమువలన బ్రహ్మ అధి దేవతకలిగిన భూమిపుట్టెను. ఇవియే మహాభూతములు. వీటి గుణములే సూక్ష్మభూతములు వీటికి సదాశివాదులు అధిష్ఠాన దేవతలు యివియంతయు సూక్ష్మసృష్టి. ఇకను స్థూలసృష్టి చెప్పుచున్నాఁడు ఆకాశాది పంచమహాభూతములను ఆపర మేశ్వరుఁడు, ఒక్కొక్క భూతమును రెండేసిభాగములుచేసి, దానిని మరల సూక్ష్మభాగములుచేసి, పంచుటవలన, యిరు వదియైదు తత్వములున్నవి. ఇంకొకమార్గము చెప్పుచు న్నాఁడు. ఈపయినచెప్పిన పంచభూతములకు ముఖములు,

సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, యీశానము లను, పంచబ్రహ్మలును అధిష్ఠానదేవతలు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను, పంచకర్తలును సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములను, పంచకృత్యములును, జ్ఞాత, మనో, బుద్ధి, చిత్త, అహంకారములయిన అంతఃకరణ యును, ఇవి యన్నియుకలిసి పరాశక్తియాయెను. ప్రాణా పాన, వ్యానోదాన, సమానములును, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములును, ఇవియన్నియు గలిసి ఆది శక్తియాయెను. త్వక్చక్షుశ్శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణము, లయి దును, వీని విషయములయిన శబ్ద, స్పర్శ, రూప రస గంధము లయిదును వీనికి అధిష్ఠానదేవతలయిన వాయువు, సూర్యుఁడు, దిక్కులు, వరుణుఁడు, అశ్వినీదేవతలు, ఇవియన్నియు కలిసి జ్ఞానశక్తియాయెను. పృధివ్యాది పంచభూతములును, వాని యందు చేయఁబడిన పంచీకరణమును కలిసి, ఇచ్ఛాశక్తి యాయెను. వాక్పాణి, పాద, పాయూపస్థలును, వానివిషయ ములయిన వచనాదాన, గమన, విసర్గానందములును, అగ్ని, ఇంద్ర, విష్ణు, ప్రజాపతి, మృత్యువులును, యివియన్నియు గలిసి, క్రియాశక్తియాయెను.

ఆపరమేశ్వరుఁడు పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తులనుగూడి, భూతసృష్టియును, భౌతిక

సృష్టియును, వాని యధిష్ఠాన దేవతలనున్ను వాని కృత్యములను వేరు వేరుగ నొక్కొక్క భాగమునకు అధ్యాత్మికమయిన ఇంద్రియములను, అధిదైవికములయిన అధిష్ఠాన దేవతలను, ఆదిభౌతికములయిన వానివాని కృత్యములను, అధిష్ఠాన దేవతా ప్రేరణచేత అధ్యాత్మయందు ఆదిభౌతికములైన విషయములను కల్పించెను. నేత్రేంద్రియమందు సూర్యుఁడు అధిష్ఠానమై రూపమును కలుగజేయును. శ్రోత్రేంద్రియము నందు దిక్కులు అధిష్ఠానమై శబ్దములను గలుగజేయును. ఈవిధముననే త్వగాది యింద్రియములన్నిటియందును కలుగుచున్నవి. ఇవి యన్నియు గలిసి బ్రహ్మాండమాయెను. ఆబ్రహ్మాండమే దేహముగల విరాట్పురుషుఁడు పుట్టెను. ఆవిరాట్పురుషునకు పాతాళలోకము పాదములును, రసాతలము చీలమండలును, సుతలలోకము, జంఘలును, వితలలోకము, జానువులును, అతలము, ఊరువులును, తలాతలము కటిప్రదేశమును, మహాతలము పొత్తికడుపును, నాభి, భూమియును, కడుపు, భువర్లోకమును, హృదయము సువర్లోకమును, కంఠము, మహర్లోకమును, ముఖము జనలోకమును, భ్రూమధ్యస్థానము, తపోలోకమును, శిరస్సు సత్యలోకమును ఆయెను. విరాట్టు, హిరణ్యగర్భుఁడు, అవ్యాకృతుఁడు, స్వరాట్టు, ఈనాలుగు దేహములయిన యీశ్వరునకు దిక్కులు చెవులును, వాయువు త్వగింద్రియమును, సూర్యచంద్రులు

నేత్రములును, బ్రహ్మ స్థానము భ్రూమధ్యమును, వరుణుఁడు జిహ్వేంద్రియమును, ఘ్రాణము అశ్వనీదేవతలును, అగ్ని వాక్కును, బాహువులు ఇంద్రుఁడును, ఉపేంద్రుఁడు పాదములును, ప్రజాపతి గుహ్యేంద్రియమును, మృత్యువుపాయువింద్రియమును, చంద్రుఁడు మనస్సును, బుద్ధి బ్రహ్మయును, చిత్తము క్షేత్రజ్ఞుఁడును, అహంకారము రుద్రుఁడును, జ్ఞాత అంతఃకరణమును ఆయెను. ఈవిధమున, మాయాప్రతిబింబితుఁడైన యీశ్వరుఁడు పుట్టెను. మహాకాశము, సాభ్రనక్షత్రాకాశము, అంతరాళాకాశము, ఘటాకాశము, అను నీనాలుగు ఆకాశమువలెనే శుద్ధనిర్గుణతత్వము మహాకాశము.

ఈశ్వరుఁడు సాభ్రనక్షత్రాకాశమును, మాయాఅంతరాళాకాశమును అవిద్యాఘటాకాశమును అయియున్నవి. వీనిలో ఘటజలమందు ప్రతిబింబించిన ఆకాశమువంటివాఁడు జీవుఁడు ఆజీవునియందు బుద్ధియను అంతఃకరణ ప్రతిబింబించెను. జలమందు ఆకాశము ప్రతిబింబించినట్లు అంతఃకరణమందు సాక్షిచైతన్యము ప్రతిబింబించిన చిదాభాసుఁడు యీమూఁడునుగలిసి, జీవుఁడను పేరుగలిగెను. కాల్చిన యినుప ముద్దయందు సాగడమును, కఠినత్వమును, ప్రకాశమును కలిగినప్పుడు యినుపముద్ద కాల్చుచున్నది. అనెడి వ్యవహారము

వల్లనే నేను సమస్తము చేయుచున్నానని భ్రాంతిచేత క్రియా శక్తితోఁ గూడి ఆయింద్రియవ్యాపారములను జూచుచు అవి యే తనకు సుఖమును కలుగజేయుచున్నవని తన సత్యజ్ఞానాది లక్షణములను మరచిపోయి ఆమరవు అనేపేరుగల అవిద్య యందు మునిఁగి, ఆవరణ విక్షేపములలోఁ బడి ఆవరణచేతను తన మనస్సునకుఁ దోఁచిన పదార్థమును కావలయునని కోరుచు అదిదొరకనియెడల క్రోధపడుచు యీవిధమున అరిషడ్వర్గము లలోఁ బడి తుచ్ఛుఁడై ఎఱ్ఱకొఱకై చేప గాలములోఁ బడి నట్లు మానసేంద్రియాది వ్యాపారములలో విషయములను కోరుచు పుణ్యములను వదలి పాపములను చేసి ద్రవ్యాదులను సంపాదించి కొంతకాలమునకు మరణమునొంది తిరిగి దేహము లోబడి పూర్వవాసనచేతను యితరుల సేవకొఱకే శ్రమపడుచు స్త్రీలని, పురుషులని, నానావిధభేదములచేత, వారు, మీరు, నేను, అనియు వారివల్లనాకు కార్యములు కలుగుననియు, నావల్లవారికి యెన్నికార్యములయినవో అనియు భ్రమచేత చెడిపోయి అనేకపర్యాయములు పుట్టుచు, చచ్చుచు, మధ్యను యేదియో యొకజన్మమునందు నేనుచూచుచున్నాను, నేను మాట్లాడుచున్నాను అనునప్పుడు వినుట, చూచుట, మాట్లా డుట అనే క్రియలు నాయందు నిత్యమా అనిత్యమా? అని విచారించి యేక్రియతో కలిసినప్పుడు ,,నేననే'' కర్త నశించక పోవుటను, యిట్టిక్రియలు అనిత్యములు, ,,నేను'' అనెడి వస్తువు

సృష్టికి ఆదియైన సత్యజ్ఞానాదిలక్షణములుగల బ్రహ్మమేయని, దారాపుత్రాదులకు బ్రహ్మ, పరలోకములను వదలి యుక్తిచే తను, తనస్వరూపమును తెలిసికోవడమునకు, బ్రహ్మస్వరూపుఁడైన సద్గురుని జేరి ఆయనకు చతుర్విధ శుశ్రూషలుచేసి తన దేహేంద్రియాదులను ఆయనకు సమర్పించి నన్ను యీ సంసారమునుండి రక్షింపుమని ప్రార్థనచేయఁగా ఆసద్గురుఁడు శిష్యుని రక్షించుటయే ప్రధానమని యెంచి నీవే బ్రహ్మవు నీకంటె వేరైన వస్తువు యేదియులేదు. నీవు సృష్టికంటె పూర్వమందున్న ఆ బ్రహ్మస్వరూపుఁడవై నిల్చినట్టియున నీకు కనఁబడు అనేకకోట్ల బ్రహ్మాండములును, ఇప్పుడు యెదుటకనఁబడు వస్తువులును, ఇవి యన్నియు కల్పితములగుటచేత అగ్నియందు బడిన కాష్ఠములు అగ్నియగునట్లు నీకు కనఁబడు ఈమూల ప్రకృతి మొదలుకొని యీదేహమువరకు, ఈదేహము మొదలు విషయములవరకును, నీస్వరూపమే యగుచున్నది అని యుపదేశింపబడి తాను చక్కఁగా వినిన ప్రకారము యుక్తి యుక్తముగ మనస్సునందు నాలోచించి తనయందే తనకు సుఖముకలుగునని నిశ్చయించుకొని సృష్టిలో మనస్సుచేత కల్పింపఁబడిన కామాది శత్రువులను బంధించి పాములను పులులను విడిచినట్లు యీదేహేంద్రియాదులను విడిచి బ్రహ్మాండమంతయు, ఈతనదేహమునందే యున్నట్లు విచారించి యీ

దేహమందు పాదములు మొదలు కంఠమువరకు పిండమని యు, కంఠము మొదలు శిరస్సువరకు బ్రహ్మాండమనియు విచారించి శ్రుతి యుక్త్యనుభవములను క్రమముగా మననముచేసి బ్రహ్మాండమందున్న ఆగ్నేయచక్రమందు తన తెలివిని నిల్పి అధోభాగమందు ప్రసరింపఁ జేయక దేహమందుండు నూట యొక్క నాడులను శోధించి తనశరీరమును బయటకుఁ ద్రోచి తాను అన్నింటికి సాక్షియై నిలిచినవాఁడే పరబ్రహ్మము, వాఁడే విష్ణు, మహేశ్వరస్వరూపుఁడు, వాఁడే నిరుపాధికుఁడు, వానికి వేరైన వస్తువు యొక్కడను లేదు.

"శ్రుతి॥ అనిత్యాం సర్వాంపరిత్యజ్యశివ ఏకోధ్యేయః," శివునికంటె నితరమంతయు అనిత్యము ముత్యపుచిప్పలయందు తోచిన వెండి ఆభరణములకు నక్కరకు వచ్చినట్లయినయెడల, యీప్రపంచమువలన తనకు నిత్యనిరుపాధి సుఖముగలుగును. ఈకనఁబడు జగత్తు అంతయు అవస్థలు మారినప్పుడు లేకపోవు చున్నది. కనుక అవస్థలయందు మునుగక వేరైనట్టియు, జ్ఞప్తిరూపకమైనట్టి తనస్వరూపము "అరచేతిలోని యుసిరిక కాయవలెనే" ఉన్నది.

శ్రుతి॥ "శతంచైకాచహృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా, తయోర్ధ్వమాయన్నమృతత్వమిచ్ఛన్, విష్వఙ్న్యా, ఉత్క్రమణేభవంతి," "జ్యోతిర్లింగంభ్రువోర్మధ్యే,

నిత్యంధ్యాయేత్సదాయతిః,'' ,,వారాణసీతివిజ్ఞేయాత్రికూటం బ్రహ్మవాదినాం" కఠోపనిషత్తు.

ఈదేహమందు, నూటయొక్క నాడులు గలవు వానిలో నొక్కనాడి పెద్దది. అదియే సుషుమ్నయని చెప్పఁబడును. కనుక జ్ఞప్తిరూపమైన జీవుని, నితరనాడులయందు సంచారము లేకుండునటుల జేసి, యానాడిని ఊర్ధ్వముఖమును బొందించినయెడల నాడీశుద్ధికలిగి, ఈజీవుఁడు మరణము బొందదు, ఇతరులు మరణము బొందుదురు. జ్ఞప్తిరూపమైన తాను అన్నిటిని ప్రకాశింపఁజేయు జ్యోతిరూపముగా భావనజేసి అవ్యక్తాది సృష్టిని వదలి భ్రూమధ్యస్థానమందు నిలిచి, అనుసంధానము చేయవలయును. ఈభ్రూమధ్యమే, యోగులకు ,,కాశీ" యని చెప్పఁ బడుచున్నది. అతఁడే బ్రహ్మము అతఁడే స్వయంభు.

శ్రుతి. ''యదేతద్ధృదయమ్మనశ్చైతత్, సంజ్ఞానం, మజ్ఞానం, విజ్ఞానం, ప్రజ్ఞానం, మేధా, దృష్టిర్ధృతిర్మతిర్మనీషా జూతిస్స్మృతిస్సంకల్పః క్రతురసుః కామోవశస్సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్వనామధేయానిభవంతి, స ఏషబ్రహ్మ, ఏషఇంద్ర, ఏషప్రజాపతిరేతే సర్వేదేవా, ఇమానిచ పంచమహాభూతాని పృథివీ వాయురాకాశ, ఆపోజ్యోతీంషి, ఇత్యేతానీమానిచ క్షుద్రమిశ్రాణీవబీజానీతరాణిచేతరాణిచాండజానిచ జారుజానిచస్వేదజానిచోద్భిజ్జానిచ, అశ్వా, గావః, పురుషాహ పరం సర్వంతత్ ప్రజ్ఞానేత్రమితి''

సమస్తపదార్థములు, దేవ, మనుష్య, తిర్యగాదులు, అండజ, జరాయుజ, స్వేదజ, ఉద్భిజ్జాది చతుర్విధసృష్టియు ఇది యంతయు తానైన, ప్రజ్ఞానముచేత నే నడుచును; ప్రజ్ఞానమే, చైతన్యస్వరూపము, ఇతరమంతయు జడస్వరూపము. "మలభాండం యథాలోకే దూరతః పరివర్జయేత్" లోకమ్ములో అమేధ్యభాండమును ఏలాగున నపహరించెదరో, ఆలాగుననే దేహమును దూరముగఁ ద్రోసి ఈదేహమందున్నఁ చక్రములయందుండు హంస సూత్రమును తెలిసికొని, తాను బ్రహ్మమై నిలువవలయును.

## చక్రములయందు హంసతిరుగు క్రమము.

"షట్ఛతంగణనాథస్య షట్సహస్రంప్రజాపతేః
షట్సహస్రంమహావిష్ణోః షట్సహస్రంమహేశితుః
సహస్రం జీవరూపస్య సహస్రం ఈశ్వరాత్మనః
సహస్రం గురురూపస్య ఏకంబుద్ధ్యాప్రకల్పయేత్"

ఈచక్రములయందు తిరుగు వాయువు ప్రాణమని చెప్పఁబడును. ఆ వాయువే స్థానభేదముచేతను దశవిధములై ప్రకాశించుచున్నది. అందు ప్రాణవాయువు హృదయమందుండి జలరూపమై తెల్లని వర్ణముకలదై మీఁదుగ సంచరించుచు ముఖ, నాసికలయందు, విహరించును అపానము మూలా

ధారమునందుండి నల్లని వర్ణముకలిగి భూరూపముకలదై భుజించిన అన్నమును, అదోముఖముగ విసర్జనచేయుచు, దేహమునకు బలము కలుగజేయుచుండును. వ్యానవాయువు సర్వశరీరమందున వ్యాపించి, ఆకుపచ్చనివర్ణము కలదై శరీరమందున్న చర్మమునకు స్పర్శమును కలుగఁజేయుచు వాయురూపమై యుండును ఉదానవాయువు కంఠమందుండి, అగ్నిరూపముకలదై ప్రాణపానములమధ్యను తిరుగుచున్న జీవుఁడుచేసిన కర్మప్రకారము దేహములను కలుగజేయుచుండును. సమానవాయువు నాభియందుండి ఆకాశరూపముకలదై భుజించిన అన్నమును నాడులకు బంచిపెట్టుచు, శరీరమందు సప్తధాతువులను వృద్ధిబొందించును రోమములయందు నాగవాయువుండి వెడల గ్రక్కుట మొదలైన క్రియలను చేయుచుండును. కూర్మవాయువు ముఖమందుండి ఓష్ఠములను చలించునట్లుచేసి నానావిధశబ్దములను పుట్టించును కృకరవాయువు ముక్కుకొననుండి గంధమును న్రాఘూశించునట్లు చేయును. దేవదత్తము అను వాయువుకంటియందుండి మూయుట తెరచుటను గలుగజేయును దనంజయమను వాయువు బ్రహ్మరంధ్రమందుండి, నిద్రబోవుకాలమున శరీరమును కాపాడుచు ప్రాణము విడిచినపిమ్మటను దేహమును వదలక అగ్ని చల్లారినను, కొంతతడవు పోగయున్నట్టుండి శరీరమునకు స్థూలమును కలుగజేయును. ఈవిధమున పదివాయువులు గాంధారి

మొదలయిన పదివాయువులయందు తిరుగుచు, ప్రాణవాయువు, కుడి యెడమలయందున, ఇడ, పింగళలను నాడులయందు తిరుగుచు క్రిందికి మీఁదికి నడుచుచుండును. ఇడాపింగళలు, ఆధారము మొదలుకొని, ఆగ్నేయచక్రమువరకు నుండును. మధ్యయందున్న సుషుమ్ననాడి ఆగ్నేయమును దాటి బ్రహ్మ రంధ్రము పర్యంతము వ్యాపించి రహస్యమైనదై దేహమధ్య మందు ప్రధానమై యుండును.

ఇట్టి అతిరహస్యమును, జీవుఁడు తెలిసికొనలేక గురుసేవ చేయక కాశీ, ప్రయాగ, మొదలయిన, తీర్థయాత్రలకు ప్రయ త్నించుచు, సాలోక్యాది ముక్తులను గోరుచు, వాని నిమి త్తమై కాలమంతయు, వ్యర్థముగ గడుపుచుండును. ఇందు వలన, ఆడుచున్న బంతివలెనే "హంస" క్రిందికి మీఁదికిఁ దిరు గుచు సుఖదుఃఖములకు లోనై యుండును. ఆ హంసయే శబ్దరూపమైన వాక్కు, పరంజ్యోతి, అదే యూర్ధ్వకుండలి, అదే అమృతమునకు స్థానము, అదేసమస్తసృష్టికి కారణము, అదే మెరుపువలెనే కొంచెము కాలము కనఁబడి వెంటనే కప్పఁ బడును, ఈమెరుపును అభ్యాసములోఁ జూడవచ్చును. ఆసహ స్రారమందే, అవ్యక్తాది సమస్తసృష్టియున్నది. దానియందు "తాను" అనఁగా జీవుఁడు [illegible]ంచునపుడు కనఁబడు సమ స్తము చిద్విలాసమై యుండును అప్పుడు ఈజీవునకు, నేదో షము నంటదు. ఇట్టి మార్గమును దెలియలేక దారాపుత్రా

దులు తనను రక్షించెదరని వలలోఁ బడ్డ పిట్టవలెనే ఈదేహ మందున్న అమృతపానమును జేయలేక దేహము నే ననుకొని, కొట్టుకొనుచుండును. దీనిలో జీవుఁడు తనకంటె వేరైన వస్తువు కలదని తన నేర్పుకొలఁది కర్మభక్తి మొదలయినవాటినిఁ జేయుచు కర్మకాండలో మునిఁగి యుండురు. అంటుకుండ గంగలో ముంచినను పవిత్రము ఎట్లుకాదో అటువలెనే, ఈదేహమును, ఎన్నిసార్లు గంగలో ముంచినను బాహ్యదృష్టిచేత నెన్నికర్మలను చేసినను మోక్షము రాఁజాలదు. అన్నిముక్తులు జీవన్ముక్తికంటె తక్కువైనది.

## సప్తచక్రములయందు ఆత్మనిరూపణమునకు శ్రుతి ప్రమాణము.

—:0:—

### 1. మూలాధారము శ్రుతి.

"ఆధారే బ్రహ్మచక్రం త్రిధావర్తం భగ మండలాకారం తంత్రమూలకందః తత్రశక్తిం పావనాకారం ధ్యాయేత్ తత్రైవసర్వకామేశ్వరీ పీఠం సర్వకామఫలప్రదంభవతి.

### 2. స్వాధిష్ఠానము శ్రుతి.

ద్వితీయం స్వాధిష్ఠానచక్రం తన్మధ్యే పశ్చిమాభిముఖంలింగం ప్రవాళాంకురసదృశం ధ్యాయేత్ తత్రైవ ఓడ్యాణపీఠనిలయం జగదాకర్షణంభవతి.

3. మణిపూరకము శ్రుతి.

తృతీయంనాభిచక్రం పంచావర్తం సర్పవత్కుటిలాకారం
తన్మధ్యేకుండలీశక్తిం బాలార్కకోటిసదృశింధ్యాయేత్
సామర్థ్యశక్తిః సర్వసిద్ధిదాభవతి.

4. అనాహతము శ్రుతి.

చతుర్థంహృదయాధారం అష్టదళకమలం అధోముఖం
తన్మధ్యే కర్ణికాయాం లింగాకారం జ్యోతిర్ధ్యాయేత్
సైవాహంనకళాసర్వేంద్రియవస్యాభవతి.

5. విశుద్ధచక్రము శ్రుతి.

పంచమంకంఠచక్రం చతురంగుళం తత్రవామే
చంద్రనాడీఇడా పింగళాసూర్యనాడి
తన్మధ్యేసుషుమ్నాంధ్యాయేత్
సైవ అనాహతకళా అనాహత సిద్ధిర్భవతి.

6. తాలుచక్రము శ్రుతి.

షష్ఠంతాలుచక్రం తత్రఅమృతధారాప్రవాహః
ఘంటికామూలరంధ్ర రాజదంతి సంధిని వివరద్వారం
తత్రశూన్యంధ్యాయేత్ చిత్తలయోభవతి.

7. ఆగ్నేయచక్రము శ్రుతి.

సప్తమం భ్రూమధ్యచక్రం తత్రఅంగుష్ఠమాత్రం జ్ఞాననేత్రం
దీపశిఖాకారం ధ్యాయేత్ వాచాసిద్ధిర్భవతి.

8. సహస్రారచక్రము శ్రుతి.

అష్టమం బ్రహ్మరంధ్రం నిర్వాణచక్రం సూచికాగ్రభేద్యం
ధూమశిఖాకారం ధ్యాయేత్
తత జాలంధరపీఠం మోక్షప్రదంభవతి.

9. ఆకాశచక్రము శ్రుతి.

నవమంఆకాశచక్రం షోడశదళకమలం ఊర్ధ్వముఖం
తన్మధ్యేకర్ణికాయాం త్రికూటాకారంభవతి
తదూర్ధ్వశక్తిం తాంతాంపరమశూన్యాంధ్యాయేత్
తత్రైవపూర్ణగిరిపీఠం సర్వేచ్ఛాసిద్ధిర్భవతి.

పైని చెప్పిన నవచక్రములును, షట్చక్రములయందే అంతర్భావము షట్చక్రములయందు హంసధ్యానము చేయుటకు ప్రమాణములు.

హంసకు ఆయా యీస్థానములయందు కలిగిన నామముల వివరము.

శ్లో. హంసోగణేశో విధిరేవహంసో
హంసోహరిర్విశ్వమయశ్శంభుః
హంసోహమాత్మా గురురేవహంసో
హంసోహహంసః పరమాత్మహంసః॥

"హంసః" ఈశబ్దమందుండు, హ కారము, (ం) బిందు స కారము, (ః) విసర్గము. ఈనాలుగున్ను పరమాత్మకు స్థాన

ములైన, నాభి, హృదయము, కంఠము, బ్రహ్మరంధ్రము, లని బ్రహ్మోపనిషత్తునందు చెప్పఁబడెను.

శ్రుతి "అథాస్య పురుషస్య చత్వారిస్థానానిభవంతి" వీనియందే చతుష్పాద్బ్రహ్మము ప్రకాశించును. ఇదియే నాలు గవస్థలును. ఇవి కలిసి బ్రహ్మగ్రంధితోఁ గూడ మూడుదార ములతోనున్న యజ్ఞోపవీతమని చెప్పఁబడును. బ్రహ్మరంధ్ర మునందుండి అమృతము చుక్కలుగ కారుచుండును. దీని రహ స్యము గురుపూలకమున తెలియనగును పరబ్రహ్మోపనిషత్తు, బ్రహ్మోపనిషత్తు, ప్రమాణములు.

హృదయపద్మమందు ప్రాణవాయు నిలిచి షట్చక్రముల యందును యేబదివర్ణములు, దంతములు, తాలవ్యములు ఓష్ఠ్యములు, దంతోష్ఠ్యములు అనునాసికలు, మూర్ధన్యములు, కంఠ్యములు, అను నేడుప్రకారములుగ నున్నవి. ఈవర్ణ ములు, అధోకుండలి మొదలు, ఊర్ధ్వకుండలి వరకు వ్యాపించి దశవిధనాదము ధ్వనిచేయుచున్నది.

దశవిధనాదములు.

---

చిణి చిణి, చిణీ, శంఖము, వేణు, వీణా, తాళము, ఘంటా, భేరి, మృదంగ, మేఘనాదములు ఈదశనాదములు, లోపల పైని చెప్పఁబడిన నాడులలో దశవాయు ప్రసారమై ధ్వనించుచుండును. ఈధ్వనిని షణ్ముఖి, ముద్రచేతను, అభ్య

సించువారికి శరీరములోపల తెలియుచున్నది. "ఓం" కార మునందే యీనాదములు పుట్టుచున్నవి. ఇదియే సంగీత శాస్త్రమునందు సప్తస్వరములని చెప్పఁబడుచున్నవి. కేవల శ్రోత్రములను మూయుటచేత నభ్యసింపవచ్చును. ఇందుకు హంసోపనిషత్తు ప్రమాణము.

"తర్జన్యం గుష్ఠాభ్యాంకర్ణంధ్రేనిమీల్య నాదంశృణుయాత్ ప్రధమంచిణిచిణిః ద్వితీయ్యాచిణీ తృతీయ్యాశంఖంచతుర్థో వేణునాదఃపంచమంవీణానాదఃషష్ఠంతాళః సప్తమంఅష్టమం ఘంటా భేరి నవమంమృదంగః దశమం మేఘనాదః దశమం పరిత్యజ్య ప్రణవనాదమభ్యసేత్ తత్ర "ఓం" కారే మనో లీనంభవతి"

ఈప్రకారము అభ్యసించినయెడల అణిమాద్యష్టసిద్ధులు కలుగును. ఇదియంతయు ప్రాణాపానముల సంయోగము లచే గలుగుచున్నది. సోహమను స్ఫురణయే రాత్రింబగళ్ళ యందు మూలాధారాది షడ్చక్రములలోను వ్యాపించి, కాలమును నిర్ణయించుచున్నది. ఇది యిడా పింగళ, సుషుమ్న యను నాడులలో క్రిందినుండి పైకి పైనుండి క్రిందికి దినమొక్క టికి 21,600 హంసలు నడుచుచున్నది ఇందుకు ప్రమాణము.

"శ్లో. సకారేణబహిర్యాతి హకారేణవిశేత్పునః
హంసహంసేతియమన్త్రం జీవోజపతి సర్వదా"

## కాశీక్షేత్రం శరీరం.

కాశీ, గయ, ప్రయాగ, శ్రీశైలము, కంచి, కాళహస్తి. ఇవి యన్నియు, ఈశరీరమునందే యున్నవి.

“శ్లో. శ్రీశైలంతు శిరస్థానం ముఖం కేదారనామకం
వారాణసీతుభ్రూమధ్యం కుచస్థానంతు కాంచీస్యాత్
అయోధ్యాహృదయంతథా దేవానాంపూరయోధ్యా
ఇడాభాగీరథీ గంగాపింగళాయమునానదీ
తయోర్మధ్యగతానాడీ సుషుమ్నాఖ్యా సరస్వతీ
ధ్యానప్రదేజ్ఞానజలే రాగద్వేషమలాపహే
యస్నాతి మానసేతీర్థే సయాతి పరమాంగతిం
త్రిచతనువ్యాపినీజ్ఞానగంగా భక్తిశ్రద్ధాగయేయం
నిజగురుచరణధ్యానయోగః ప్రయాగః విశ్వేశో
యంతురీయంసకలమభిమతం వ్యాప్య తేచాంతరాత్మా”
“సుషుమ్నాయాంస్థితంసర్వం దర్పణే వస్తుజాలవత్
తత్రస్థిత్వాతు జీవో సౌదృశ్యం సర్వం పరిత్యజేత్
ప్రాసాదస్థోయథాభూమ్యాం భూమ్యాంతుపరివేష్టితం
సర్వంసూక్ష్మతయాపశ్యేత్ తద్వన్మధ్యగతోజనః”

శరీరము కాశి, ఇందలి జ్ఞానము గంగ, భక్తి శ్రద్ధలు గయ. గురుచరణము ప్రయాగ, విశ్వేశ్వరుఁడు ప్రత్యగాత్మ. ఈవిధమున కాశీ, గయ, ప్రయాగలు ఈశరీరమునందే యు

న్నవి. సుషుమ్నయందు సర్వమును స్వచ్ఛమయిన అద్దమందు, అన్నియు నెటుల ప్రకాశించునో అటులనే ప్రకాశించును. ఈజీవుఁడు తనకుఁ గనఁబడు వస్తువుల నన్నియు దృశ్యముగ జూచుచు, శరీరపతనపర్యంతము, సుషుమ్నయందే నిలిచి, మేడయొక్క చివరనున్నవాఁడు క్రిందిపదార్థముల నన్నిటిని సూక్ష్మమయిన వానినిగా నెటులజూచునో ఆవిధముననే సుషుమ్న కొనయందు నిలిచి కనఁబడు పదార్థముల నన్నిటిని సూక్ష్మమయిన వానినిగాను, నశించువానినిగాను చూచుచు విహరించును.

పరమేశ్వరుండు స్థానము. అది బ్రహ్మరంధ్రము మొదలు కొని యధోముఖముగా వ్రేలాడుచుండును. ఆరంధ్రమును, ఈప్రాణావాయువు ఎప్పుడు పొందునో, అప్పుడు, జీవుఁడు ఆనందస్వరూపుఁడై యుండును.

ఇటువంటి కీలకం బెఱుఁగక దేహమందు మధ్యనాడి చివరను తానుపొంది, పిండబ్రహ్మాండములను, అగ్నియందు బుట్టు అణువులని తెలియలేక దేహమే నేనని, దేహముచేత, పలువిధములయిన బాహ్యభక్తి, కర్మలను జేయుచు చెడి పోయి కర్మకాండలో మునిఁగి దృశ్యరూపమయిన కాశీ, గయా, ప్రయాగలను పొంది ముక్తిని బొందుదు ననుచు కల్లుకుండను గంగలో ముంచినటుల నీశుక్లశోణిత సంబంధమయిన దేహము ను నెన్నిసారులు త్రివేణిలో ముంచినను మోక్షము దొరుకదు

గనుక గురుకీలకము దెలిసి, సాలోక్యాది ముక్తులు, కాశీయాత్ర మొదలయిన వానితో సమానమని తెలిసికొని చిత్తమందు సృష్టిసంబంధమయిన మాలిన్యమును వదలి గురువిచ్చిన దృష్టిప్రకారము పయిని చెప్పినటుల హంసమాత్రమునుబట్టి స్వస్వరూపస్థితిని బొందుటే ముక్తి. ఇటువంటి శరీరమునందు, మాయవిద్యాదృష్టిచేతను, యథార్థమయిన తమ స్వరూపము తెలియలేక సాలోక్యాది ముక్తులను గోరుచు, మహాప్రళయమందు మైనపుముద్దయందు సువర్ణరేణువున్నట్టు వేరు వేరుగా నీజీవులు పూర్వసృష్టి ననుసరించి, జననమరణప్రవాహములోఁ బడి పలువిధదుఃఖములను ననుభవించుచు స్వస్వరూపమును గానలేక బండిచక్రము తిరుగునటుల జీవుఁడు స్వర్గనరకాదులను, వైకుంఠ కైలాసాదులను పొందుచు మరల భూలోకమున పొందుచుండును.

శ్లో॥ తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి॥

శ్రుతి — తత్సుకృతే దుష్కృతేను భూత్వేహైతుకంహీన తరంచావిశతి.

## పంచకోశ వివరము.

“ఆత్మానామస్థూల సూక్ష్మ కారణ శరీరత్రయావిలక్షణసి పంచకోశవ్యతిరిక్తఃఅవస్థా త్రయసాక్షీసచ్చిదానందరూపః”

పరమాత్మపంచకోశ విలక్షణుఁడని శ్రుతులు ఘోషించు చున్నవి. కావున పంచకోశములను మెఱుఁగకనే వాటికి విలక్షణుఁడైన పరమాత్మను మెఱుఁగరాదు. గాన పంచకోశములను విచారించెదము.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము అని కోశములైదు విధములు.

1 అన్నమయకోశము.

"అన్నవికార శుక్లశోణిత జన్యషడ్భావ వికారసహితం
అన్నేనైవవర్ధమానం ఇదంస్థూలశరీరమన్నమయకోశః".
"శుక్లశోణిత సంభూత దేహోన్నమయ ఉచ్యతే"
"అన్నకార్యాణాం సమూహోన్నమయకోశః".

అనురీతిని అన్నమువలన పుట్టి అన్నమువలననే వృద్ధి బొందుచున్నదై స్తంభమువలె స్థూలమై కరచరణాద్యవయవ సహితమైయుండుట, పుట్టుట, వృద్ధిపొందుట, పరిణమించుట, క్షీణించుట, నాశంబగుటయును షడ్భావవికారములు గలదై, సప్తధాతుమయమై కనఁబడెడి స్థూలశరీరమే అన్నమయ కోశము ఆహేతువుచేత కోశమని చెప్పఁబడియున్నది.

"యథాఖడ్గంతత్కోశం ఆమ్రఫలంత్వక్
యథాతుషః తండులాదికమాచ్ఛాదయతి
యథావాగర్భం జరాయురావారయతి
కోశవదాచ్ఛాదకత్వాత్కోశఇత్యుచ్యతే"

ఒర కత్తియును, గుల్ల చింతపండును, పొట్టు బియ్యమును, మావి పిండమును కప్పుకొని కనఁబడకుండా జేయునట్లు పర మాత్మని ఈకోశములు కప్పుకొని కనఁబడకుండా చేయుట చేత కోశమని పేరుకలిగెను.

''నను ఖడ్గాదీనాం తత్కోశాదీనాంచ సత్తాభిన్నా
పంచకోశానామాత్మభిన్నసత్తాకత్వాభావాత్
కోశాదిభ్యోవై షమ్యాత్కథమాచ్ఛాదకత్వమితిచేదుచ్యతే

అయితే దృష్టాంతమందు, ఒరయును కత్తియు మొద లగునవి వేరైన వగుటవలనను, సమానధర్మములు గలవి కానందునను ఒకదాని నొకటి ననుసరించి ప్రకాశించునవి కానందునను, ఆయొర మొదలైనవి ద్రవ్యములను మూసికొని యుండునట్టి వగునుగాని, దార్ష్టాంతికమందు కోశములు తమ సత్తవలన ప్రకాశించునవి గాక ఆత్మసత్త ననుసరించి జీవించి ప్రకాశించుచుండు కోశములు పరమాత్మను కప్పునట్టి శక్తి యెట్లు కలిగెనను శంకకు సమాధాన మిట్లు చెప్పఁబడెను.

''ఆదిత్యకిరణపరిణామ విశేషత్వాన్మే
ఘస్యాదిత్య సత్తైవసత్తాతథాపి మేఘః
ఆదిత్యం యథాచ్ఛాదయతి అగ్నిముపజీ
వ్యవర్తమానస్య ధూమస్యా ప్యగ్నేస్సత్తై
వసత్తా తథాపినధూమఃఅగ్నిమాచ్ఛాద

యతిఏవమాత్మ సత్తయా సత్తావంతోఽపి
కోశా ఆత్మనంఆచ్ఛాదయంతి

సూర్యకిరణము వల్ల కలిగిన మేఘములు సూర్యుని కప్పుకొని కనఁబడకుండా జేయునట్లును, అగ్నివల్ల గలిగిన ధూమము అగ్నినికనఁబడకుండా జేయునట్లును, ఆత్మసత్త ననుసరించి వృద్ధినొందు కోశములు పరమాత్మను కప్పునట్టి శక్తిగలవయ్యెను. అయితే అన్నమయకోశమునకును పరమాత్మకును చేరిక యెట్లుకలిగె ననఁగా అన్యోన్యాధ్యాసము చేత కలిగినది. అన్యోన్యాధ్యాసమనఁగా—ఒక వస్తువునందలి గుణము మఱియొక వస్తువునందు తోఁచుట. అదెట్టులనిన నేను జీవుఁడననుట జీవాధ్యాసము, నేను మనుష్యుఁడననుట జాత్యాధ్యాసము నేను పుట్టి పెరిగి యింత పొడుగై క్షీణించి మరణించుచున్నానననుట వికారాధ్యాసము, నేను బ్రాహ్మణుఁడను, క్షత్రియుఁడ ననుట వర్ణాధ్యాసము, నేను ఆంధ్రుఁడను వెలనాటివాని, మహారాష్ట్రుఁడను, కాశ్యపగోత్రిని, నేను బ్రహ్మచారిని, నేను సన్యాసి, నేను రామయ్యనామాధ్యాసము, నేను నల్లనివాఁడను రూపాధ్యాసము, నేను సోమయాజిని, నేను తత్వవాదిని, విశిష్టాద్వైతిని, పరమభాగవతుఁడను, శైవుఁడను, యోగీశ్వరుఁడను, నేను జ్ఞానిని, కుమ్మరిని, మంగలిని, చాకలిని ఇవియన్నియు అన్నమయకోశమందుగల

లక్షణములు, అన్నమయకోశము ఆత్మకాదు ఆత్మగాని విధం బెట్లనఁగా? ఈస్థూలశరీరము జన్మంబునకంటె పూర్వమునం దును, మరణంబున కంటె ఊర్ధ్వమందును లేదు కనుక వుత్పత్తి వినాశాది షడ్భావవికారము షట్కోశమయమైన అన్నమయ కోశము ఆత్మగాదు.

## 2. ప్రాణమయకోశము.

''కర్మేంద్రియై స్సహప్రాణమయకోశః ప్రాణాది
పంచకం ప్రాణమయఃకర్మేంద్రియైర్యుతమ్''
''ప్రాణాది దశవాయవోన్నమయకోశే
యదావర్తంతే తదాప్రాణమయకోశః''

ఇత్యాది ప్రమాణముల రీతిని, వాక్కు, పాణి, పాదము, పాయురు, గుహ్యము అను కర్మేంద్రియము లయిదును ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానముల నెడు ప్రాణము లయి దను గూడి ప్రాణమయకోశము, మరియు ప్రాణవాయువు మొదలగు దశవాయువులు అన్నమయకోశముతో యెప్పుడు సంచరించునో అప్పుడు ప్రాణమయకోశమునకును పరబ్రహ్మము నకును కూటమి యెట్లుకలిగినదనఁగా —

''అహంక్షుధాయుక్త అహంపిపాసావాన్
అహంబలవాన్ అహంవీర్యవాన్
అహంక్రియావాన్ అహంవక్తా''

"అహందాతా మూకః పంగుః విహస్తః షండఃఇత్యాది ప్రాణవికారత్వేసతి వక్తృత్వాదిరహితమాత్మానం వక్తారమివ దానాదిరహితమాత్మానందాతా రమివ గమనాగమన శూన్యమాత్మానం గంతారమివ క్షుత్పిపాసాది రహిత మాత్మానం క్షుత్పిపాసావంతమివ ఆపారయతి"

నేను ఆకలియును, దప్పియును, సామర్థ్యమును, బలమును పరాక్రమమును గలవాఁడను, వాచాలకుఁడను దాతను, మూగను, కుంటిని, గ్రుడ్డిని, అనునవి మొదలైన ప్రాణమయ కోశమందు గల గుణములు పరమాత్మయందును.

"ఆత్మనః సచ్చిదానందాన్ మనుప్రాణః అస్తిభాతిప్రియమితి ప్రాణమయకోశేచాధ్యస్యతి"

అనురీతిని పరమాత్మయందు గల సచ్చిదానందాది గుణములు ప్రాణమయకోశమందు గలవిగాన ప్రాణముగలవాఁడనగుటచేత తోఁచుచున్నవి కనుక ప్రాణమయకోశమునకును పరమాత్మకును కూటమివచ్చినది. ఈప్రాణమయ కోశంబే ఆత్మయని చెప్పుదామంటె యేప్రాణవాయువులు శరీరమునకంటె అంతరంబైన శిఖపర్యంతము వ్యాపించినదై చక్షువాదీంద్రియంబులకు వ్యానరూపంబుచే బలంబిచ్చుచు ఇంద్రియంబులం ప్రేరేపించునదియై యుంటున్నదో ఆప్రాణ

మయకోశము ఘటాదికంబువలెనే జడస్వభావంబుగలది. దృశ్యంబు పరిచ్ఛిన్నమయినది కనుక ఇదియును ఆత్మగాదు.

3. మనోమయకోశము.

"జ్ఞానేంద్రియైర్మనోయుక్తం మనోమయఇతీరితః
జ్ఞానేంద్రియాణిపంచమనశ్చఏతత్సర్వం
మిళిత్వా మనోమయకోశఇత్యుచ్యతే
ఏతత్కోశద్వయ సంయుక్తఆత్మామన
ఆది చతుర్దశకరణైశ్శబ్దాదివిషయసంకల్పాది
ధర్మాన్యదాకరోతి తదామనోమయకోశః

మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ ఘ్రాణము అనెడి జ్ఞానేంద్రియములైదును జేరి మనోమయకోశము మరియు అన్నమయ ప్రాణమయకోశములతో కూడిన ఆత్మ మనస్సు మొదలైన పదునాలుగు; కరణములతో శబ్దము మొదలగు విషయసంకల్పాది ధర్మములను చేయునపుడు, మనోమయకోశమనఁబడును. ఈమనోమయకోశమునకును పరమాత్మకును చేరిక యెట్లు అన్యోన్యాధ్యాసముచేత కలిగెను. అది యెట్లనిన.

"అహం సంకల్పవా నహం వికల్పవాన్
శోకవాన్మోహవాన్కామీలోభీశ్రోతా
స్ప్రష్టాద్రష్టారసయితాఘ్రాతాబధిరః

అంధః ఇత్యాదిమనోవికారత్వేసతిసంశ
యాదిరహితమాత్మానం సంశయాదివంతం
శోకమోహాదిరహితమాత్మానంశోక
మోహాదివంతం దర్శనాదిరహితమాత్మానం
దర్శనాదిమంతమావారయతి''

అనఁగా నేను, సంకల్పమును వికల్పమును గలవాఁడను, దుఃఖిని, మోహిని, కామిని, క్రోధిని, ద్వేషిని, వినువాఁడను, ఇచ్ఛగలవాఁడను, రసజ్ఞుఁడను, ఆఘ్రాణించువాఁడను, చెవిటివాఁడను, నాలుకలేనివాఁడను, ముక్కులేనివాఁడనను నివి మొదలగు మనోమయకోశనిష్ఠములయిన సంకల్పాది ధర్మములు ఆత్మయందును.

''ఆత్మధర్మాన్ సచ్చిదానందాంశ్చమమమనః సమ్యగస్తి
భాతిప్రియమితిమనోమయకోశేఅధ్యస్యతి''

ఆత్మధర్మములయిన సచ్చిదానందములు మనోమయకోశమందును, మనస్సుండుటచేత తోఁచుచున్నవి. కాఁబట్టి మనోమయకోశమునకును ఆత్మకును కూటమివచ్చినది. ఈ మనోమయకోశంబే ఆత్మ అనుదామనిన దేహంబునందు నే ననెడి అభిమానంబును గృహారామ క్షేత్రాదులయందు నాది యనెడి స్వభావంబును, గలుగఁజేయు యీకోశంబు, ప్రాణమయకోశంబునకంటెను అంతరంబై, కామక్రోధాదివ్యాపా

రంబును గలిగి నియతస్వరూపంబు లేక, దేహాదికంబువలె జడత్వ దృశ్యత్వ పరిచ్ఛిన్నత్వాది వికారములు గలదియైనం దున ఇది ఆత్మకాదు.

4 విజ్ఞానమయకోశము.

"జ్ఞానేంద్రియాణిపంచ బుద్ధిః ఏతత్సర్వం
ఖిలీత్వావిజ్ఞానమయకోశ ఇత్యుచ్యతే
బుద్ధిజ్ఞానేంద్రియైర్యుక్తం విజ్ఞానమయకోశకమ్"
"ఏతత్కోశత్రయ విశిష్టాంతః కరణే
తద్గత విశేషధ్యాన మననాది వృత్తయోయ
దోత్పద్యంతే తదావిజ్ఞాన మయకోశః"

బుద్ధియను జ్ఞానేంద్రియములైదును, గలసి జ్ఞానమయకోశము మరియు అన్నమయ, ప్రాణమయ, మనోమయకోశములతో కూడిన అంతఃకరణమునందు, వాటిలోనుండు ధ్యానమననాది వృత్తి యెప్పుడు కలుగుచున్నదో అప్పుడు విజ్ఞానమయకోశ మనఁబడును. ఈవిజ్ఞానమయకోశమునకు పరమాత్మకును కూడ యెట్లు వచ్చినదనగా ?

"అహంకర్తా బుద్ధిమార్గ ఊహాపోహాచతురః
ఏకసంధగ్రాహీ యోగాంతరగామీ
రాగద్వేషీ శ్రోత్రియః పండితః విరక్తః
భక్తిమార్గ ఉపాసకః జ్ఞానీత్యాతిది విజ్ఞాన
మయకోశవికారత్వేసతి అకర్తారమాత్మానం

కర్త్రాకరమివ అవిజ్ఞాతాకర మాత్మానం
విజ్ఞాతాకరమివ నిశ్చయరహితమాత్మానం
నిశ్చయవంతమివ మాంద్యజాడ్యాది రహితం
జాడ్యాదిమంతమివాకారయతి''

నేను కర్తను, నిశ్చయముగలవాఁడను, బుద్ధిమంతుఁడను, ఊహా పోహలలో చతురుఁడను, ఏకసంతగ్రాహిని, శ్రోత్రియుఁడను, విరక్తుఁడను, పండితుఁడను, లోకాంతరంబునకు పోవువాఁడను అనెడు విజ్ఞానమయకోశనిష్టములైన ధర్మంబులు ఆత్మయందును.

''ఆత్మలక్షణసచ్చిదానంద ముబుద్ధి
రస్తిభాతిప్రియమితివిజ్ఞానమయకోశే
చాధ్యస్యతి ఏవం విజ్ఞానమయకోశ
స్యాత్మనశ్చాన్యోన్యాధ్యాసః''

ఆత్మధర్మములైన సచ్చిదానందములు మనోమయకోశమందును. మనస్సుండుటచేత తోఁచుచున్నవి, కాఁబట్టి మనోమయకోశమునకును ఆత్మకును అధ్యాసద్వారా కూటమి వచ్చినది యీవిజ్ఞానమయకోశంబే ఆత్మయని చెప్పినట్టియిన మనోమయకోశంబునకంటె అంతరంబగు కర్తృశబ్దవాచ్యంబైన విజ్ఞానమయకోశంబనెడి చిదాభాసునితో కూడియుండు బుద్ధి, సుషుప్తికాలంబునందు తనకు కారణంబగు అజ్ఞానంబునందు లీనంబగుచు, జాగరణకాలమందు. శిఖపర్యంతము

వ్యాపించి విలయాద్యవస్థలను గలిగి దృశ్యంబై యున్నందు నను దానికి వృత్తిప్రవాహము ఎడతెగనిదై ఎప్పుడుకలిగియు న్నది ఆహేతువుచేత ఇదియును ఆత్మకాదు.

౫. ఆనందమయకోశము.

"ప్రియమోద, ప్రమోదవృత్తి మదజ్ఞాన
ప్రధానమంతః కరణం ఆనందమయకోశ ఇత్యుచ్యతే
"ప్రియాది యుక్తమజ్ఞానమానందమయఉచ్యతే"
"ఏతత్కోశచతుష్టయకారణాజ్ఞాన
సంపృక్తం స్వకారణజ్ఞానంస్వరూపసుఖే
వటదానాసువటవృత్తిఇవయదావర్తతే
తదానందమయకోశః"

ప్రియము, మోదము, ప్రమోదము అనెడి వృత్తులతోఁ గూడి అజ్ఞానమే ప్రధానముగాఁ గల అంతఃకరణమే ఆనంద మయకోశము. ప్రియమనఁగా ఇష్టమైన పదార్థమును కనిన మాత్రముననే కలిగెడి సంతోషము ప్రియము. ఆపదార్థము తనచేతికి వచ్చినపిమ్మట కలిగెడి సంతోషము మోదము చేతికివచ్చిన వస్తువును అనుభవించినతోడనే కలిగిన సంతో షము ప్రమోదము ఈకోశమునకు మూడవశ్రుతిప్రకారము అర్థమేమనఁగా అజ్ఞానముతో కూడి పైన ఉదహరించిన నాలుగు కోశములతో కూడియుండునపుడు మఱ్ఱివిత్తనమున మఱ్ఱిచెట్టు అణగియుండు రీతిని స్వరూపసుఖమునందు తన

కారణజ్ఞానము అణగియుండునపుడు ఆనందమయకోశమనఁ బడును. ఈ ఆనందమయకోశమునకును పరమాత్మకును గూటమి యెటులువచ్చినది యనఁగా?

" అహంభోక్తా సుఖీసంతుష్టస్సాత్వికః
రాజసస్తామనఃమూఢః దుష్టః శూన్యః
మోహితః అవివేకీ భ్రాంతఇత్యానందమయ
కోశవికారత్వేసతిప్రియమోదప్రమోద
రహిత మాత్మానం ప్రియమోద ప్రమోదమం
తమివఅభోక్తారమాత్మానం భోక్తారమివ
పరిచ్ఛిన్నసుఖ రహితమాత్మానం పరి
చ్ఛిన్నసుఖవంత మివాచ్ఛాదయతి. "

నేను భోక్తను, సంతుష్టుడఁను, సుఖిని, రాజసుఁడను, సాత్వికుఁడను, తామసుఁడను, మూఢుఁడను, శక్తుఁడను, భ్రాంతుఁడను అనునివి మొదలైన ఆనందమయకోశ ధర్మంబులు ఆత్మయందును.

" ఆత్మనః సచ్చిదానందాంశ్చ మమజ్ఞానమస్తి
భాతిప్రియమితి ఆనందమయకోశే అధ్యస్యతి. "

అనురీతిని సచ్చిదానందములు ఆనందమయ కోశమందును ఆనంద ముండుటవలన తోఁచుచున్నవి కాఁబట్టి ఆనందమయ కోశమునకును పరమాత్మకును కూటమి వచ్చినది అయితే యీ యానందమయకోశంబు ఆత్మగానివిధంబెట్లు—ఈభోక్త

యగు ఆనందమయకోశంబును ఘటాదులువలె దృశ్యంబు జడంబు పరిచ్ఛిన్నంబు గనుక

" అస్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమశబ్ద
మస్పర్శ మరూప మవ్యయమ్. "

అను ఇత్యాదిలక్షణమైన ఆత్మ కానేరదు, అయితే పరమాత్మకు పంచకోశ వ్యతిరిక్తత్వము యెటువలె సిద్ధించును కత్తి యొర మొదలైనవి భేదములేక ఒకటిగానే వ్యవహారింపఁ బడుచు ఒకటిగానే తోఁచినను విచారింపఁగా కత్తియును ఒరయును వేరైనటుల వేదాంతశాస్త్ర విచారణచేత పరమాత్మ త్రికాలములయందును పంచకోశంబుకంటె వేరై తోఁచుట వలన, పంచకోశ వ్యతిరిక్తము లభించును ఇందుకు దృష్టాంత మెట్లనిన

" మమాయంగాః మమచాయంవత్సః మ
మాయంకుమారః మమాయంకు మారీముచూ
యంస్త్రీ ఏవమాది పదార్థవాళ్ పురుషః
పదార్థోన భవతి తేభ్యోయథావిలక్షణః
తథామమ అన్నమయకోశః మమప్రాణ
మయకోశః మమమనోమయకోశః మమ
విజ్ఞానమయకోశః మమానందమయకోశః
ఏవంపంచకోశావాళ్ ఆత్మాపంచకోశాది
ర్నభవతి తేభ్యోవిలక్షణః. "

నాయావు, నాదూడ, నాపుత్రుఁడు, నాకూఁతురు, నాభార్య అని తన్ననుసరించికొని తోఁచెడి ఆవు, దూడ, పుత్రుఁడు, మొదలగునవి తానుగా నట్లు దార్ష్టాంతిక మందును నా శరీరము, నాప్రాణము, నామనస్సు, నాబుద్ధి అని తన్ను సంబంధించుకొని తోఁచెడు పంచకోశములును తాను కానందున ఘటద్రష్ట ఘటభిన్నుం డెటువలెనో అటువలె పంచకోశంబులకంటె తాను విలక్షణుఁడని యెరుఁగవచ్చును. మరియు ఆవు బలిసినది, దూడ చిక్కినది, కుమారుఁడు చెప్పినట్టు వినఁడు దుష్టుఁడు, కూఁతురు మహాసుమాధురాలైయున్నది అనెడి పశువు మొదలగువానియందలి వికారములును విషయములును తన్నంటనియట్లును మరియు

" జలగత సూర్యప్రతిబింబం జలవృద్ధౌ వర్ధతే
జలహ్రాసేహ్రసతి, జలచలనేచలతి, జ
లభేదేభిద్యత, ఇత్యేవం జలధర్మానువిధా
యిభవతి నతుపరమార్థతః సూర్యస్యతత్వ
మస్తి, ఏవం పరమార్థతో వికృతమేకరూప
మపి సద్బ్రహ్మదేహాద్యుపాధ్యన్తరభావాత్
భజతఏవోపాధిమార్గ వృద్ధిహ్రాసాదీని."

జలములో ప్రతిఫలించు సూర్యబింబము, ఉదకము వృద్ధికాఁగా వృద్ధిపొందుచున్నది జలము తగ్గగా తగ్గిపోవుచున్నది. జలము చలింపఁగా చలించుచున్నది జలము భిన్నముకాఁగా భిన్నమగు

చున్నది. ఇట్లు నీటిధర్మము ననుసరించి తోఁచుచున్నదేగాని యదార్థముగా ఆదిత్యునకు ఆధర్మములు యెట్లు నిజముకావో ఆసూర్యుని నెట్లు స్పృశింపవో అట్లు దార్ష్టాంతికమందు అన్నమయకోశ నిష్టమైన జీవత్వ మనుష్యత్వాది ధర్మములును ప్రాణమయకోశ నిష్టమైన క్షుత్పిపాసాది గుణములును, మనోమయకోశ నిష్టమైన సంకల్పాది ధర్మములును, విజ్ఞానమయకోశ నిష్టమైన కర్తృత్వాది గుణములును, ఆనందమయకోశ నిష్టమైన భోక్తృత్వాది వికారములును, యదార్థముగా వికారములేక ఏరూపమై ఇట్టి ఉపాధులయొక్క అంతరమందుండుటవలన ఉపాధి కలిగినట్లు తోఁచునేగాని యదార్థముగా లేని సద్రూపుఁడును, పంచకోశ వ్యతిరిక్తుఁడును, సాక్షియునైనతన్ను కాలత్రయమందును స్పృశింపలేవు కాఁబట్టి ఇట్లు విచారించి యెరుగుటయే పంచకోశ వ్యతిరిక్త జ్ఞానము ఇట్టి ...నమెట్లు రావచ్చు ననఁగా

"బాహ్యదృష్టిశ్శ్రోత్రం అంతర్దృష్టిర్బుద్ధిః
బాహ్యదృష్ట్యా జ్ఞాతుమశక్యాఅపిపదార్థాః
అంతరదృష్ట్యాజ్ఞాతుంశక్యంతే."

అధ్యయనకాలమందు అధ్యయనము చేసే పురుషులచేత ఉచ్చరింపఁబడిన శబ్దంబులను పంచుటకు వశము కాకున్నప్పటికిని శ్రోత్రేంద్రియముచేత విని విమర్శించు శక్తిగల బుద్ధిచేత ఇది వీని శబ్దము అది వాని శబ్దముఅని యెరిఁగినట్లులను జల

మందుగల వేడిమిని వేరుపరుచుటకు గాకపోయినను, త్వగిం
ద్రియముచే స్పృశించి వివేకముగల బుద్ధిచేత జలంబును ఉష్ణ
మును ప్రత్యేకించి యెరిగిన చందమునను, గోడయందు
వ్రాయఁబడిన చిత్రములలోని వర్ణములను, పొట్టి పొడు
గుగా నుండెడి రూపంబులను విభజించుటకు అలవిగాకపోయి
నను. చక్షురింద్రియముచేత చూచి వివేక సహితమైన బుద్ధి
చేత ఆవర్ణములను తెలిసికొనిన చందమునను, నీటిలో గలసిన
షడ్రసములను విభాగింప శక్యము గాకున్నను రసనేంద్రియ
ముచేత అనుభవించి వివేకయుక్తమైన బుద్ధిచేత ఆ షడ్రసం
బులను ప్రత్యేకంబుగ యెరిఁగిన విధమునను, వస్త్రముల
నాశ్రయించియున్న పరిమళములను వేరుపరచ శక్యముగాక
యున్నను ఘ్రాణేంద్రియముచేత ఆఘ్రాణించి వివేక శీలమైన
బుద్ధిచేత ఇది సుగంధము, ఇది దుర్గంధము ఇది మిశ్రగం
ధము అని తెలిసికొనిన తీరున దార్ష్టాంతికమందు పంచ
కోశంబులను వానితోఁ గూడియున్న ఆత్మను పంచుటకు అశక్య
మైనను వివేక యుక్తంబున బుద్ధిచేత పంచకోశంబులు మహా
భూతంబులయొక్క కార్యంబులు దృశ్యములు జడంబులు
పరిచ్ఛిన్నములు అని వాటియొక్క స్వరూపములనున్ను ఆత్మ
నిత్యుఁడు నిర్వికారుఁడు శుద్ధుఁడు సర్వసంబంధ శూన్యుఁడు
సత్యుఁడు కాలత్రయాబాధ్యుఁడు సాక్షిమాత్రుఁడు అని
యెరుగవలయును.

## రాజయోగము ప్రాణాయామము.

ఈప్రాణాయామము పూరక, కుంభక, రేచకములని మూడువిధములైన సాధనములు.

పూరకమనఁగా — వెలుపలివాయువునునాసికద్వారా లోపలికిపీల్చుట. కుంభకమనఁగా—పీల్చినవాయువును వెలుపల విడువక లోపలనే నిలుపుట. రేచకమనఁగా—పీల్చిన వాయువును వెలుపలకు విడుచుట అని మూడు విధములు.

ప్రాణమును బిగబట్టి యేలుటయే ప్రాణాయామ మనఁబడును. ఈ ప్రాణాయామము చేయునపుడు కండ్లనుమూసి యెడమచేతి నడిమివ్రేలితో యెడమనాసికనుమూసి

"ఓంభూర్భువస్సువః తత్సవితుర్వరేణియం భర్గోదేవస్యధీమహీం ధియోయోనఃప్రచోదయాత్ ఓమాపోజ్యోతిరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోం అను గాయత్రి మంత్రమునందుండి ఓం, ఓం, ఓం, ఓం, ఓం, అను ప్రణవమును మాత్రము తీసికొని వాయువుతో అజపాగా జేర్చి నాసికద్వారా వాయువును పూర్తిగా ప్రణవముతో లోపలికి పూరించి మ్రింగి మఱియొక పర్యాయము వాయువును పూరించి మ్రింగి ఆవాయువును బయటికి రానివ్వక కంఠమును మూసి కుడిచేతి అయిదు వేళ్ళను "ఓం" అను ప్రణవమును మనస్సునందే ఉచ్చరించుచు విడిచినతరువాత యెడమచేతి

ఒక వ్రేలును విడువవలయును. ఇట్లు యెడమచేతి అయిదు వ్రేళ్ళను విడిచినయెడల యిరువదియైదు ప్రణవము లగును. యిరువదియైదు ప్రణవములైన వెంటనే హృదయమునందుండు బయలునందు 1 యని మనస్సుతోనే సంఖ్య వేసి ఆసంఖ్య మీఁదనే దృష్టినివుంచి మరి యిరువదియైదు అయిన వెంటనే 2 అని సంఖ్యను మార్చుచు మరి యిరువదియైదు అయిన వెంటనే 3 అని సంఖ్యను మార్చినయెడల డెబ్బదియైదు ప్రణవము లగును. డెబ్బదియైదు ప్రణవములు ఉచ్చరించిన వెంటనే లోపల స్వీకరించి యుంచిన వాయువును యెడమ లేక కుడిచేతినడిమివ్రేలితో కుడినాసికనుమూసి పండ్లనుగట్టిగా బిగబట్టియెడమనాసిక ద్వారా కొంచెము వాయువును బయటవిడిచి విడిచినంత మాత్రము బయిటి వాయువును యెడమనాసిక ద్వారా లోపలికి పీల్చునపుడు "ఓం" అని పీల్చి మరి కుడి నాసికద్వారా విడుచునప్పుడుకూడా "ఓం" అని విడిచి ఈ వాయువును నాసికలను వ్రేలితో మూసి మూసి నాసికలను మార్చి మార్చి యుచ్ఛ్వాసనిశ్వాసములను ప్రణవ మంత్రములతో నెమ్మదిగ విడుచుచు తక్కిన వాయువంతయు గర్భగుహ్వారమందే స్వీకరించి యుంచవలయును. శ్వాసమును విడుచునపుడు దంతములను బిగబట్టి నెమ్మదిగ వదలవలయును. వదలునపుడు శ్వాసముయొక్క వేగము అణగునంతవరకు తలవణుకుపుట్టి భ్రూమధ్యంబున మెఱుపుతీగె

వలెనే ప్రకాశించును. ఈ యభ్యాసము హెచ్చించుకొని పోగాపోగా స్వానుభవమున ఆమెరుపుతీగెను చూడవచ్చును.

మొదటిపర్యాయము కుడినాసికద్వారా బీల్చి అభ్యసించి రెండవపర్యాయము యెడమనాసికద్వార మూడవ పర్యాయము కుడినాసికద్వారముగా యిట్లు అయిదు నిముషముల కొక్కపర్యాయము నాసికను మార్చి మార్చి వాయువును బీల్చి ఉదయము మూడు పర్యాయములు సాయంత్రము లేక రాత్రిమూడుపర్యాయములు అభ్యసించినవెనుక భోజనము చేయవలయును. వాయువును బైట విడుచునపుడు నాశికలను మార్చి మార్చి విడుచుచుండవలయును. నూతనాభ్యాసులు యేబది లేక డెబ్బది అయిదు ప్రణవము ఉచ్చరించువర కభ్యసించవలయును.

ఈ అభ్యాసముచేయునపుడు గర్భగుహ్యారమందు కొన్ని దినముల వరకు బాధను కలుగఁజేయును ఇట్లు క్రమక్రమముగా నభ్యాసము చేయుచు వచ్చినయెడల నాబాధ కొంత నివారణమగును. బాధనివారణమైన వెంటనే డెబ్బది అయిదు మొదలు నూరుప్రణవముల నుచ్చరించు వరకు వాయువును పై చెప్పిన రీతిని కుంభించవలయును. ఇట్లు క్రమక్రమముగాఁ ఇరువదియైదుప్రణవములుగా మూడువందలవరకు హెచ్చించుకొని వాయువును బయట వదలకమునుపు మరి కొంత వాయువును బీల్చి మ్రింగి కొన్నిప్రణవములవరకు ఆవా

యువును నిలిపి పిమ్మట నెమ్మదిగా విడువవలయును దీనిని గూడా క్రమక్రమముగా హెచ్చించు కొనుచు రావలయును. కొన్ని దినము లభ్యసించినయెడల గర్భములోని బాధ అణగి పోవును. తరువాత మూడువందలు మొదలు అయిదువందల ప్రణవములవరకు హెచ్చించుకొని పోగా గర్భబాధ నివారణమై హృదయమునందు బాధను కలుగచేయును. ఇట్లు కొన్నిదినములు అభ్యసించిన వెనుక హృదయమునందలి బాధ నివారణమగును. తరువాత క్రమక్రమముగా యేనూరు మొదలు వేయి ప్రణవము లుచ్చరించు నపుడు హృదయబాధ నివారణ మగును. (మొదటి పేజీయందు కనుపరచియుండు యోగాభ్యాస పటములో నుండు రీతిని) కుంభించిన వాయువు దేహమంతయు వ్యాపించును. ఆసమయమున దేహమునందు అధిక బాధను కలుగ జేయును. ఇట్లు అభ్యసించునప్పుడు భోజనమును క్రమక్రమముగా తగ్గించి గోధుములతో చేసిన రొట్టె, ఉప్పుపిండి, పాలు మొదలగు ఆహారములను భుజించవలయును. ఇట్లు కొన్ని దినములు అభ్యసించుచు రాగా పై బాధ నివారణ యగును. తరువాత క్రమక్రమముగా వారివారి శక్తికొలది వేయి మొదలు రెండువేల ప్రణవముల నుచ్చరించువరకు కుంభించిన వాయువు ఇదివరకు వ్యాపించిన స్థలములంతయు యేబాధను కలుగజేయక దేహమంతయు వ్యాపించి తరువాత శిరస్సు మొదలు గర్భనాభిస్థానమువరకు చుట్టిచుట్టి తిరుగు

చుండును. (ఇట్లు తిరుగువాయువును కూడా యోగాభ్యాస పటమునందు చూడుము) అగ్నిబాధలకగును ఈబాధ విశేషముగా యుండును. ఈబాధలకంతయు ఓర్చుకొని యుండినయెడల కొన్నిమాసములైన తరువాత యీబాధ యణగిపోవును. రెండునెలు మొదలు నాలుగువేల ప్రణవము లను క్రమక్రమముగా నుచ్చరించుచున్నప్పుడు కుంభించిన వాయువు యేబాధను లేక దేహమంతయు వ్యాపించుకొని తరువాత ఆవాయువు ప్రేగులోనికి దిగుటకు ప్రయత్నించును.

ఎప్పుడు వాయువు ప్రేగులోపల ప్రవేశించుట ప్రారంభ మగునో అది మొదలు ఒక్కొక్క పర్యాయమును నాలుగు గుటికలు నీరును త్రాగి ప్రణవముతో వాయువును పూర్తిగా బీల్చి మ్రింగవలయును తరువాత మ్రింగిన నీరు వాయువు, ఈ రెండును గలసి ప్రేగులోపల ప్రవేశించుచుండును. ఆసమ యమున పైకనపరచిన గోధుముల ఆహారమును విడిచి వాయు వును బీల్చి ప్రేగులోపల నింపుకొని పాలును మాత్ర మాహార ముగా నుపయోగించవలయును. నీరును త్రాగక వాయువును మాత్రము బీల్చి అభ్యసించినయెడల మనుష్యులకు అపాయ మును కలుగ జేయును. ముప్పదిరెండడుగులు గల మనయొక్క ప్రేగు గర్భమునందు చుట్టుకొని ఉండుటచేత బీల్చిన వాయువు ముప్పదిరెండడుగులలో ప్రవేశించుటకు

శక్తిలేక పోవుటచేత ఆవాయువు తిరిగి బయటికి వచ్చును. వచ్చినవెంటనే కంఠము మూసికొనియుండుటచేత బైట వెళ్లుటకు సాధ్యపడక (చిన్నకాలవను దాటినప్పుడు పాదముల నదిమిపెట్టి దాటుచున్నాము వెడల్పుకాలవను దాటవలసివచ్చినప్పుడు కొంత దూరమునుంచి వరుగెత్తికొని వచ్చి ఆ కాలవను దాటురీతిని) వాయువు కంఠమును ద్రూద బొడుచుకొని ప్రేగులోగా ప్రవేశించి శక్తియుండువరకు వెళ్లి శక్తి యణగిన వెంటనే మఱియు బయటికిరాఁగా నావాయువును బయటికిపోనివ్వక కంఠము మూసి యుండుటచేత మఱి ఆ వాయువు కంఠము నూదబొడుచుకొని వచ్చుచు పోవుచు ముప్పది రెండడుగులుగల ప్రేగువరకు ప్రవేశించి తరువాత మూలాధారము గుండా (గుదస్థానముద్వారా) అపానవాయువుగా పోవుటకు ప్రవేశించును. ఆసమయమున వాయువును పోనివ్వక గుదస్థానమును గట్టిగా బిగించి యుంచినయెడల ఆ వాయువు అచ్చటనే నిలిచి యుండును. ఆ సమయమునందు అధిక బాధను కలుగజేయును. ఆబాధకంతయునోర్చుకొనియుండవలయును.తరువాత కంఠమును తెరచి కుంభించినవాయువంతయు విడువక కొంచెము మాత్రము వాయువును రేచించి రేచించినంతమాత్రము బైటివాయువును ప్రణవముతో లోపలికిపూరించి ఈ రెండుభాగ వాయువును మాత్రము చేర్చి ఉచ్ఛ్వాసనిశ్వాసములను విడుచుచు వాయువును ప్రేగం

తయు నింపుకొని * పద్మాసనము నందైనను లేక చిత్రాసనము నందైనను కూర్చొని నిష్ఠయందుండినయెడల లోపల స్వీకరించి యుంచిన వాయువు మనస్సునందే తలంపు లేకుండా నిలుపు దలచేయును. (పొట్టనిండా వాయువును నింపియుండుటయే వాయుభక్షణయని చెప్పఁబడును.) తలంపును నిలుపుటకొరకే యోగాభ్యాసము చేయవలయును. దీనిని వినహా మరి దేని చేతను మనస్సు నిలువఁజాలదు. ఈతలంపులను నిలుపుటయే ధ్యానమనఁబడును. ఈధ్యానమునే గీతయందు జెప్పఁబడి యున్నది. దీనిని ప్రాణాయామమువల్లనే పొందఁదగినది.

## ధ్యానము.

---

మనస్సును ఒక విగ్రహమునందు నిలిపి ధ్యానించుట భక్తిమార్గములోని ధ్యానము. మనుష్యులకు దిన మొక్కటికి ఉదయము మొదలు రాత్రి నిద్రపోవువరకు లెక్క లేని తలంపులు పుట్టుచున్నవి. ఆతలంపు లంతయు నశింపఁజేసి

---

*(1) పద్మాసనమనగా-కుడికాలి పాదమును యెడమతొడమీద వుంచి, యెడమపాదమును కుడితొడమీద వుంచి, రెండుపాదములు ఆకాశమును చూచునట్లు వుంచుట పద్మాసనమనబడును (2) చిత్రాసన మనఁగా యెడమపాదమును కుడితొడక్రిందవుంచి కుడిపాదమును యెడమతొడ పిక్కలమధ్య నుంచుకొని యెడశిరస్సును సమముగా నుంచి పైజెప్పిన రాజయోగమును అభ్యసింపవలయును.

ఒక తలంపుగా జేయుటకు మొదటి పేజి పటమునందుండు విగ్రహముయొక్క గర్భమునందు ప్రణవముల ఉచ్చరించుచు చూపించిన రీతిని యెవరెవరికి యే దేవతలయందు ప్రీతియో ఆదేవతలను ఉపాసనా పూర్తిగా తన గర్భమునందుంచి మనస్సును ఆవిగ్రహమునందే యేకధ్యానముగా నుంచి పిమ్మట ఆయేకధ్యానమునుగూడా నశింపఁజేసి సూన్యముగా నుండు నదియే శ్రేష్ఠమైన ధ్యానము. గీతయందు పలుమారు ధ్యానము ధ్యానమని చెప్పనది ఈ ధ్యానము నే.

యోగాభ్యాసమును జేసి మనస్సును నిలుపుటకుగాను

గీత॥ ఓమత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహారన్ మామనుస్మరన్
యః ప్రయాతిత్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్.

ఎవ్వడు తనయొక్క సమస్త ఇంద్రియద్వారములను చక్కఁగా నియమించి మనస్సును హృదయకమలమునందుండు నాయందు నిలిపి శిరఃప్రాంతమైన బ్రహ్మరంధ్రమునందు ప్రాణవాయువు నుంచి ధ్యానాభ్యాసమునకు కడపటి స్థితిని పొందినవాడై బ్రహ్మప్రతిపాతకము ‹‹ ఓం ›› అనెడి ప్రణవమునుచ్చరించుచు ప్రణవమునకు లక్ష్యార్థమైన నన్ను ధ్యానించుచున్న వాడై ఈశరీరమును (అభిమానించనివాడై) విడుచుచు బయలువెడలునో వాఁడు శ్రేష్ఠమైన గతిని పొందుచున్నాఁడు.

‹‹ అనగా మొదట శరీర యభిమానమును విడిచిపెట్టి వాయువును ప్రణవముతో పూరించి సమస్త ఇంద్రియ ద్వార

ములయందును వాయువును పోనివ్వక నిలిపి హృదయకమల మందుండు నన్ను అనునది అచ్చట యేవిగ్రహము లేక బయలుగా నుండునట్టి స్థలమునే నన్ను అని గీతయందు చెప్పుచున్నాడు. ఆబయలునందు "ఓం" అను ప్రణవమును కుడిచేతి అయిదువ్రేళ్ళను ప్రణవముతో ఉచ్చరించుచు విడిచి యెడమచేతి ఒకవ్రేలునువిడువవలయును. ఇట్లు యెడమచేతి అయిదు వ్రేళ్ళు విడిచినయెడల ఇరువదియైదు ప్రణవములు అగుచున్నది. ఇరువది అయిదు ప్రణవములు అయిన వెంటనే హృదయమునందుండు బయలుస్థలమునందు ఒక్కటియని మనస్సుతోనే సంఖ్యవేసి మరి ఇరువదియైదు అయిన వెంటనే రెండు అని సంఖ్యలను మార్చి ఆసంఖ్యలమీఁదనే దృష్టినుంచి ఎదివరకు శ్వాసమును కుంభించుటకు శక్తిగలదో అదివరకు ప్రణవమును ఉచ్చరించుచు కుంభించి పిమ్మట శ్వాసమును నెమ్మదిగా విడువవలయును. ఇట్లు క్రమక్రమముగా హెచ్చించుకొని పోవుటయే అభ్యాసయోగ మనఁబడును. ఈయభ్యాసయోగము చేత మనస్సు లోక వ్యవహారములయందు బోక నిలిచిపోవును. యోగాభ్యాసమునుచేసి మనస్సును నిలుపుటకు

తం విద్యా దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్
సనిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా॥ అ. 6 శ్లో. 23

యోగాభ్యాసము చేయునప్పుడు యెంతకష్టములున్నను వాని

చేత దుఃఖపడని మనస్సుగలవాడై యటువంటి ధ్యానయోగ సిద్ధిని బొందవలయు ననెడి పట్టుదలతోనే బొందఁదగినది.

" యోగాభ్యాసముచేత మనస్సును నిలుపవలయు ననెడి పట్టుదలయుండిన యెడల నాపట్టుదలచేత దేహమునందు యెంత బాధ యుండినపట్టికిని ఆబాధల కంతయుదుఃఖపడకుండా ఓర్చుకొని యెవఁడు యోగాభ్యాసమును జేయుచున్నాఁడో వాఁడు ధ్యానయోగము (మనస్సును నిలుపుట)ను సిద్ధిని బొందఁగలఁడు. మరియు మనస్సును నిలుపుటకుగాను

అనన్యచేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః అ8 శ్లో 14

ఇతర విషయములయందు ప్రవర్తింపని మనస్సుగలవాఁడగు నేయోగి నన్నెల్లప్పుడును చింతించుచున్నాఁడో స్థిరమైన సమాధి (పీనుగవంటి) యట్టి ధ్యానాభ్యాసికి నేను ప్రయాస లేకుండా పొందఁదగినవాఁడ నగుదును. " అనగా—నేయితర విషయములయందును మనస్సును పోనివ్వక నిలుపు వాఁడే యోగి సంకల్పము మనస్సు నశించి పంచభూతములు లయించి తన్ను ఆనందజ్యోతి ఆవరించుకొని ఆత్మస్వరూపుఁడుగా యుండు టయే సమాధి నిష్ఠయని చెప్పఁబడును.

పీనుగనుకూడ సమాధి యనఁబడును. పీనుగకు సంకల్పము మనస్సు ఆత్మ యీమూడు నశించుటచేత పీనుగ యనఁబడును. సమాధి నిష్ఠయందుండు వానికి సంకల్పము మనస్సు నశించి పంచభూతములు లయించి తానాత్మస్వరూపుడుగాయుండుటయే సమాధినిష్ఠయనఁబడును. ఈనిష్ఠనే ధ్యానమనఁబడును. ఈధ్యానమును హంస సూత్రము చేత పొందఁదగినది. యీ హంససూత్రము ఉపనిషత్తులలో యున్నది.

## ఉపనిషత్తనుటకు_అర్థము.

-:o:-

సంస్కృతభాషయందు_(షద్ల్) అనెడి ధాతువునుండి. ఉపనిషత్తులనెడి శబ్దము పుట్టెను. (షద్ల్_విశరణ_గత్యవసాదనేషు) అనునట్లు (షదల్) అనెడి సంస్కృత ధాతువునకు నాశము చేయుట కాబట్టి అజ్ఞానభీజమగు సంసార వృత్తమును నిర్మూలముగా ఖండించి బ్రహ్మలక్షణమున్ను తదైక్య జ్ఞానమున్ను బోధించి, జనన మరణము లేక జేసి బ్రహ్మ మిట్టిదని తెలియపరచి అజ్ఞానమును పారఁద్రోలి బ్రహ్మైక్యమునుబోధించునదే ఉపనిషత్తనఁబడును. ఈ యుపనిషత్తులు పూర్వము మహాప్రళయమునందు శ్రీమన్నారాయణమూర్తి రూపంబున వటపత్రశాయినై

జలమధ్యంబునందు తేలుచుండునపుడు నిశ్వాసంబులందు (శ్వాసము విడుచునపుడు) ఋగ్యజుస్సామ అథర్వణము లనెడి నాలుగు వేదములను గల్పించి అందుఋగ్వేదమున 21 శాఖలును, యజుర్వేదమున 109, సామవేదమున 1000 అథర్వణ వేదమున 50 శాఖలుగాను వెరశి 1180 శాఖలు పుట్టినవి.

ఈ 1180 శాఖలయందును 1180 ఉపనిషత్తులు గలవు. ఇందుండి ఋగ్వేదంబున 10 యజుర్వేదంబున 51 సామవేదంబున 16. అథర్వణవేదంబున 31 వెరసి 108 ఉపనిషత్తులను మాత్రము తీసికోబడినది. ఎందుచేత ననగా ఈ 1180 ఉపనిషత్తులను మనము చూచుటకు ఆయువు లేనందున మనము మోక్షమును బొందుటకు మాత్రము కావలసిన ఉపనిషత్తులను పరిశోధించి చూడగా 108 ఉపనిషత్తులుమాత్రమే దొరకినవి. మనస్సును నిలుపుటకుగాను వాటియందు ఏది ముఖ్యమో యాయుపనిషత్తులను మాత్రము కొన్నిటిని ఈ గ్రంథమున వ్రాయబడియున్నవి.

కావునమన మందరమును మోక్షమును బొందుటకిదే సమయము. రైలుకు బోవువాడు తనకు కావలసిన వస్తువులను ఎట్లు ప్రయాణమునకు సిద్ధపరచుకొనుచున్నాడో యారీతిని మన ప్రయాణ కాలమునకు కావలసిన వస్తువులను ఇప్పటినుండియే అన్వేషించవలయును. రైలుకు పోవువాడు పది నిముషములకు మునుపే పోయి యుండవలయునుగదా. రైలులు

వచ్చినతోడనే రైలు జేరువారికి బండి దొరకనట్లు మన ప్రయాణకాల సమీపంబున కొంతస్పృహ యుండునపుడుమనవారందరును రామా, కృష్ణా, నారాయణా, యని చెవివద్ద ఎంత అరచి చెప్పినప్పటికిని వినరాదు. ఆనమయమున రాముఁడుగాని, కృష్ణుఁడుగాని, నారాయణుఁడుగానివచ్చివీనికిసహాయము చేయుటలేదు. ఇప్పటినుండి అభ్యసించిన యెడలనొకవేళ మరణకాలమునతాను స్మరణ తప్పియుండినప్పటికిని భగవంతుఁడు దయతలఁచి ఆ సమయమున భగవన్నామమును జ్ఞప్తికి వచ్చునట్లు జేయుచున్నాఁడు. అందుచేత మేలైనపదవిని బొందుచున్నాఁడు.

ఇట్టి ధ్యానమును విడిచి పదుగురు స్నేహితులతోఁ బంతులాట, పేకాట, చదరంగము మొదలగు ఆటలను ఆడుచు, సంతోషించుచు, నవ్వుచు ఇట్లు వృధాకాలక్షేపము చేయుచు రాగా పదుగురియం దొక్కఁడు జబ్బుగా నుండునపుడు తక్కిన తొమ్మండ్రును „ పలానివాఁడు జబ్బుగాయున్నాఁడు. పాపం ” యని తొమ్మండ్రును కలసి మాట్లాడుచున్నారు. ఈ తొమ్మండ్రు మాత్రము కాయలా వానిని తలఁచుచున్నారుగాని, కాయలావాఁడు ఈ తొమ్మండ్రు యందును జ్ఞాపకము లేక స్మరణతప్పి ప్రాణప్రయాణ కాలమునందుండును. కాఁబట్టి పై కనుపరచిన ఆటయందున్నను మనస్సును పరమాత్మయందే ఏకధ్యానముగ నుంచి అభ్యసించిన వెనుక నా యేక

ధ్యానమును గూడ సూన్యముగా జేయ నభ్యసించి మోక్షమును పొందుటకు ఈ గ్రంథమున చెప్పిన రీతిని ఒక్కొక్కరును ప్రయత్నించవలయును.

## జీవాత్మ పరమాత్మ లక్షణము.

నిత్య నిర్మల నిరాకార నిర్వికారపరిపూర్ణ పరబ్రహ్మము ఆది, అంత్య, మధ్యము లేనివాడు

"శ్రుతి॥ అజాత-మభూత-మప్రతిష్ఠిత-మ ప్రాణ-మముఖ-మశ్రోత-మవాగమనో- తేజస్క-మచక్షుష్క- మనామ మగోత్ర-మశిర-మపాణిపాద-మస్నిగ్ధ-మలోహిత-మప్రమేయ మహ్రస్వ-మదీర్ఘ-మణవ్వనల్ప-మపార-మనిర్దేశ్యం"మభాలోపనిషత్తు.

అట్టి పరబ్రహ్మము పుట్టుక లేనిది, ఒకరిచేత ప్రతిష్టింపఁబడిన విగ్రహాదుల వంటిదికాదు. అది ప్రాణవాయువు దానికి ముఖము చెవులు నోరు మనస్సు బుద్ధి నేత్రములు పేరు మొదలైనవి లేనిది. ఎరుపు తెలుపు మొదలగు పంచవర్ణములు కానిది. పొడుగు పొట్టి లావు సన్నము గొప్ప కొంచెము అణువు మహత్తులు మొదలగు రూపములు లేనిది. అట్టిదిట్టిదని ఎంచి చెప్పరానిది.

"చైతన్యం-బ్రహ్మ" అట్టి నిర్విశేషశుద్ధజ్ఞానమే పరబ్రహ్మము. "విజ్ఞాన-మానందం-బ్రహ్మ" కేవల జ్ఞానానంద

స్వరూపమైన దేపరబ్రహ్మము. "తతఃపవిత్రం–పరమేశ్వరాఖ్యం–
అద్వైతరూపం విమలాంబరాభం"

ఆపరబ్రహ్మము పరమపావనమైనది, సర్వోత్కృష్టమై
నది, తనకు రెండవపదార్థము లేనిది. ఒక్కటియై నెలకొనునది,
ఆకాశమువలె రూపము లేనిది. పరబ్రహ్మమునకు నామరూ
పములు లేవని చెప్పుచున్నారుగదా పరబ్రహ్మము అని చెప్పుటయే
ఒకనామము కాదా యని శంక పుట్టవచ్చును.

" ఋతమాత్మా పరంబ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః
కల్పితా వ్యవహారార్థం యస్యసంజ్ఞా మహాత్మనః "

పరబ్రహ్మమను నామము, మనోవాక్కులచే ఇట్టిదట్టిదని చెప్పు
టకు శక్యమగు సృష్టికి లోబడినట్టివస్తువునకు కలిగిన నామము
వంటిదికాదు. అయితే లోకులకంటికి కనబడనియట్టి దేవునికి
బదులుగా ఒకవిగ్రహమును చూపి ఇదిగో దేవు డొక్క
డున్నాడను జ్ఞప్తిని పుట్టించునట్లు, ఈప్రపంచ సృష్టికి పూర్వము
నామరూపములు లేని నాశరహితవస్తువు ఒకటి తనకు
తానే స్వతస్సిద్ధముగా నుండెను. శిష్యునికి బోధించుటకుగాను
ఆవస్తువునకు పరబ్రహ్మమను నామము, ఉపచారవార్తగా
చెప్పబడినదిగాని పరబ్రహ్మమునకు నామరూపములు లేవు
అట్టి అతీతమైనదియు నంతటను నాధారమైనట్టి నీకు దగిన
యాసనము ఎట్లు ఇచ్చెదను? సహజస్వచ్ఛత్వములతో
గూడిన నీకు అర్ఘ్యపాద్యములు ఏవిధముగా నిచ్చె

దను? అంతయు పరిశుద్ధిజేయు నీకు ఆసనము ఏవిధముగ నిచ్చెదను, నిర్మలమై, నిర్గుణమై ప్రకాశించుచున్న నీకు, ఈబాహ్యమందున్న నుదకము చేత స్నానము నేవిధముగ జేయించెదను? ప్రపంచమునకంతకు మిగిలియున్న నీకు తగిన వస్త్రము ఏవిధముగ నిచ్చెదను? విచారించగా కులగోత్రములేని నీకు నేవిధముగ యజ్ఞోపవీతము నిచ్చెదను? అవయవములు లేని నీకు మంచియలంకారములు ఏవిధముగా నిచ్చెదను? నిర్లిప్తుండవైన నీకు మిక్కిలి పూజ ఏవిధముగ జేయుదును? నిరంజనుండవైన నీకు ధూపము ఎట్లిచ్చెదను? సూర్యచంద్రులను ప్రకాశింపఁజేయు స్వరూపముగల నీకు దీపము ఏవిధముగ నిచ్చెదను? సర్వపరిపూర్ణమై నిత్యతృప్తుఁడవైన నీకు కొంచమైన, ఏనైవేధ్య మిచ్చెదను? ఆనందమును పొందియున్న నీకు తాంబూల మేవిధముగ నిచ్చెదను? ఆధ్యంతములేని నీకు ఏమంత్రములచేత పుష్పముల నిచ్చెదను? స్వయంప్రకాశకుఁడైన నీకు ఏవిధముగ నీరాజనమిచ్చెదను? ప్రపంచమంతయు శరీరముగాగల నీకు ప్రదక్షిణ మెక్కడచేయుదును? అద్వైతవస్తువైన నీకు నమస్కార మెటులచేయుదును? సరస్వతీసంబంధమైన వాక్కులకందని నిన్ను ఏధముగ స్తవము చేయుదు?

దేహమునకు వెనుకభాగమందు వీణాదండమువలెనే యున్న పెద్ద యెముకయొక్క సన్నరంధ్రములో తామరతూడునందలి దారమువలెనే, కుంభించిన వాయువును ఆరంధ్రములోనుంచి నీవు ప్రవేశింపఁజేసి పైకి నడిచి, మేరుశిఖర

మెక్కి, అక్కడ కనుపించిన యాకాశమును, నేనని భావించి, యీ యాకాశమునుచూచు, చూపును వదలి, ఆచూపులో "నేనను" దృష్టిని నిలిపి బాహ్యాభ్యంతరములను వదిలి, అధికమైన మధ్యలక్ష్యమందు ప్రయత్నము లేకుండునటుల నిలిచి ఆనందమునుపొంది, అప్పుడు త్రివేణి సంగమందు స్నానము చేసి, నీజ్ఞప్తి కళామాత్రమైన, ఆత్మయను లింగమును, నీవను పీఠమందుంచి, అప్పుడు పూజచేయుటకు కావలసిన పదార్థములను భావనచేసి నేనను పీఠము లేక ప్రణవముగా, భావించి దానియందు నీలింగము నుంచి తత్వమస్యాది మహావాక్యములనెడి మంత్రములను వరుసగ బఠించుచు. విఘ్నకారులైన ద్వేషాదులనెడి రాక్షసులను దూరము పొందించుట కొరకు, ప్రణవమనెడి ఘంట వాయించి పూర్వమందు గురువునకు సమర్పించిన దేహేంద్రియాదులను (గురువు శిష్యునకు జ్ఞాన మార్గము ఉపదేశించునపుడు శిష్యునియొక్క ధనము, దేహము, ప్రాణములను, వారికి సమర్పించి జ్ఞానమును పొందును.) అట్టి దేహేంద్రియాదులను మరచి, కర్మమనెడి నిర్మాలిన్యమును తీసివేసి, అప్పుడు శమదమములనెడి, ఉదకముచేత అర్ఘ్య పాద్యాచమన, స్నానములను చేయించి, దృఢమైన సమభావనయనెడి, పరిశుద్ధమైన వస్త్రమునిచ్చి, సత్వ, రజ, స్తమోగుణ రూపమనెడి యజ్ఞోపవీతమునిచ్చి, ఉపమాన రాహిత్యమయిన సద్విద్య యనెడి గంధమునిచ్చి భూతదయ యనెడిఅక్షతలనిచ్చి, సగుణ వాసన గలిగిన పుణ్యములనెడి పుష్పములను భక్తిగా పూజించి, అప్పుడు మనస్సు చలించకుండునటుల గురువాక్య

మును జ్ఞాపకమునకు తెచ్చుకొని సాధన చతుష్ట యములనెడి ధూపమునిచ్చి సమస్త యింద్రియములయొక్క వ్యాపారములనెడి దీపమును సమర్పించి, నేను బ్రహ్మను, బ్రహ్మ మే నేను అనెడి దృఢభావనాహంస ధ్యానరూపమయిన అమృతనైవేద్యమును సమర్పించి, అపుడు గలుగు పూర్ణా నందమనెడి తాంబూలమునిచ్చి విజాతీయ ప్రవాహమును త్రోసివేసి, సజాతీయ ప్రవాహమైన ఆత్మభావన యనెడి సువర్ణపుష్పము నిచ్చి, పంచభూతము లనెడి పంచార్తియందు శబ్దాదులనెడి, దీపములనుంచి సమర్పణచేసి, అవిమ్మట చిత్త విశ్రాంతి యనెడి ప్రదక్షిణము జేసి, బ్రహ్మాత్మ భావనమనెడి నమస్కారముచేసి తనలోపల నున్న పరమాత్మను తానుగా గెలిసికొని తాను బ్రహ్మమనెడి దృష్టియందు చూపును రూపును నేకముజేసి చూపురూపులయొక్క ఐక్యమయిన ట్టియు స్థిరమయినట్టి ఆత్మాలింగము తానయి ప్రకాశింపుచు ఈ చెప్పఁబడిన యాత్మానుభవముచేత మనస్సును వృత్తులను చూడకుండునటుల జేసి మననము మరచిపోయి ఉన్మన్యవస్థను పొంది చూచునది, చూచుట, అను నీరెంటిని చూడబడుచున్న ఆత్మ, లింగమందు లీనముచేసి నామరూపము వలన వేరు చేయఁబడిన సంపూర్ణఘన సచ్చిదానంద రూపమగు మోక్ష పదమందు పూర్ణమై ఏకమై నిర్వికల్పకమైన యోగనిద్రను

బొంది తాను తానై నిధిధ్యాసరూపమందు కొంతకాలముండి తిరిగి చిదాభాసుఁడైనను బంధములేదు.

అట్టి యతీతమైన పరబ్రహ్మము ఎట్లుగా కాచిన యినుమునిూఁద దెబ్బవేయునపుడు రేణువులెట్లు యెగిరిపోవుచున్నవో యాతీతిని పరమాత్మయందుండి బ్రహ్మము రేణువై పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆత్మయను నామమును కలిగి సర్వ జీవరాసులయందును హంససూత్రముగా వ్యాపించి యున్నాఁడు. ఈ హంససూత్రమే నాలుగు వేదములయొక్క సారాంశము. ఈ ప్రపంచమునందుండు యెల్ల దేవాలయములందును బ్రహ్మోత్సవము జరుగు కాలమునందు దేవుని వెనుక బ్రాహ్మణులు వేద పారాయణము చేయునపుడు ఈ హంససూత్రమునే ముఖ్యముగా ధ్యానముజేసి తరువాత ఉపనిషత్తులను పారాయణము చేయుదురు.

### హంససూత్ర భావము.

-:0:-

శ్లో. జ్ఞానాత్స్వరూపం పరమహంస మంత్రం సముచ్చరేత్
ప్రాణీనాం దేహమధ్యేతు స్థితోహంస స్సదాచ్యుతః
హంసఏవ పరంసత్యం హంసఏవతు శక్తికం
హంసఏవ పరంవాక్యం హంసఏవతు వైదికం
హంసఏవ పరోరుద్రః హంసఏవ పరాత్పరః.

అని బ్రహ్మవిద్యోపనిషత్తుయందును

శ్లో. సోహ మపాపో విరజో నిర్ముక్తః.

అని తైత్తిరీయోపనిషత్తుయందును

శ్లో. యోసా వసౌ పురుషస్సోహమస్మి.

అని ఈశావాస్యోపనిషత్తుయందును చెప్పఁబడి యున్నది.

ఆత్మ సకలజంతువులయొక్క దేహమధ్యంబున హంస స్వరూపంబుననుండి సోహం సోహం అనుచు, నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను అనుచు, సదా తనకు తానే జపించుకొనుచుండును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతా శరీరంబులందును ఈహంస సంచరించుట చేతనే వారును జీవించి యున్నారుగాని, లేకున్న ప్రేతముగా నుందురు. కాఁబట్టి ఇదియే బ్రహ్మ, విష్ణు, శివుఁడు, శక్తి యని చెప్పఁబడును. ఈ హంసయే సత్యస్వరూపుఁడు. ఇతఁడే పరాత్పరుఁడు. ఇతని పలుకే సోహము. ఇదియే మంత్రములలోపల శ్రేష్ఠమైన మంత్రము. దీని రహస్యమే సోహంభావము. ఈ సోహం భావమే బ్రహ్మైక్యమును కలిగించుటకు కారణమైనది.

మనము దేవాలయమునకు వెళ్ళి రెండుచేతులను అంజలి హస్తులయి విగ్రహములకు దండము సమర్పించుటకు కారణ మేమన, ఈ యాత్మను బ్రహ్మమునందు చేర్చుము అని ఐక్యభావమే రెండు చేతులను చేర్చుటకు కారణము. ఆ విగ్రహములు మనలకు యేమిచూపుచున్న వనఁగా



శ్రీ వేంకటేశ్వర పెరుమాళ్ళు.

ఒకచేత శంఖము, మరియొకచేత చక్రము, యింకొకచేత తన పాదమును చూపించుచు పాదముమీఁద దృష్టినియుంచి మనస్సును నిలిపినయెడల నీ యాత్మ బ్రహ్మమునం దైక్యమగుననే భావనగా మనలకు కుడి హస్తమును చూపుచున్నాఁడు. అట్లు మనస్సు నిలిచినయెడల యీ యాత్మ

బ్రహ్మమునందు ఐక్యమగును. మనస్సును నిలుపుటకొరకే దేవాలయమునందు విగ్రహముల నుంచబడినవి.

ఈ హంసయే సద్గురుగోప్యము. ఇదియే నాలుగు మహావాక్యములయొక్క సారము. అజపాగాయిత్రి, మౌనం, నిర్గుణం, ఆత్మధ్యానము. ఇదియే ఆత్మారామతారకము. ఈ హంససూత్రమును దెలిసికొన్నవారే నిజమైన బ్రాహ్మణులు, వీరే బ్రహ్మజ్ఞానులు. నానావిషయములందు విచ్చలవిడిగా వ్యాపించి తిరుగుచుండెడి మనస్సును ఈ హంససూత్రముచేత కట్టివేసినయెడల యెచ్చటికి పారిపోక అచ్చటనే (నాభియందే) నెమ్మదిగ యుండునుగాని వేరే యేయొక్క ఉపాయములచేత కట్టుబడి కుదురుపడదు. మనస్సున యేతలంపులులేక నిలుపుటకు శక్తిలేనపుడు యోగాభ్యాసము చేయవలెను.

అథచిత్తం సమాధాతుం నశక్నోషి మయిస్థిరమ్
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. అ.12 9 శ్లో

చిత్తమును నాయందు నిశ్చలమగునట్లు నిలుపుటకు శక్తుఁడవు కాకపోతివేని, యోగాభ్యాసముచేత బొందుటకు ప్రయత్నముచేయుము.

చిత్తమును నాయందు అనునది ఆత్మ [illegible] ముగ యుండుటచేత మాట్లాడుటకు శక్తిలే[illegible] యున్నాఁడు. మాట్లాడుటకు దేహము, కండ్లు, ముక్కు

చెవులు, చేతులు, కాళ్ళు మొదలగు అవయవములు ఉండ వలెను. కాఁబట్టి సూక్ష్మములైన పృథివి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశములనెడి పంచభూతములును దానివలన స్థూలములైన ఆకాశాది పంచభూతములవల్ల దేహమును సృష్టించుకొని ఆ దేహ మధ్యంబున ఆత్మగా ప్రవేశించి నేను, నాయందు అని చెప్పుచున్నాఁడు. మాట్లాడుటకు దేహమును సృజించుకొని కృష్ణుఁడను నామమును వహించి లోపలయుండు యాత్మస్వరూపమే నే ననఁబడునది దేహముకాదు. ఇటువంటి ఆత్మయందు మనస్సును నిలుపుటకు శక్తుఁడవు కాకపోతివేని యోగాభ్యాసముచేత బొందుటకు ప్రయత్నము చేయు మనెను. యోగాభ్యాస మనఁగా వాయువును క్రమ క్రమముగా పూరించి కుంభించి అభ్యాసమును చేయుచు వచ్చిన యెడల వాయువు గర్భ గుహ్వారయందు ప్రవేశించి పేరుకుయుంచి నిలిచియుండును. అట్లు నిలచిన వాయువు ఏతలంపు లేక మనస్సును నిలుపుదలజేసి సమాధి నిష్ఠను పొందించుట. శుద్ధాంతఃకరణభక్తిచే యోగము సిద్ధించును ఆ యోగముచే సమాధినిష్ఠ యలవడును.

## శుద్ధాంతఃకరణభక్తి.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. అ.9.26శ్లో

ఎవ్వఁడు నాకొరకు భక్తితోడను, మారేడు, తులసి మొదలగు ఆకులను, పువ్వులను, పండ్లను, ఉదకమును ఇచ్చుచున్నాఁడో, అట్టి సుద్ధాంతఃకరణముగల వానియొక్క భక్తి పూర్వకముగా సమర్పింపఁబడిన యావత్పుష్పాదులను నేను స్వీకరించుచున్నాను.

ఎవఁడు శుద్ధాంతఃకరణభక్తి పూర్వకముగా భక్తి చేయుచున్నాఁడో అట్టివాఁడు పునర్జన్మమునందు మేలైన పదవిని బొందును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపిసః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే. అ. 6 44 శ్లో.

సుద్ధాంతఃకరణభక్తి కలవాఁడు తానుగా ప్రయత్నింపకపోయినను అపూర్వ జన్మాభ్యాసముచేత 'నేనే' వారిని బలాత్కారముగా ధ్యానాభ్యాసమునకు నాకర్షింపఁబడుచున్నాను.

సుద్ధాంతఃకరణభక్తి పూర్వకముగ చేయుచున్నవాఁడు మరణము నొందినవెనుక పునర్జన్మమునందు అపూర్వజన్మాభ్యాసముచేత తానుగా ప్రయత్నింపక పోయినను నేనే వానిని బలాత్కారముగా ధ్యానాభ్యాసమునకు (మనస్సును నిలుపుటకు) పైకి తీసికొనుచున్నాను. ఎందుచేత ననఁగా పూర్వజన్మమునందు నేనే వానియందుండి అభ్యాసమును

చేయించినవాఁడను. ఈజన్మమునందును వానియందు నేనే యున్నాను. వాఁడు ఎదివరకు చేసి మరణమునొందినది నాకు తెలుసును. కాఁబట్టి పాతికయుండినను అర్ధయుండినను, ముప్పాతిక యున్నను పూర్తిచేయుట నాయొక్క పనిగాని వాని పనికాదు.

హంససూత్రముచే మనస్సును కట్టి
వేయుటయేసంధ్య.

---

శ్లో. నశిఖాం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః
బ్రహ్మసూత్ర మిదం జ్ఞేయం సూత్రంనామ పరంపదం
తత్సూత్రం ధారయేద్యోగీ సవిప్రో వేదపారగః.

బ్రహ్మోపనిషత్తు.

శిరస్సున శిఖపెట్టుకొనినను, బోడిచేసికొనినను నూలు పోగులను జంధ్యమువేసికొనినను బ్రాహ్మణులు గాజాలరు. అయితే పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వజీవులయందును ఈ హంససూత్రము వ్యాపించియున్నది గాన ఇదియే నిజమైన సంధ్యయనియు, బ్రహ్మసూత్రమనియు, జ్ఞానయజ్ఞోపవీత మనియు చెప్పఁబడును. దీని నెరింగినవారే నిజమైన బ్రాహ్మణులు. సంధ్యచేయువారు పూరించి కుంభించి మంత్రములనుచ్చరించుటకు శక్తిలేనందున శ్వాసమును కుంభించిన భావముగా మూడు వ్రేళ్లను ముక్కుమీఁదనుంచి గాయత్రి మంత్రములను

జపించుచు ఉచ్ఛ్వాశ నిశ్వాశములను విడుచుట సంధ్యకానే రదు. అట్లుచేయుట కర్మయనఁబడును.

శ్లో. హంసహంసేతి యోబ్రూయాత్ హంసోనామ హరిశ్శివః
గురువక్త్రాత్తు లభ్యతే ప్రత్యక్ష సర్వతోముఖం.

బ్రహ్మవిద్యోపనిషత్తు.

బ్రహ్మైక్యకారణంబగు నీహంస స్వరూపసంసార రహస్యంబును దెలిసికొని ధ్యానించుజ్ఞానులు హరిహరాది దేవతలతోడ సమానులగుచున్నారు. ఈపరమపావనమైన హంస మార్గము సద్గురుకటాక్షము పొందినవారికే తెలియునుగాని తక్కినవారెంతకష్టపడినను తెలియఁజాలరు. ఇట్టిరహస్యమును తెలిసికొన్నవారు సనకసనందనాదులు, నారద, వశిష్ఠ, పరాశర, వ్యాస, శుక, శౌనక, జడభరత, నిదాఘ, ఋభు, జనకమహారాజు మొదలైనవారు ఈహంససూత్రమును దెలిసికొని బ్రహ్మస్వరూపులగుచు ముక్తులయిరి.

ఈమునులందరును రాజయోగమున ప్రాణాయామ, ప్రత్యహార, ధారణ ధ్యాన, సమాధివల్లనే ముక్తులయిరి.

రాజయోగమునకు అర్థము.

—:0:—

యోగములయందు మంత్ర, లయ, అట, రాజయోగములని నాలుగు విధయోగములు కలవు. ఇందు రాజయోగమే శ్రేష్ఠమైనది. ఇది రాజబాటవంటిది. తక్కిన

వన్నియు కష్టమైన మార్గములు. ఈయోగాగ్నివల్ల తన సంచితములనెడి పుణ్యపాపములను దహింపఁజేయును. యోగాభ్యాసమువలన జ్ఞానము కలుగును. యోగము, జ్ఞానము యెవరియందు కలిగియుండునో అట్టివారికి దైవకృపకలుగును. ఎవరు ఈయోగమును అభ్యసించుచున్నారో వారు బ్రహ్మస్వరూపమును పొందఁగలరు. బ్రహ్మస్వరూప మనఁగా యే తలంపులు లేక మనస్సును నిర్మలముగా నిలుపుచున్నారో అట్టివారినే బ్రహ్మస్వరూపులైన ముక్తులని చెప్పఁబడును. ప్రతియోగియు తన ఆత్మను కనుగొను శక్తికలిగియున్నాఁడు.

ఈయోగము యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధియని అష్టవిధములు.

ఇందు యమమనఁగా—అహింస జీవకోటిని చెడ్డ మాటలవల్లగాని, చెడ్డతలంపులవల్లగాని, దుష్కార్యములవల్ల గాని బాధపెట్టకుండుట. అహింసా పరమోధర్మమను శ్రుతిని బట్టి అహింసకంటె మిక్కిలి యెక్కువైన ధర్మములేదు. ఇది వేదముయొక్క మొదటివాక్యము. అసత్యము, అబద్ధము చెప్పకుండుట, ఇచ్ఛలేకుండుట, ప్రతిప్రయోజనము కోరకుండుట, పరస్త్రీల మోహించకుండుట, ఇవి యన్నియు యమము. ఈయమము మనస్సును నిర్మలము కలుగజేయును.

నియమమనఁగా—శౌచం, దేహశుద్ధి, ఆచారము, చెరుపుచేసినవారికి చెడ్డచేయకుండుట, దేహాభిమానము విడిచి

పెట్టుట, ఇతరుల స్తోత్తును, దురాక్రమించకుండుట, ఎల్లప్పుడు సంతోషముగా నుండుట, సృష్టి, స్థితి, సంహారము చేయునట్టి ఏకబ్రహ్మమును అలంకృతము చేసి ఏకధ్యానమునందుంచుట.

ఆసనమనఁగా—స్వస్తికం, గోముఖం, వీరం, సింగం, పద్మం, మయూరం, చిత్తు, పత్త్రిరం, సుఖాసనములని నవవిధ ములు.

ప్రాణాయామమనఁగా—అభ్యాసముచే క్రమక్రమ మున వాయువును పూరించి ఐదువేల ప్రణవముల నుచ్చరించు వరకు శ్వాసమును కుంభించి రేచించవలయును. అట్లు కుంభించి రేచించినవారు ప్రాణాయామము పూర్తిచేసినవారలని శంఖ బ్రహ్మ ఋషియొక్క యోగశాస్త్రమునందు చెప్పఁబడియు న్నది. కుంభించిన వాయువు దేహమంతయు వ్యాపించుటను మొదటిపేజి యోగాభ్యాస పటమునందు చూడుము. అట్లు చేయువారలకు దేహము కృశించి, నలిగి, చమర్చి, శిరస్సు వణకుపుట్టి తలంపులు స్మృహతప్పియుండును. ఈయభ్యా సము చేయువిధముల నెల్ల యీగ్రంథమున 111 పేజీలో కను పరచియున్నది. ప్రాణాయామము జ్ఞానమునకు మొదటి మెట్టు ఈప్రాణాయామమువలన ప్రత్యాహార, ప్రత్యాహారవలన ధారణ, ధారణవలన ధ్యానము, ఈధ్యానమువలన సమాధి (మోక్షము) కలుగును.

ప్రత్యాహారయనఁగా—పదివేల ప్రణవముల నుచ్ఛరించువరకు శ్వాసమును కుంభించి రేచించినయెడల పంచభూతములు లయించి మనస్సు నిశ్చలస్వభావము కలిగి ఏకాంత స్థలమునందుండురు.

ధారణయనఁగా—పదునైదు వేల ప్రణవముల నుచ్ఛరించు వరకు శ్వాసమును కుంభించి రేచించినయెడల దేహము స్తంభించి పంచభూతములు నశించి మనస్సు శూన్యమై బ్రహ్మస్వరూపమున లయించి యుండును.

ధ్యానమనఁగా—పై చెప్పిన ధారణయందు నిలిచిన తరువాత తన్ను ఆనందజ్యోతి ఆవరించుకొనుటను చూచుట. ఈజ్యోతినే వేదాంతులు తురియభూమియనియు యోగులు ఆత్మస్వరూపులనియు చెప్పెదరు.

సమాధియనఁగా—యోగులు వాయుభక్షణచేసి అన్నాహారములేక నిర్వికల్పమునందు నిలిచి తేనెను త్రాగిన భ్రమరమువలె స్తంభించి యుండుట ఈసమాధినే అ 8-14 శ్లోకమున చెప్పబడియున్నది.

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః.

ఇతరవిషయములయందుఁ బ్రవర్తింపని మనస్సుగలవాఁడగు నే యోగి నన్నెల్లప్పుడును చింతనచేయుచున్నాఁడో, స్థిరమైన సమాధిగల యట్టి ధ్యానాభ్యాసికి నేను ప్రయాస లేకుండఁ బొందఁదగినవాఁడ నగుదును.

ఇట్టి బ్రహ్మనిష్ఠాపరులైన జ్ఞానులకు మనస్సుతోఁ దమచూ సకలకార్యముల చేయుచున్నను కాలినగుడ్డ మడతతోడ యుం డినను కట్టుకొనుట కుపయోగపడనట్లు వారిమనస్సు జ్ఞానాగ్ని యందు దగ్ధమై యుండుటవలన కర్తృత్వ శూన్యమై (చేయు పనులు మనస్సులేక) యుందురు. అవ్యక్తమహదహంకా రాది విషయములయొక్క క్రియలు ఇట్టి బ్రహ్మవేత్తనంటవు. ఇందుకు దృష్టాంతము తామరపద్మమందు నీరంటనట్లు ఈదే హమనే తామరపద్మమందు విషయములనెడి జలము ఎప్పు డును అంటవు. ఇట్టి బ్రహ్మవేత్తలను కొందరు మనుష్యులు దెలియలేక మనవలెనే సంసారియై సమస్తవ్యాపారములను చేయుచున్నవాఁడు, కనుక హంసస్వరూపు డెట్లగునని యీ విధమున దూషించువారలకు నామహాయోగియొక్క దేహేం ద్రియాది చలనమువలన గలిగిన పాపకర్మములు అప్పుడే వార లకు సంభవించును. ఆబ్రహ్మవేత్తలను మరికొందరు మను జులు విస్తారమైన భక్తిచేత పూజించుచు ఎల్లప్పుడు ఆ బ్రహ్మ వేత్తయొక్క నడతను ఆనందముతో నితరులకు జెప్పుచు కొన్ని క్రియలకు స్థూలదృష్టిచేత పాపములుగా కనిపించినను ఆక్రియ లకు మంచిగానే అర్థమును చెప్పుకొనుచున్నవారికి కోరికలేక మనోధీరుఁడై యోగిచేసిన పుణ్యకర్మములు వారలకుఅంటును. కనుక ఇట్టి బ్రహ్మాత్మానుభవముగల ఈయధ్యాత్మవిద్యను దెలిసికొనలేక యధికమైన మాయలోఁజిక్కి శరీరము నేనను మాయ యనెడి మదముచేత మత్తులై యుండువారికి నీజీవ న్ముక్తి అనుభవము ఏవిధముగాను దొరకదు.

పై చెప్పిన నవవిధఆసనములయందు రాజయోగమునకు పద్మాసనము లేక చిత్తాసనము ముఖ్యములైనవి. ఈయాసనమందుండి యోగాభ్యాసముచేసి సంకల్పము, మనస్సు నశించినతరువాత సుఖాసనమం దుండవచ్చును.

శ్రీరంగమున శ్రీరంగనాథుఁడు సర్వసంకల్పముల నశింపంజేసి సుఖాసనంబున ఫణిరాజశయనుఁడై యోగనిద్రను



శ్రీరంగనాథస్వామి.

చేయుచున్నాఁడు ఆరీతిని మనముగూడ యోగాభ్యాసముచే సకల తలంపులను నశింపఁజేసి యోగనిద్ర బొందుటకు ప్రయత్నించవలయును.

[illegible] మోక్షమునకున్ను, సంసార బంధమునకున్ను, సకల తలంపులవల్లకలిగిన ఈమనస్సే కారణము.

శ్లో. చిత్తం సంజాయతే జన్మ జరామరణ కారణం.

ముక్తికోపనిషత్తు.

మనస్సే జననమరణములను కలిగించుటకు కారణమైనది.

శ్లో. మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతం.

శాట్యాయనీ ఉపనిషత్తు.

మనస్సే బంధమోక్షములకు కారణము. మనస్సు విషయములయందు తగులుపడుటచేత బంధము కలుగుచున్నది. అట్లు తగులుపడకుండిన యెడల మోక్షము ప్రాప్తించుచున్నది.

యోగాభ్యాసముచేయ శక్తిలేనివారు తలంపులను నశింపఁజేయుటకు ముఖ్యములైన విషయములను ఈ క్రింద వ్రాయఁబడియున్నది. దీనిని ఉపాయముగా చూచి శ్రద్ధతో అభ్యసించువారికి సంకల్పము నశించి ధ్యానమునందు (ఏతలంపు లేక) నిలువఁబడుదురు.

శ్లో. సహస్రాంకుర శాఖాత్మ ఫలపల్లవ శాలినః
అస్య సంసారవృక్షస్య మనోమూల మిదం స్థితం
సంకల్ప ఏవ తన్మన్యే సంకల్పోపశమేన తత్
శోషయాశు యథా శోషమేతి సంసార పాదపః.

ముక్తికోపనిషత్తు.

సంసారమనెడి వృక్షమునకు మనస్సే కారణము. మనస్సనకు సంకల్పములే (నానావిధ తలంపులే) మనస్సు

నశు రూపమైనది. కాఁబట్టి తలఁపులు నశించినయెడల మనస్సు నశించును. మనస్సు నశించినయెడల సంసారమనెడి వృక్షము తానై నశించును.

శ్లో. యస్య సంకల్పనాశ స్స్యాత్ తస్య ముక్తిః కరేస్థితా.

మండలబ్రాహ్మణోపనిషత్తు.

సకల కోరికలన్నియు ఎవరికి నశించిపోవునో వారికి మోక్షము కరతలామలకమువలె అరచేతిలోనే యున్నది.

శ్లో. యథా సర్వే ప్రముచ్యంతే కామాయేస్య హృదిస్థితాః
అథ మర్త్యోమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

కఠోపనిషత్తు.

ఎప్పుడు సకలకోరికలున్ను నశింపఁజేయుచున్నారో అప్పుడు బ్రహ్మస్వరూపులైన ముక్తిని బొందుచున్నారు. సకలకోరికలున్ను నశింపఁజేయుట కిదియే నిదర్శనము.

శ్లో. ఉపాయ ఏకఏవాస్తి మనసస్సర్వస్య నిగ్రహే
మానసేభ్యుదయే నాశో మనో నాశో మహోదయః.

ముక్తికోపనిషత్తు.

సకల కోరికలను తలయెత్తకుండ చేయుటయే మనో నాశమునకు ముఖ్యమైన ఉపాయము. ఎట్లనఁగా మనకుతలంపు లన్నియు బ్రహ్మస్థానమునం దుండి పుట్టుచున్నవి. బ్రహ్మస్థాన మనఁగా మహాప్రళయ అంత్యంబున శ్రీమన్నారాయణమూర్తి బ్రహ్మను సృష్టించుటకు తలంచిన వెంటనే



తననాభియందుండి బ్రహ్మ యుద్భవించి తద్వారా మన

లను సృజించియున్నాఁడు. అందువలన మనకు సకలతలంపులు నానాభియందుండి పుట్టుచున్నవి. ఆ నాభిస్థానమును బట్ట బయలుగా జూచినయెడల సంకల్పములన్నియు నుదయించిన చోటనే యణఁగిపోవును. ఎట్లనఁగా జెన్నపట్టణమునకుఁబోవలెనని మనస్సు తలచ నారంభించి "చె" యను యక్షరము నాభియందుండి రాగానే దానిని రానీయక అంతర్ముఖముగా నానాభిస్థానమును ఆకాశరూపముగాఁ జూచినయెడల "చె" యను యక్షర ముద యించినస్థలమునందే యణగిపోవును దాని వెనుక రాబోవు సం గతు లంతయు నశించి పోవును అట్లు మనస్సును నిలుపుటకు శక్తిలేనియెడల అభ్యాసయోగము చేయుటకు గీత అ. 12-9 శ్లోక ముచూడుఁడు. కర్మకాండ జ్ఞానకాండమని రెండుకాండ ములు గలవు. కర్మకాండ వలన జన్మాదులు కలుగుచుండును. జ్ఞానకాండము వలన మోక్షము ప్రాప్తించును. కాఁబట్టి జ్ఞాన కాండమునే అనుష్టించవలయును.

శ్లో॥ హస్తం హస్తేన సంపీడ్య దంతైర్దంతాన్ విచూర్ణ్యచ
అంగాన్యంగై రివాక్రమ్య జయేదాదౌ స్వకం మనః॥

మహోపనిషత్తు.

హస్తంహస్తేన = కర్మకాండమును జ్ఞానకాండము చేత ఖండించి, దంతైర్దంతాన్ = సంకల్ప వికల్పములనెడి దంతమునుల జ్ఞానదంతములచేత పొడిచేసి, అంగాన్యంగైః = యోగాష్టాంగములను జ్ఞానాష్టాంగములచే ఖండించి, మన

స్సును ఆత్మయందు లయించినట్లు అభ్యసించినయెడల మనోజ యము సిద్ధించును. అట్లుచేయనియెడల మనస్సు అనర్థము లను కలుగజేయుచుండును.

శ్లో॥ మనసోహ్యున్మనీ భావే ద్వైతం నైవోపలభ్యతే
యదాయాత్యున్మనీ భావ స్తదా తత్పరమం పదం॥ పైంగ

ఈమనస్సే మహామాయ యనఁబడును. దీనివల్లనే నీవు నేననెడి ద్వైతభేదములు కలుగుచున్నవి. ఈమనస్సే నిత్యముక్తపరబ్రహ్మను తాననుట మరచి దేహమే తానను భ్రమను పుట్టించును. మఱియు ఈమనస్సే బుద్ధి, చిత్తము, అహంకారము, కామక్రోధలోభాదిగుణములుఁగా మారుచు లోకులను నాభార్య, నాపిల్లలు, నాద్రవ్యములని అనేకవిధము లుగా బాధించుచున్నవి కాఁబట్టి

శ్లో॥ సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః
చిత్తమాత్రో వికల్పోయం చిత్తాభావే నకశ్చన
అతశ్చితం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని. అధ్యా

ఈమనస్సు నిద్రయందు లయించి యుండుటచేతనే ప్రపంచము తోఁచుటలేదు. మరల నిద్రవిడిచి లేవగానే మనస్సు తోఁచుటవలన ప్రపంచము తోఁచుచుండును. ఇట్టి మనస్సును బ్రహ్మనిష్ఠయందు లయింపఁజేసినయెడల ద్వైతభ్రాంతి నశించి ప్రపంచము తోఁచక సర్వము తానైనట్టి బ్రహ్మసాక్షా త్కారము కలుగును.

మనస్సు నిద్రయందే లయించి ప్రపంచముతోఁచక పోవుచుండఁగా మరల బ్రహ్మనిష్ఠయందు లయించునట్లు ఏల అభ్యాసము చేయవలయునను శంకకు సమాధానము

శ్లో॥ సుషుప్తి సమాధ్యో ర్మనోలయా విశేషేపి మహ
దస్త్యుభయో ర్భేదః తమసి లీనత్వాత్ ముక్తి హేతు
త్వాభావాచ్చ సమాధౌమృదిత తమోవికార తదా
కారా కారితఅఖండాకార వృత్త్యాత్మక
సాక్షిచైతన్యే ప్రపంచలయ స్సంపద్యతే.

మండలబ్రాహ్మణోపనిషత్తు.

మనస్సు నిద్రయందు అజ్ఞానమను అంధకారమునందు లయించి యుంకుటచేత తడిభూమియందు పూడిన విత్తనము లయించి మరల మొలకలెత్తునట్లు జాగ్రదావస్థయందు మరల మనస్సు తోఁచుచుండును. మరియు నిద్రయందు మనస్సు తోడ జీవుఁడును అజ్ఞానమందు అణిగి తానే బ్రహ్మమనుటను తెలియక తన్ను మరచి అంధకారమగు పాడుభావిలో పడిన గ్రుడ్డివానివలె పడియుండును. అందువలన జీవుఁడు ముక్తి బొందఁ జాలఁడు. బ్రహ్మనిష్ఠయందు మనస్సు జ్ఞానాగ్నియందు లయించి యుండుటవలన అగ్నిలో పడిన విత్తనము మరల మొలకలెత్తక నశించునట్లు ఆమనస్సు నశించును. కాఁబట్టి బ్రహ్మనిష్ఠాపరులైన జ్ఞానులకు తాను జీవుఁడను ద్వైతభ్రాంతి నశించి ప్రపంచము తోఁచక తాను కేవల సాక్షిమాత్రస్వయం

ప్రకాశ పరబ్రహ్మముగా నుండును. కాఁబట్టి నిద్రబోవువానికిని బ్రహ్మనిష్ఠయందుండు వానికిని చాల వ్యత్యాసము కలదు బ్రహ్మనిష్ఠయందుండువారికి అవశాన (మరణ) కాలమున మృత్యువు రాఁజాలదు. బ్రహ్మనిష్ఠను మరచినవారికే మృత్యువు కలుగును. ఒక తటాకము జలములోని పాచిని ఎంతదూరము పోఁగొట్టినను మరల వెంటనే ఆపాచి యథాప్రకారముగా ఆనీళ్లను కమ్ముకొనునట్లు ఎంతటి బ్రహ్మవేత్తయినను బ్రహ్మనిష్ఠాభ్యాసమునందు శ్రద్ధలేక పరాకుగా నుండెనేని అతనిని గూడా ఆవర్ణవిక్షేపస్వరూపముగా నుండు మాయాశక్తి తక్షణమే ఆవరించుకొని జనన మరణమును కలిగించును. మరణకాలమునందు ఎవఁడెవఁ డేయేతలంపులను తలఁచుచున్నాఁడో వాఁడు దానిని బొందుచున్నాఁడు ఒకనికి లక్షవరహాలుయున్నవి. మరణకాల సమీపమున ఆస్ట్రేలియా దేశపు గుఱ్ఱముమీఁద నిచ్ఛగలవాఁడై దానిని కొని అధికప్రీతిగా చూచుచుండి ప్రాణము పోవునపుడు వాని మనస్సు చిత్రగుప్త పటమునందుండు గుఱ్ఱమునందే లయించి యుండుటచేత తనవారందరు నాయినా, అన్నా, బావా, మామా, మాకు యేమిచెప్పుచున్నావని యెంత అఱచినను వినరాదు మనస్సు చెవియింద్రియము లీ రెండు కలసినయెడల విషయములను గ్రహించునేగాని మనస్సు వేరేయింద్రియములతో కలిసి పనిచేయునపుడు ఏయితర సంగతులు చెవికి వినరాక జీవుఁడు వెళ్లిపోవును. జీవుఁడు

చేయునట్టి కార్యము లన్నియు నెవఁడు చూచుచుండుననఁగా

శ్లో॥ ఏకోదేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా। కర్మాధ్యక్షు స్సర్వభూతాధి వాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ. శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఒకపగడాల సరమునందుండెడు ఒక్కొక్క పగడము నందును దారము వ్యాపించియుండు రీతిని పరబ్రహ్మముగు యాత్మ సకలజీవజంతువులయందును గూఢముగా వ్యాపించి ఆయాజీవులు చేయునట్టి కర్మలకు సాక్షిగా నున్నాఁడు.

ఇట్లు సాక్షిభూతముగా యుండునట్టి ఆత్మ వీని సంకల్పము రీతిని పుణ్యము చేసిన ఆస్ట్రేలియాదేశపు గుఱ్ఱము గర్భమునందును పాపము చేసిన జట్కాబండిగుఱ్ఱము గర్భమునందును వేయుచున్నాఁడు. అస్ట్రేలియాదేశపు గుఱ్ఱము చాల వెలగలది దానిని గొప్ప ఉద్యోగస్థులు కొని ప్రతిదినము 5, 6 మైళ్లు సవారిచేసి సుఖముగా నుంచెదరు. పాపముచేసిన జట్కా గుఱ్ఱములు ఉదయము 6 ఘంటల మొదలు పగలు రెండుఘంట వరకు కొట్టికొట్టి సవారిచేయుచున్నారు. గుఱ్ఱమేకాదు. మరణకాలమునం దేనినితలఁచి ప్రాణమును విడుచుచున్నాఁడో దానినే పునర్జన్మమునందు పొందుచున్నాఁడు. ఏయొక్క తలంపును లేక బ్రహ్మనిష్ఠయందుండి ప్రాణమును విడుచుచున్నవా రెవరో వారికి పునర్జన్మము లేదు. ఈజీవులు చేయునట్టి పుణ్య పాపములు సాక్షిభూతముగా యుండు ఆత్మను అంటజాలదు.

శ్లో॥ సూర్యోయథా సర్వలోకస్య చక్షు ర్నలిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః। ఏక స్తథా సర్వభూతాంతరాత్మా నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః. కఠోపనిషత్తు.

సూర్యకిరణములు సుగంధ దుర్గంధములందు ప్రకాశించి యుండినను యాసుగంధదుర్గంధములు సూర్యుని జెందనట్లుసకల జీవజంతువులయొక్క హృదయములందు వసించుచున్నట్టి పరబ్రహ్మ మగు ఆత్మకు ఆయాజంతువులు చేయునట్టి పుణ్యపాపము లంటజాలవు. ఆత్మ పుణ్యపాపములేని నిర్దోషుఁడగుటవలన నిర్మలుఁడగుచున్నాఁడు. మనము సకలకార్యములను చేయు నప్పుడు పుణ్యపాపములంటక ఈశ్వరార్పణము, లేక కృష్ణా ర్పణమని చేసిన యెడల సకలపాపపుణ్యములను ఈశ్వరుని జేరుచున్నది.

శ్లో॥ ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్.
త్రిపురాతాపిన్యుపనిషత్తు.

ఒకచంద్రుఁడే అనేక నీళ్లకుండలయందు ప్రతిబింబించి అనేక చంద్రులుగా తోఁచునట్లు పరబ్రహ్మమగు ఒక్కయాత్మ యే నానాజంతువులయొక్క శరీరంబులలోపల ప్రతిబింబించి అనేక జీవులుగా తోఁచుచున్నాఁడు.

శ్లో॥ అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపంరూపం ప్రతి రూపో బభూవ। ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥ కఠోపనిషత్తు.

ఒక్క వత్తియందు వెలుగుచుండెడు దీపమునుండి అనేక వత్తులు వెలిగించినప్పుడు ఆవత్తులయందంతయు ఆయొక్క దీపమే వ్యాపించి యుండురీతిని ఒక్కయాత్మయే అనేక దేహములయందు వ్యాపించి అనేక ఆత్మలుగా తోఁచుచున్నాఁడు.

శ్లో॥ వాయుర్యథై కో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపో బభూవ
ఏక స్తథా సర్వభూతాంత రాత్మా
రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ. కఠోపనిషత్తు.

ప్రపంచమంతయు ఒక్కవాయువే వ్యాపించి ప్రాణవాయువనియు మలయమారుతమనియు, సుడిగాలియనియు చెప్పురీతిని ఒక్కయాత్మయే పిపీలికాది బ్రహ్మపర్యంతము సకల జీవజంతువులయందును వ్యాపించి అనేక ఆత్మలుగా తోఁచుచున్నవి.

శ్లో॥ యదేవేహ తదముత్ర తదన్విహ
మృత స్సమృత్యు మాప్నోతి
య ఇహ నానేవపశ్యతి. కఠోపనిషత్తు.

ఈశరీరమున వసించు ఈయాత్మయే యాపరలోకమునందలిపరబ్రహ్మముగుచున్నాఁడుఆపరలోకమునందలి పరబ్రహ్మమే ఈలోకమున మన శరీరమునం దాత్మస్వరూపముగా నివసించుచున్నాఁడు. ఒక్కయాకాశమే ఘటోపాధివలన ఘటాకాశ

మనియు, ఉపాధిలేనియెడల మహాకాశమనియు చెప్పఁబడు నట్లు సర్వపరిపూర్ణ పరబ్రహ్మము ఈదేహమునందు వసించుట చేత దేహోపాధివలన ఆత్మయనఁబడుచున్నాఁడు.

గృహమునందుండు యాకాశమునకు గృహాకాశమని చెప్పఁబడును. ఈగృహాకాశమునకు చుట్టు నాలుగు ప్రక్క గోడలు ఉపాదిగా యున్నవి. ఉపాదిగానుండు నాలుగు గోడలను తీసివేసినయెడల యాగృహాకాశము మహాకాశములో కలసి ఏకమై పోవునట్లును, ఘటమునకు ఉపాదిగానుండు వెంకుపగిలిన వెంటనే ఘటాకాశము మహాకాశమునందు చేరును. ఘటాకాశమునందు మనస్సులేనందున ఘటాకాశము మహాకాశము యేకమైనది. మనలకు ఘటముగానుండు ఈశరీరమునందు మనస్సు, ఆత్మ యీరెండు నుండుటచేత మరణకాలమునందు సంకల్పముచేత మనస్సు జన్మమునందును, ఆత్మ బ్రహ్మమునందును ఐక్యమగును. మరల తల్లి గర్భమునందుండి శిశువుగా పుట్టునప్పుడు బ్రహ్మము పరబ్రహ్మము నందుండి ఖండమై ఆత్మస్వరూపముగా ఆశిశువునందు ప్రవేశించి అది మొదలు మరణకాలపర్యంతము సాక్షీభూతముగానుండి వీని కర్మలకు తగినజన్మమునందు వేయుచున్నాఁడు. మనస్సు నశించి శూన్యమగువరకు జన్మాదులు వచ్చుచుండును. మనస్సు నశించినవెనుక దేహము రాఁజాలదు. అందుచేత అత్మకు

పనిలేక బ్రహ్మముగానే యుండును మనస్సును వశింపఁజేసిన యెడల బ్రహ్మస్వరూపు లగుదురు.

శ్లో. అణోరణీయాన్ మహతో మహీయాన్

ఆత్మాస్య జంతోర్నిహితో గుహాయాం. కఠోపనిషత్తు.

ఈలోకమునం దణువుకంటెను మిక్కిలి సూక్ష్మమైన జంతువులయందును ఏనుగువంటి లేక మహామేరు పర్వతమువంటి గొప్ప జంతువులయొక్క శరీరములందును ఆత్మయై వసించుచున్నాఁడు.

శ్లో. అశరీరం శరీరేషు అనవస్థే ష్వవస్థితం. కఠోపనిషత్తు.

ఆత్మ తనకు శరీరము లేక నాశరహితుఁడై యీ శరీరమునందు వశించుచున్నాఁడు.

ఆత్మగాలిరూపమువంటివాఁడు కాఁబట్టి ఈశరీరమునందే రూపులేక నాశరహితుఁడై వసించుచున్నాడు. ఈదేహమునకే నాశముగాని యాత్మకు నాశము లేదు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥
అ. 2. 22. శ్లో.

మనుష్యుఁ డేలాగున శిథిలములయిన వస్త్రములను విడిచి క్రొత్తవియు నితరములునగు వస్త్రములను స్వీకరించుచున్నాఁడో, యాలాగున నాత్మ శిథిలములయిన దేహములను

విడిచి, క్రొత్తవియు నిరతరములునగు దేహములను పొందుచున్నాఁడు.

శ్లో॥ సవా ఏష మహానజ ఆత్మాజరో మరో మృతో భయో బ్రహ్మాభయం హి వై బ్రహ్మాభవతి. బృహదారణ్యోపనిషత్తు.

ఆత్మకు బాల్య, యౌవన, కౌమార, వార్ధిక్యములు లేదుగాని ఈశరీరమునకే బాల్య, యౌవన, కౌమార, వార్ధిక్యాది యవస్థలు కలవు. మరియు భయములేనివాఁడు నాశములేనివాఁడు, చావులేనివాఁడు అటువంటి ఆత్మ ఈశరీరమునం దెచ్చట వసించుచున్నదనగా?

అంతశ్శరీరే నిహితో గుహాయాం. అధ్యాత్మోపనిషత్తు.

ఆత్మ యీశరీరమున పంచకోశములయందు వసించుచున్నాఁడు. అవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనఁబడును.

ఈస్థూలశరీరము ఆహారము లేకున్న నశించిపోవును అట్లు నశించక నిలుపుటకు అన్నమయకోశమును సూక్ష్మ (రూపములేని) శరీరము నిలుచుటకు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఈమూఁడుకోశములు ఆధారము, ఇందు ప్రాణవాయువు కర్మేంద్రియము చేరి ప్రాణమయకోశములగును.

వాక్కు, పాణి, పాదము, పాయురు, మొదలగునవి కర్మేంద్రియములు. (1) వాక్కు—నోరుమాట్లాడును. (2) పాణి—

చేతులు ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగు కార్యములను చేయును. (3) పాదము—కాళ్లునడుచుట నిలుచుట మొదలగు కార్యములను చేయును. (4) పాయురు—గుదస్థానము మల జలములను విసర్జించుట.

చిత్తము కర్మేంద్రియములు చేరి మనోమయకోశము ను బుద్ధి జ్ఞానేంద్రియములతో చేరి విజ్ఞానమయకోశమును కారణశరీరము ఆనందమయకోశము లనఁబడును. ఇటువంటి పంచకోశములయందు ఆత్మయెట్లు వసించుచున్నాఁడనగా? ఒక కత్తియును గుల్లచింతపండును కప్పుకొని వానిని కనపడకుండా చేయునట్లు ఆత్మను యీకోశములు కప్పుకొని కనపడకుండా చేయుచున్నది.

గీత॥ ధూమేనా ప్రియతే వహ్ని ర్యథా దర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥
అ 3-38 శ్లో.

సూర్యకిరణమువల్ల కలిగిన మేఘములు సూర్యుని కప్పుకొని కనపడకుండా చేయునట్లును అద్దమునందు మాలిన్యము కప్పుకొని కనపడకుండా చేయునట్లు గర్భమునందుండెడి శిశువును మావి కప్పుకొని కనపడకుండా చేయునట్లును ఆత్మసత్తా వల్ల కలిగిన యీకోశములు ఆత్మను కప్పుకొని కనపడకుండా చేయుచుండును.

శ్లో॥ తస్మిన్ మరు శుక్తికా స్థాణు స్పటికాదౌ జల రౌప్య పురుష రేఖాదివత్ । లోహిత శుక్ల కృష్ణమయీ గుణ సామ్యా నిర్వాచ్యా మూలప్రకృతిరాసీత్. పైంగలోపనిషత్తు.

ఎండమావులయందు జలము, ముత్యపుచిప్పలయందు వెండి, స్తంభమునందు పురుషుఁడు స్పటికమునందు నానావిధ రూపములు (వర్ణములు) లేకున్నను భ్రమవలన నున్నట్లు తోచు రీతిని శుద్ధ, నిర్గుణ, నిరాకార, నిర్వికార, పరబ్రహ్మమునందు మూలప్రకృతియనెడు లేని మాయయొకటి కలిగెను. ఆమూల ప్రకృతి తెలుపు, యెరుపు, నలుపు అను మూఁడువర్ణములతోఁడ మూఁడుశక్తులాయెను. తెల్లని వర్ణము మాయాశక్తి ఎఱ్ఱని వర్ణము అవిద్యాశక్తి, నల్లనివర్ణము ఆవరణవిక్షేపణశక్తులనఁ బడును.

ఎండమావులను చూచి జలమని భ్రమించి దానికొరకయి పోగా పోగా దిక్కుతెలియక వెళ్ళిపోవును శుక్తియందు (ముత్యపుచిప్పలయందు) వెండియున్నదని భ్రమను కలుగఁజేయును రాత్రులయందు స్తంభమును జూచి దొంగయని భ్రమను పుట్టించును సంఖువంటి తెల్లనిరూపముగల స్పటికమునందు నానావిధరూపములు భ్రమవలన నుండునట్లు తోఁచుచుండును. శుద్ధ నిర్గుణ, నిరాకార, నిర్వికార పరబ్రహ్మమునందు మూల ప్రకృతియనెడి లేని మాయయొకటి కలిగెను. మొదటబ్రహ్మమును ఈమాయాశక్తి కప్పుకొని పిమ్మట అవిద్యాశక్తి అనఁగా

అజ్ఞానము, అజ్ఞానమనఁగా తనయందు ఆరుకవచములతో మూయఁబడిన నేను అను ఆత్మను తెలిసికోలేక యీ దేహమునే తానని తలంచి దేహాభిమానము గలవాఁడై సకలచరాచర ప్రపంచంబు తనకంటెను వేరుగా భావించి కామక్రోధ ఈర్ష్య అసూయాది దుర్గుణములుగలవాఁడై జీవహింస మొదలగు వ్యభిచారాది పాపకృత్యములు చేయుచు దారాపుత్రాదులనెడి యీషణత్రయవలలో తగులుకొని తాపత్రయముచే (భార్యాపుత్రులు, ధనము, ఈమూడుకలిగియుండినప్పటికిన్ని లేనప్పటికిన్ని) సదా దుఃఖమును కలిగించుచు తనకు జనన మరణము కలదని భ్రమించుచుండుటయే అజ్ఞానము.

జ్ఞానియెట్లున్నాడనఁగా రజ్జు, సర్పంబు రీతిని ప్రపంచంబు అసత్యంబనియు ఆత్మస్వరూపుఁడగు తాను సత్యజ్ఞానానంద పరబ్రహ్మమని యెరింగి సకలసందేహములను మాని నిష్కాముండై ఆత్మధ్యానపరుండై నిర్వికల్పుండై యేతంపులు లేక సకలదృశ్యములను మరచి కేవల సాక్షిమాత్రుఁడై ఆనందించుచుండుటయే జ్ఞానమనఁబడును. త్రాడునుచూచి పామని భ్రమించి పరీక్షించిచూడగా సర్పభ్రాంతి వదిలినట్లు ప్రపంచముకూడా మనతోడపుట్టి మనము లయించునప్పుడు మనతోడనే లయించి పోవుచున్నది. కాఁబట్టి యిది అసత్యము తనయందు కామక్రోధాది కవచములతో మూయఁబడిన ఆత్మను తెలిసికొనిన తరువాత తానే సత్యజ్ఞానానంద పరబ్రహ్మమని

యెఱింగి సకలసందేహములంతయుమాని నిష్ఠానుండై బ్రహ్మ యొక్క కుమారులు నలుగురున్ను ఈశ్వరుఁడే శంకరుఁడుగావచ్చి బ్రహ్మజ్ఞానము నుపదేశింపవలయునని తపస్సుచేసినందువలన ఈశ్వరుఁడు శంకరుఁడుగా అవతరించి దక్షిణదిక్కుగా చూచుచు కూర్చుండి శిష్యులు ఉత్తరముఖముగా వారిని చూచుచు కూర్చుండి ఉపదేశము పొందిరి. మోక్షమునుగోరువారు ఉత్తర ముఖముగా నిష్ఠనుండవలయును. కామ్యమనఁగా పుత్రి కళత్రాగలు దనధాన్యములయందు యిచ్ఛగలవారు తూర్పు ముఖముగా పూజించినయెడల ఈ జన్మమునందు ఆ ఫలము లభింపక మరియొక జన్మమునందు సిద్ధిపొందఁగలరు. ఎందుచేత ననఁగా సంచితం, ప్రారబ్ధం, అగామ్యము అని మూడు విధములుగలవు ఇదివరలో అనేకకోటిజన్మములుగా జేయుచు వచ్చిన పాపపుణ్యముల మూటలు చేరియుండునదియే సంచిత మనఁబడును. ఒక్కొక్క జన్మమునందును యెంతపాపపుణ్య ములను పంచిపెట్టవలయునో అంతపాపపుణ్యములను ఈశ్వరుని చేత పంచిపెట్టి పాపపుణ్యములకు తగినశరీరమునుపొంది వాటిని అనుభవించుచున్నాఁడు. దీని ననుభవించుటయే ప్రారబ్ధము ఎటువంటిబ్రహ్మవేత్తయినప్పటికిన్ని యీప్రారబ్ధము అనుభవిం చే తీరవలయును. అగామ్యమనఁగా యీజన్మమునందు చేయు నట్టి పాపపుణ్యములు జన్మాంతరములుగావచ్చు సంచితము లనెడి పాపములయొక్క మూటలలో పాపమున్ను పుణ్యము

యొక్క మాటలలో పుణ్యమున్ను చేరుటయే అగామ్య
మనఁబడును. ఆత్మజ్ఞానపరుఁడై, నిర్వికల్పుఁడై యేతలంపులేక
సకలదృశ్యములను మరచి కేవలసాక్షిమాత్రుఁడై ఆనందించు
చుండుటయే జ్ఞానమనఁబడును.

మనస్సుయుండియేకదా ఆత్మజ్ఞానము చేయవలయును
యేతలంపులేకయుండుటకు ఆత్మజ్ఞానము యెందుకుచేయవల
యును ? ఆత్మధ్యానమనఁగా నెట్టిది ?

సోహంభావహంసధ్యానమే ఆత్మజ్ఞానము ప్రపంచవ్యవ
హారములందుండునపుడు సోహంభావధ్యానమును యేకాంతం
బునందుండు వేళలయందు ఏతలంపులు లేక మనస్సునిలుపుటకుప్ర
యత్నింపవలయును గృహమునందుండిన ఇంద్రియవ్యాపార మ
నోవ్యాపార మీరెంటిని నిలుపుటకు కష్టముగానుండును ఇంద్రి
యవ్యాపారమనఁగా ఇంటివారందరును మాట్లాడుశబ్దమును విను
చుండును కాఁబట్టి యేకాంతస్థలమునందుయుండినయెడల ఇంద్రి
యవ్యాపారములు కలుగఁజాలదు మనోవ్యాపారమును మా
త్రము నిలుపుటకు ప్రయత్నించినయెడల మనస్సు నశించి
కేవల సాక్షిమాత్రుఁడై ఆత్మస్వరూపముగా నిలిచి, ఆనం
దించువాఁడే జ్ఞాని నల్లని వర్ణమే ఆవరణవిక్షేపశక్తులనఁబ
డును దీనికి అహంకారము కారణము. ఈఅహంకారమువల్ల
కోపముపుట్టుచున్నది కోపముచేత దేహమునందు రక్తము
పొంగుచుండును దానిచేత వణకుపుట్టి కండ్లు యెఱ్ఱనై మీసము

లల్లలాడుచు కామ్యకార్యములు తెలియక చంపుట, కొట్టుట, తిట్టుట మొదలగు కార్యములను చేయును. ఇటువంటి మూడుగుణములును తెల్లనివర్ణముగుపరబ్రహ్మమును ఆవరించుకొని యున్నది.

శ్లో. సత్వోద్రిక్తా వ్యక్తావరణ శక్తిరాసీత్ తత్
ప్రతిబింబం యత్ తదీశ్వర చైతన్యమాసీత్
సస్వాధీన మాయ స్సర్వజ్ఞః సృష్టిస్థితి
లయానామాదికర్తా జగదంకుర రూపోభవతి,

పైంగలోపనిషత్తు.

అద్దమునందుండి ప్రతిబింబము ప్రతిబింబించునటుల మాయాశక్తి సత్వగుణ ప్రధానముగానుండును. దానియందు పరబ్రహ్మము ప్రతిబింబించుటవలన గలిగిన ప్రతిబింబమే ఈశ్వరుఁడనఁబడును. ఇతఁడు ఆమాయనుస్వాధీనము చేసికొని బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపంబున ప్రపంచమును సృష్టి స్థితి సంహారము చేయుచుండును. ఇట్టి యేకబ్రహ్మమును శివమతస్థులును, విష్ణుమతస్థులును శివవిష్ణువులకు భేదముకల్పించి శివుఁడు గొప్పవాఁడని శివభక్తులును, విష్ణువు గొప్పవాఁడని విష్ణుభక్తులు యొకరితోనొకరు వాదులాడి పోరాడుచున్నారు. ఇదియంతయు వింతాస్పదము,

శ్లో. రామఏవ పరంబ్రహ్మ—రామరహస్యోపనిషత్తు.
శ్లో. శివఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మ—మహోపనిషత్తు.

శ్లో. యోహ వై నృసింహో దేవో భగవాన్
యశ్చ బ్రహ్మా యశ్చవిష్ణుః యశ్చ మహేశ్వరః
నృసింహతాపిన్యుపనిషత్తు.

శ్లో. యోహవై రుద్ర స్సభగవాన్
యశ్చబ్రహ్మా యశ్చ విష్ణుః యశ్చ మహేశ్వరం.
అధర్వశిఖోపనిషత్తు.

శ్లో. శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయంశివః.
స్కందోపనిషత్తు.

పైశ్లోకములరీతి విష్ణువగు నేనున్ను పరమశివుఁడున్ను మేమిద్దరమున్ను యేకపరబ్రహ్మస్వరూపులమే కాఁబట్టి విష్ణువగు నేనే పరమశివుఁడు, పరమశివుఁడే నేను, శివునియొక్క రూపమే విష్ణువుయొక్క రూపము, విష్ణువుయొక్క రూపమే శివునియొక్క రూపము, శివునియొక్క హృదయమే విష్ణుయొక్క హృదయము, విష్ణువుయొక్క హృదయమే శివునియొక్క హృదయము మరియు

శ్లో. అద్యో 'రా' తత్పదార్థస్యాత్ మకార స్త్వంపదార్థవాన్
తయోస్సంయోజన మసీత్యర్థే తత్వవిదో విదుః.
రామరహస్యోపనిషత్తు.

'రా'అనెడి అక్షరమునకు తత్పదలక్ష్యార్థమైన నిరాకార పరబ్రహ్మమని అర్థమగుచున్నది. 'మ' అనెడి అక్షరమునకు

త్వంపదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మ యని అర్థమగుచున్నది. కాబట్టి 'రామ, అనగా అట్టినిరాకారపరబ్రహ్మమేఒక్కొక్క జీవజంతువులయందును సాక్షిమాత్రముగాఆత్మస్వరూపముగా నున్నది కాఁబట్టి దేహత్రయసాక్షిగా నుండు ఆత్మయే రాముఁడని చెప్పఁబడును. మరియు

రమంతే యోగినోనంతే నిత్యానందే చిదాత్మని
ఇతి రామపదేనాసౌ పరబ్రహ్మాభి ధీయదే
చిన్మయస్యా ద్వితీయస్య నిష్కళస్యా శరీరిణః''

రామతాపిన్యుపనిషత్తు.

నానిజస్వరూపమైన కేవల సత్యజ్ఞానానందనిత్య నిర్మల నిరాకార పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపమును బ్రహ్మ జ్ఞానులు తనయొక్క ఆత్మస్వరూపముగా నెరింగి సదా నా నిజస్వరూపమగు ఆత్మయందే రమించియుంటుటచేత నాకు రాముఁడనెడి పేరుకలిగినది. నానిజస్వరూపమును వేదాంతంబునందు జెప్పఁబడియున్నది. కాఁబట్టి వేదాంతమును విచారించి తెలిసికొని, నా నిజస్వరూపమును దర్శించిన యెడల నిజమోక్షమును పొందఁగలవు అని శ్రుతులు ఘోషించు చున్నవి. శ్రీరాముఁడు పుట్టి సీతను పెండ్లాడి రావణుని చంపినట్లు కర్మకాండములోఁ జెప్పఁబడి యున్నది. జ్ఞానకాండము రీతిని ఆత్మయే రాముఁడు, మనస్సే సీత, కామక్రోధాది గుణములే రావణుఁడు, కామక్రోధాది రాక్షసులను

నశింపఁ జేసి, సీత యనెడి మనస్సును ఆత్మా రామునియం దైక్యము చేయుటయే ఉపనిషత్తుల యర్థము. అట్టిఏక బ్రహ్మము దూషించువారు మంచిగతిని బొందక నరకకూపమం దే యుందురు.

శ్రుతి. బ్రహ్మణో రవ్యక్తః అవ్యక్తాత్ మహత్ మహతోహం
కారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో
పంచమహాభూతాని పంచమహాభూతేభ్యోఖిలం జగత్.

త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు.

బ్రహ్మమునుండి మాయ మాయవలన అవ్యక్తము దాని వలన అహంకారమనఁబడు ఆవర్ణవిక్షేపశక్తులుదానివలన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల నెడు పంచతన్మాత్రములు వాని వలన సూక్ష్మములైన పృథివి, ఉదకము అగ్ని, వాయువు, ఆకాశము, దానివలన స్థూలములైన ఆకాశాదిపంచభూతములు ఆ[illegible]లవలన ప్రపంచముపుట్టెను.

భూ[illegible]పో నలోవాయుః ఖం మనోబుద్ధి రేవచ
అహఙ్కార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టథా.

అ. 7. 4 శ్లో.

పృథివి తన్మాత్రగంధగుణమును, ఉదక తన్మాత్రరస గుణమును, అగ్నితన్మాత్ర రూపగుణమును, వాయువు తన్మాత్రస్పర్శగుణమును, ఆకాశతన్మాత్రశబ్దగుణమును, మనస్సనఁ కారణమైన అహంకార తత్వమును, మహాతత్వమును,

అవ్యక్తమును అని యిట్లు నాయొక్క ప్రకృతి (స్వభావము) ఎనిమిదివిధములుగా భేదమును బొందినది.

"పృథివి అనఁగా భూమి దీనిగుణము గంధగుణము ముక్కు వాసనచూచుట పృథివితన్మాత్రము, ఉదకమనగా నీళ్లు దీని గుణము రసగుణము నాలుక రుచిని యెరుఁగుట ఉదకతన్మాత్రము, అగ్నిఅనఁగా నిప్పు దీని గుణము రూపు గుణము కండ్లు అగ్నితన్మాత్రము, వాయువు అనఁగా గాలి దీని గుణము స్పర్శగుణము దేహమునందు గాలి తాకినవెంటనే గాలి కొట్టుచున్నదని తెలిసికొనుట వాయువు తన్మాత్రము, ఆకాశమనఁగా బయలు ఈబయలునందు పుట్టుశబ్దములను చెవులద్వారా తెలిసికొనుట అనునది పంచేంద్రియములు మనస్సునకు కారణమైన అహంకారతత్వము, మహాతత్వము అవ్యక్తము అను ఈ ఎనిమిది వస్తువులతోఁడ నీదేహము కలిగినది. అవ్యక్తమనఁగా పరబ్రహ్మము దానియందుండి మహత్తను తత్వము పుట్టెను, ఆమహత్తునుండి అహంకారమను తత్వము పుట్టెను, ఆ అహంకార తత్వము మనస్సునకు కారణమైనది. అనఁగా ఇది ప్రపంచము పుట్టురీతిని ఒకదానినుండి భూమి జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములు పుట్టెను. దానివలన ప్రపంచము పుట్టెను కాఁబట్టి ఈశరీరము మాయవల్లకలిగినది. మాయయెటువంటిది అనగా.

శ్రుతి. ఏతస్మాత్కిమివేంద్రజాల మపరం యద్గర్భవాసే స్థితం
రేతశ్చేతతి హస్తమస్తక పదప్రోద్భూత నానాంకురం
పర్యాయేణ శిశుత్వ యౌవన జరా వేషైరనేకై ర్వృతం
పశ్యత్యత్తి శృణోతి జిఘ్రతి యథాగచ్ఛత్యథా గచ్ఛతి.

ఈమాయా విచిత్రము ఏమని చెప్పవచ్చును పురుషుని యొక్క గర్భమునందుండి జడమగు శుక్లము స్త్రీగర్భము నందు శోణితము తోడగలసి పిండరూపమై తర్వాత కాళ్లు, చేతులు, తల, కన్నులు, ముక్కు, నోరు, చెవులు, మొదలగు అవయవములతోడ స్థూలశరీరముగా నగుచు జీవత్వమును బొంది తల్లిగర్భమునందుండి శిశువుగా బుట్టి నానాట బాల్య యౌవన కౌమార, వార్ధిక్యాది వయోవికారంబులం జెందుచు, ఒకటిని నొకటిచూచుచు వినుచు తినుచు నవ్వుచు యేడ్చుచు వాసనచూచుచు మాట్లాడుచు ఆట్లాడుచు తిరుగుచు ఇట్లు వింతలు వింతలుగా ననేక కార్యములు చేయుచు ఉండిన ట్లుండి అకస్మాత్తుగా నెట్లువచ్చినదో అట్లు చెప్పకనే పారి పోవుచున్నది. జీవములేనట్టి శుక్లమిట్లు వింతవింతలుగా నామరూపములతోడ తోచి మరల నామరూపములు యేదియు తోచక శూన్యముగాఁ బోవుచున్నది. ఇంతకంటె ఇంద్రజాలవిద్య వేరేలేదు. ఇంద్రజాలమువంటి మాయా భ్రాంతివల్లనే యీజగత్తు తోఁచుచున్నదిగాని భ్రాంతిలేని వారికి జగత్తు లేనేలేదు.

శ్రుతి. మాయామయ మిదమఖిలం జగత్ జాయతేగచ్ఛతీ
తి జగత్ ఇదంప్రపంచం నాస్త్యేవ నోత్పన్నం నోస్థితం.
మాయాకార్యాదికం నాస్తి మాయానాస్తి భయంనహి
వంధ్యాకుమార వచనే భీతిశ్చేత్ అస్త్విదం జగత్॥
తేజోబిందూపనిషత్తు.

ఈజగత్తు మాయాభ్రాంతివల్లనే తోఁచు చున్నది. ఇంద్రజాలమువలె నానావిధ నామరూపములతో తోఁచి మరల తోఁచక అసత్యముగా పోవునదే జగత్తు ఇంద్రజాలము నందు తోఁచునట్టివస్తువులు యెట్లు అసత్యములో అట్లు మాయయు ఈమాయవలన తోఁచిన నామరూపజగత్తున్ను అసత్యములే గొడ్డాలిబిడ్డ మనలను చంపవచ్చుచున్నాఁడను మాట నిజముగా యుండినయెడల మాయయు మాయాకార్యమగు జగత్తున్ను కలదని జెప్పవచ్చును. కాఁబట్టి మాయయు మాయాకార్యమగు జగత్తును అసత్యములే. ఈ ప్రపంచమును మనకన్నుల కెదురుగా చూచుచు సర్వకార్యములను ప్రత్యక్షమున చేయుచుండగా దీనిని అసత్యమని యెట్లు చెప్పవచ్చును?

''ఒక గారడీవాఁడు గంపను మూతపెట్టి అందులో మామడిచెట్టును గావించి దానియందుండి పూతలు పిందలు, కాయలు గావించి మనకు జూపి మరుగుజేసి మరియు మిఠాయి దినుసులును ఇంకా అనేకవిధ వస్తువులును

జూపించి మరుగు జేసినట్లు మనము గూడా ఉదయము మొదలు రాత్రి నిద్రబోవువరకు భార్యా పుత్ర పౌత్రాదులయందును అధిక ప్రీతిని యుంచి వారును పీనియందు అదే ప్రకారముగా అత్యంత ప్రీతితో పడక పరకు యుండి నిద్రపోవునప్పుడు ఒకరిని నొకరు మరచి నిద్రించుకాలమున పీరియందున్న ప్రేమ తొచ్చుట పోయెను. నిద్రవిడిచి లేవఁగానే మనస్సు తోఁచుట చేత మరల ప్రీతి కలుగుచున్నది. ప్రపంచమంతయు నిద్రపోవు కాలమున ప్రళయ కాలమున ఎట్లు నిశ్శబ్దముగా యున్నదో అట్లు రాత్రి ఒక ఘంటకు లేచి చూడగా ప్రపంచ మంతయు నిశ్శబ్దముగా నున్నది. నిద్రవిడిచి లేచినవారికి జగత్తు తోఁచుటచేత ఆశ కలుగుచున్నది. మరణమునొందిన వానికి జగత్తు బొత్తిగా లేదు మాయవల్ల కలిగిన జగత్తు మాయాశరీరము నశించిపోవునపుడు యీమాయాశరీరము తోడ యీమాయాప్రపంచమును పీనితోడ లయించును. మరల యీమాయాశరీరము కలిగినప్పుడు దానితోడ యీ మాయాప్రపంచమును మరల తోఁచుచుండును. ఇట్లు పలుమారు పీనితోడ ప్రపంచము తోఁచి తోఁచి లయించుచుండును. కాఁబట్టి యీమాయకు కారణము మనస్సు, మనస్సునకు కారణము ఇంద్రియములు.

ఇంద్రి ... హి చరతాం యన్మనో నువిధీయతే
తదస్య హారతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి. అ.2.67శ్లో

విషయములయందు ప్రవర్తించుచున్న యింద్రియముల లోపలనే యింద్రియము ఈ మనస్సును అనుసరించి ప్రవర్తించుచున్నదో యాయింద్రియము ఈపురుషునియొక్క ఆత్మ వివేకమును సముద్రమునందు పరుగెత్తుచుండు నోడను ప్రతికూలవాయువువలె నవమార్గమున నాకర్షించుచున్నది. చెవింద్రియము కన్నింద్రియము, ముక్కింద్రియము, నోరింద్రియము దేహేంద్రియము అని పంచేంద్రియములు. నాశికద్వార వాసనను ఎరిగి మనస్సు ఆనందించును నాలుకద్వార రుచిని యెరిగి మనస్సు ఆనందించును, రాగమును పాడునప్పుడు చెవులద్వార విని మనస్సు ఆనందించును దేహేంద్రియమనఁగా (స్పర్శము) గాలి దేహమునందు తాకిన వెంటనే గాలికొట్టుచున్నదని మనస్సు తెలిసికొనుచున్నది. ఈనాలుగు ఇంద్రియములును ఏచెడ్డకార్యములు చేయఁజాలదు కన్నింద్రియము మాత్రము మహా అనర్థమునకు కారణముగా నున్నది. ఎట్లనఁగా సముద్రమునందు చిన్నగాపోవు ఓడను గాలితాకిన వెంటనే అతివేగముగా తోసికొనిపోవులాగున కన్నులు ఒకవస్తువును చూచిన వెంటనే ఆవస్తువుమీఁద మనస్సు పరుగెత్తుచున్నది. కాఁబట్టి యింద్రియములు గుఱ్ఱములవంటివి మనస్సు బండివంటిది దీనిని తోలువాఁడు మోక్షము కొరకు దృఢయత్నము చేయునట్టి వివేకబుద్ధి యను త్రాడను కళ్లెముగా వేసి యింద్రియములను తప్పిపట్టినను నిలుపక వానినిగూడా ఆయింద్రి

యములు బలాత్కారముగా విషయంబులందు ఈడ్చుచున్నది.

యతతోహ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభంమనః. అ.2. 60.శ్లో.

మోక్షముకొరకు దృఢప్రయత్నము చేయుచున్నట్టి పురుషునియొక్క మనస్సునుకూడ నిలుకడయందుంచక యింద్రియములు బలాత్కారముగా విషయములయందు ప్రవర్తింపఁజేయుచున్నది. వివేకియగువాఁడు గుఱ్ఱములనెడి యింద్రియముల నీడ్చి పట్టుటకు శక్తిలేనందున నేననెడి చెట్టుకు కట్టివేయుచున్నాఁడు. నేననెడి చెట్టు దేహముకాదు. ఈ దేహమునందుండు ఆత్మ.

శ్లో. ఇంద్రియద్వార సంగ్రాహ్యై ర్గంధాద్యై రాత్మదేవతాం
స్వయం భక్త్యా సమారాధ్య జ్ఞాతుం సోయం మహామఖః.

ఇంద్రియములను దానిదాని వికార కార్యములయందు చెదరనివ్వక త్రిప్పి ఆత్మనిష్ఠ చేయుటయే మహాయాగమనఁబడును. నల్లమేకలను జంపి అగ్నిగుండములోవేసి కాల్చి తినుట యాగము కాఁజాలదు.

శ్రుతి॥ ప్రాణేంద్రియా ద్యంతఃకరణ గుణాదేః పరతరం
సచ్చిదానందమయ సర్వసాక్షికం నిత్యముక్త
బ్రహ్మస్థానం పరమపదం. నిరాలంబోపనిషత్తు.

ప్రాణము అంతఃకరణము యింద్రియములు ముఖ్యములైనవి. వీటి కన్నిటికిని ప్రత్యేకముగా సచ్చిదానంద సర్వ

సాక్షిగానుండు యాత్మయే పరబ్రహ్మము అట్టి ఆత్మను బ్రహ్మమునందు చేర్చుటయే పరమపదము, వైకుంఠము, కైలాస మనఁబడును. వేరుపరమపదము, వైకుంఠము, కైలాసమును లేదు.

శ్రుతి॥ అతస్సంసార విషయ జనన సంసర్గయేవ నరకః
సత్సంస్వర్గః। స్వర్గహః. నిరాలంబోపనిషత్తు.

సంసార సాగరమునందు సదా తగులుపడుటయే నరకము దీనికంటె గొప్ప నరకము లేదు. సదా ఆత్మయందు మనస్సును లయింపజేయుటయే స్వర్గముదీనికంటెగొప్పస్వర్గము వేరు లేదు.

శ్రుతి॥ సచ్చిదానందానుభవ స్వరూపం జ్ఞాత్వా ఆనందరూపో యస్థితి।స్సఏవసుఖం అతస్సంసారవిషయ సంకల్పఏవ దుఃఖం.
నిరాలంబోపనిషత్తు.

ఆత్మయే సచ్చిదానంద పరబ్రహ్మమని యెఱింగి సకలము మరచి సదా యాత్మనిష్ఠయం దుండుటయే పరమసుఖము. భార్య, బిడ్డలు మొదలగు సంసారవిషయ సంకల్పమే (తలంపులే) మహాదుఃఖ మనఁబడును ఇట్టి సంసార సముద్రము నీది గట్టెక్కువాఁ డెవఁడనఁగా

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. అ7.3శ్లో

శాస్త్రపాండిత్యముగల మనుష్యులయొక్క వేలలో నొక్కఁడు మాత్రమే మోక్షము కొఱకు ప్రయత్నముచేయును.

అట్లు చేయుచున్న ధ్యానాభ్యాసుల (ఏతలంపు లేకుండా యుండువారి) మనుష్యులయొక్క వేలలో నొక్కఁడు మాత్రమే నన్ను వాస్తవముగా తెలిసికొనుచున్నాఁడు. అట్టివాఁ డెవఁడనఁగా

శ్రుతి॥ యఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వంభవతి.

బృహదారణ్యోపనిషత్తు.

ఎవఁడు ఆత్మస్వరూపుఁడగు నేనే బ్రహ్మమని తెలిసికొనుచున్నాఁడోవాఁడే ఆపరబ్రహ్మ స్వరూపమగుచున్నాఁడు.

శ్లో. అయమాత్మా బ్రహ్మ—మాండూక్యోపనిషత్తు.

ఈ దేహమునందు అంతఃకరణ సాక్షిగానుండు ఆత్మయే పరబ్రహ్మము.

శ్లో. భూతేషు భూతేషు విచింత్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి. కేనోపనిషత్తు.

సమస్త ప్రాణులయందును ఆత్మస్వరూపుఁడగు బ్రహ్మమే యున్నదని తెలిసికొన్నట్టి పుణ్యాత్ముఁడు యీ జన్మమునందే మోక్షసిద్ధిని బొందుచున్నాఁడు. మోక్షమనఁగా

శ్లో. యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ నవిచేష్టేత తామాహుర్ పరమాంగతిం.

కఠోపనిషత్తు.

నేత్రము శ్రోత్రము మొదలైన జ్ఞానేంద్రియములైదున్ను మనమున్ను ఆత్మయందు నిలిపి యేయితర సంబంధము లేక సకల

తలంపులనుమరచి చలనము లేకుండుటయే మోక్షమనఁబడును.

శ్లో. త్వమేవాహం నభేదోస్తి పూర్ణత్వాత్ పరమాత్మనః.
మండల బ్రాహ్మణోపనిషత్తు.

మనమిద్దరమున్ను ఏక బ్రహ్మస్వరూపులమే మన మిద్దరియం దును ఆత్మస్వరూపమే యున్నది. ఆ యాత్మస్వరూపమే నీవు నీవే నేను మనమిద్దరమున్ను ఏక పరబ్రహ్మమే మనమిద్దరి కిన్ని ఏలాటి భేదములేదు.

ఈశ్వరుఁడు పుణ్యాత్మునిన్ని మహాపాపినిన్ని సమ ముగా చూచుచున్నాఁడు. మహాపాపియైనవాఁడు పునర్జ న్మమునం దధిక బాధల ననుభవించుచున్నాఁడు. పుణ్యా త్ముఁడు సుఖమును పొందుచున్నాఁడు. కాఁబట్టి వారివారి పాపపుణ్యములకు తగిన శరీరమును యెత్తి సుఖదుఃఖములను ననుభవించుటచేత వీరిద్దరిని ఈశ్వరుఁడు సమముగా చూచు చున్నాఁడు. జ్ఞానికూడ ఆలాగుననే అందరిని సమముగా చూచును.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం యఃపశ్యతి నపశ్యతి. అ13. 28శ్లో

సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరబ్రహ్మ మును సకలమూ నశించినను నశింపనివానిగా నెవ్వఁడు చూచు చున్నాఁడో వాఁడు ఆత్మను చూచును. కాఁబట్టి

శ్లో. తత్త్వమసి త్వంతదసి త్వంబ్రహ్మాస్మి
అహంబ్రహ్మాస్మి త్యనుసంధానం కుర్యాత్.

పైంగలోపనిషత్తు.

పరబ్రహ్మమే నీయందు ఆత్మస్వరూపముగా నున్నది. నీవే ఆ పరబ్రహ్మము ఆపరబ్రహ్మమే నీవు కాఁబట్టి సకలకోరికలను నశింపఁజేసి ఆత్మస్వరూపుఁడనగు నేనే బ్రహ్మమని సదా ఆత్మానుసంధానము చేయుచుండుము.

## ఆత్మధ్యానము.

సోహంభావధ్యానమే ఆత్మధ్యానము. ఆత్మధ్యానమనఁగా మనము వాయువు పీల్చునపుడు ఆవాయువుతో కూడ "సో" అను అక్షరమును అజపాగాఁ జేర్చి లోపలికిఁ బీల్చుకొని శ్వాసమును విడుచునప్పుడు 'హం' అను యక్షరమును వాయువుతో నజపాగాఁజేర్చి విడుచుటకు అభ్యాసము చేయుచు వచ్చినయెడల వారి మనస్సు సోహంభావ ధ్యానమునందే లయించి యుండును గాని వేరే యేయితర తలంపులను రానివ్వక నిలుపుదల చేయును. ఈ ప్రకారము అభ్యసించుటయే సోహంభావధ్యానము సోహం సోహం అని కోటిసారులు నోటితో ఉచ్చరించినయెడల సోహంభావ ధ్యానము కాఁజాలదు. సోహం సోహం అనఁగా నేనేబ్రహ్మము బ్రహ్మమే

నేను యని ప్రతిదినము యీ శ్వాసము 21600 సార్లు పలుకు చుండి మరణమైన వెంటనే యీయాత్మ బ్రహ్మమునం దైక్యమై మనస్సు వేరుజన్మమునకు ప్రవేశించును. తత్వవివేకము చేసి యాత్మజ్ఞానమును ఎరింగి మోక్షమును పొందవలయునేగాని శాస్త్రాభ్యాసముచేత నాత్మజ్ఞానమునుపొందఁజాలరు. ఎట్లనఁగా

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్
యతన్తో ప్యకృతాత్మానో నైనంపశ్య న్త్యచేతసః.అ15.11శ్లో

ధ్యానాదులచే ప్రయత్నము చేయుచున్న ధ్యానయోగులు (యేతలంపు లేకుండ యుండువారు) బుద్ధియందున్న యీ యాత్మను చూచుచున్నారుగాని శాస్త్రములను చదివి మోక్షమును బొందుటకై ప్రయత్నము చేయుచున్నట్టి బుద్ధి లేనివారు యీ ఆత్మను చూడఁజాలరు.

శృతి. స్వరూపాను సంధాన వ్యతిరిక్త అన్యశా
స్త్రాభ్యాసై రుష్ట్రకుంకుమ భారవత్ వ్యర్థతా.
సన్యాశోపనిషత్తు.

తానే బ్రహ్మమని తెలిసి ఆత్మాను సంధానము జేయుచు యానందించుటను విడిచి వేదశాస్త్రములను చదివి చదివి కాలమును పోఁగొట్టువాఁడు కుంకుమపువ్వును మోసినగాడిదెకు సమానమగుచున్నాఁడు కాఁబట్టి.

శ్రుతి. విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతాం
అనంతకర్మ శౌచంచ జపోయజ్ఞ స్తథైవచ
తీర్థయాత్రాభి గమనం యావత్ తత్వం నవిందతి.
పైంగలోపనిషత్తు.

సకలశాస్త్రములను చదువవలయుననెడి భ్రాంతిని విడి
చి తత్వవివేకముచేసి యాత్మయే సత్యమగు పరబ్రహ్మమని
యెరింగి ఆత్మానుసంధానమే చేయుచుండుము. స్నాన, సంధ్య,
జప, తప, హోమ, నీమ, యాగ, తీర్థయాత్రాది సత్కర్మ
ములను చేయుటచేత తత్వజ్ఞానము కలుగఁ జాలదు ఆత్మాను
భవమును పొందఁజాలవు.

శ్రుతి. బహుశాస్త్రకథాకంథా రోమంథేన వృథైవ కిం
అన్వేష్టవ్యం ప్రయత్నేన మారుతే జ్యోతిరాంతరం.
ముక్తికోపనిషత్తు.

సకలశాస్త్రములను చదువుటవలన ప్రయోజనము
లేదు. అందువలన మోక్షమును పొందజాలఁడు. ఈశరీర
మునందు వసించునట్టి యాత్మయగు పరబ్రహ్మమును అంత
రంగ దృష్టివలన దర్శించినయెడల ముక్తిపొందగలఁడు.

శ్రుతి. సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతియే
తే రత్న మభివాంఛంతి త్యక్త హస్తస్థ కౌస్తుభాః.
మహోపనిషత్తు.

హృదయమునందున్న ఆత్మదేవతను తెలిసికోలేక వే రొక్క చోట దైవమున్నదని తలంచువారు చేతనున్నట్టి దేవ లోకమునందలి దేవరత్నమగు కౌస్తుభమణిని విడిచిపెట్టి భూ లోకమునందలి సామాన్యమగు రత్నమును వెతకుచుండు వానితో సమానమగుచున్నాఁడు.

శ్రుతి. అధీత్య చతురో వేదా౯ సర్వశాస్త్రాణ్యనేకశః
బ్రహ్మతత్వం నజానాతి దర్వీ పాకరసం యథా.

ముక్తికోపనిషత్తు.

మధురమైన పదార్థమును వంటచేసి అందులో గరిటను వేసి ఉంచినయెడల నాగరిటె యాపదార్థములయొక్క రుచిని యెరగజాలనట్లు సకలశాస్త్రములను చదివి పండితుఁడని పేరెత్తినప్పటికిని గురుకటాక్షమువల్ల వేదాంతశ్రవణమనన నిధిధ్యాసనములు గలవాఁడై తత్వజ్ఞాన సంపన్నుఁడైనప్పిటి కిని యాత్మజ్ఞానమును పొందనియెడల వాఁడు వ్యర్థుఁడే.

శ్లో. అమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనం ఏ
వంస్వాత్మానం జ్ఞాత్వా వేదైః ప్రయోజనం కింభవతి.

పైంగలోపనిషత్తు.

అమృత పానముచేసిన వానికి జలపానము చేయుట వలన ప్రయోజనము లేనట్లు వేదాంత విచారణచే బ్రహ్మజ్ఞాన మును పొందినవానికి వేదములతో పనిలేదు.

శ్లో. నైవమాత్మా ప్రవచన శతేనాపి లభ్యతే న
బహుశ్రుతేన నబుద్ధిజ్ఞో న శ్రుతేన నమేధ
యా నదేవై ర్నయజ్ఞై ర్నతపోభిరుగ్రై ర్నసాంఖ్యై
ర్నయోగై ర్నాశ్రమై ర్నాన్యై రాత్మాన ముపలభంతే.
—సుబాలోపనిషత్తు.

ఈ ఆత్మజ్ఞానము మాటలచేతను బుద్ధి చాతుర్యముల చేతను నిస్సారమగు శ్రవణముల చేతను తపస్సుచేయుటచేతను యాగముచేతను దేవతాధ్యానముల వల్లను సాంఖ్య అతాది యోగముల చేతను వర్ణాశ్రమ ధర్మములు తప్పక అనుష్ఠించుట చేతను కలుగఁజాలదు.

శ్లో. నానాశాస్త్ర పఠేల్లోకే నానాదేవంచ పూజనం
ఆత్మజ్ఞానంవినా పార్థ సర్వకర్మ నిరర్థకం
ఆచారక్రియతే కోటిదానంచ గిరికాంచనం
ఆత్మతత్వంవినా నాస్తి ముక్తిర్నాస్తి గురుర్వినా
కోటియజ్ఞం కృతం ఏన కోటిగోహయ దానకం
గజదానం సహస్రంచ ముక్తిః జ్ఞానంవినా నచ. గర్భగీత.

వేదాంతశాస్త్రములను చదివి పండితుఁడని పేరెత్తినప్పటికిని త్రిమూర్తులను పూజించినప్పటికిని యాత్మానుభవమును పొందనియెడల పైఁ చెప్పిన పన్నియు నిష్ఫలంబే. మేరు పర్వత మంతబంగారు కోటిసారులు దానమిచ్చినను యాత్మ

జ్ఞానము లేనియెడల ప్రయోజనము లేదు. కోటియజ్ఞములు చేసి, గోవులు, గుఱ్ఱములు, యేనుఁగులు కోట్లకోట్లగా దానమిచ్చినను మోక్షమును పొందఁజాలఁడు. గురుకటాక్షము లేక మోక్షము లభింపదు.

కోట్లకోట్లగా దానమిచ్చినప్పటికిని కడపట మోక్షము దొరకుట దుర్లభము గాని యీ దానాదులచే నధికపుణ్యము వచ్చుటచేత పుణ్యలోకమును పొందుచున్నాఁడు. పుణ్యలోకమనఁగా కొంచెమైనను పాపము చేయక అంతయు పుణ్యము చేసినట్టివారు ఉండుచోటే; యీ పుణ్యలోకమునే దేవలోకమనఁబడును. అచ్చట దేవసుఖములను అనుభవించి పుణ్యము ముగించిన వెంటనే యీ మనుష్య లోకమును ప్రవేశించుచున్నాఁడు. (పుణ్యము పాపము చేయునట్టి వారిలోకమే భూలోకము.)

తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవంత్రయీ ధర్మమును ప్రపన్నా
గతాగతం కామ కామలభన్తే. అ. 9. 21. శ్లో.

అటువంటివారు విస్తారమైన యీ స్వర్గలోక సుఖము ననుభవించి పుణ్యము ముగించిన తోడనే యీ మనుష్యలోకమును ప్రవేశించుచున్నారు. ఈ ప్రకారముగా విషయేచ్ఛ కర్మను

ఫలాపేక్షతో ననుష్ఠించెడివారు చావు పుట్టకను పొందు చున్నారు.

విస్తారమైన యాస్వర్గలోక సుఖము అనగా స్వర్గలోకము వెడల్పు పొడుగు కాదు. దేవలోకమునందుండువారికి బ్రహ్మకు యుండునట్టి ఆయుసులో చేరినందువల్ల విస్తారమైనదని చెప్పఁ బడును. బ్రహ్మకు ఆయుస్సు యెట్లనఁగా కృతయుగం, త్రేతాయుగం, ద్వాపారయుగం, కలియుగం యిటువంటి యుగములు రెండు వేలు అయినయెడల బ్రహ్మకు ఒకదినము. అటువంటి 30 దినములు ఒకనెల పండ్రెండు నెలలు ఒక సంవత్సరము అటువంటి సంవత్సరములు నూరు అయినయెడల బ్రహ్మకును బ్రహ్మలోకమునందుండు వారికిని ఆయువుముగించును. బ్రహ్మయొక్క దినమునకును మన నూరేండ్లకును పోల్చి చూడగా మన యాయును కన్నుమూసి తెరచినంత లక్షభాగములో నొక భాగముకూడ లేదు. ఈపాటి వయస్సుగల మనము మాయా సంబంధమున జిక్కి సమస్త వస్తువులను శాశ్వతముగా నుండ వలయునని కోరుచున్నాము.

మరియొకఁడు దేవలోకసుఖమును కోరక మోక్షమే కావలయునని సకల సంకల్పములను నశింపంజేసి సదా బ్రహ్మనిష్ఠ యందుండి మరణకాలమునందు గ్రహచారము చాలకయే దైనా తలంపు పుట్టినయెడల వానిని దేవలోకమునందు వేయుచున్నాఁడు.

ప్రాప్య పుణ్య కృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో భిజాయతే. అ6.41శ్లో

ధ్యానాభ్యాసమునుండి జారినవాఁడు పుణ్యముచేసిన వారియొక్క లోకమును పొంది అనేక కాల మచ్చటయుండి శాస్త్రపండితులుగా నుండఁబడిన గొప్ప నైశ్వర్యవంతుల యొక్క గర్భమునందే పుట్టుచున్నాఁడు.

మరణకాలమునందు పై చెప్పిన వాటికంటెను మరి తక్కువ తలంపుగలవారు అంతకంటె మహాబీదలుగా నుండు బ్రహ్మవేత్తలయొక్క గర్భమునందే పుట్టుచున్నారు.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. అ 6. 42 శ్లో.

ధ్యానాభ్యాసమునందుండి జారినవాడు జ్ఞానవంతులగు దరిద్రులైన వారి వంశమునందే పుట్టుచున్నాఁడు. ఇట్టి పుట్టక భూలోకమునందు పుట్టుట మిక్కిలి దుర్లభము.

మోక్షమును కోరువారు ఐశ్వర్యములను కోరరు. ఈ ఐశ్వర్యమువల్ల కామక్రోధాదులు అధికరించి అందువలన జన్మము వృద్ధియగుచుండును. బ్రహ్మవేత్తలైనవారు దరిద్రులుగానే యుందురు. అట్టివారు తప్పక మోక్షమును పొందుదురు. వారియొక్క గర్భమునందు జన్మించుట మిక్కిలి శ్రేష్ఠము, అచ్చటనుండి శీఘ్రముగా మోక్షమునుపొందగలడు.

త్రతం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన. అ6. 43శ్లో

అచ్చట పూర్వదేహ సంబంధమగు ఆత్మవిషయక మైన జ్ఞానసంబంధమును పొందుచున్నాఁడు.

పూర్వదేహ సంబంధ మనఁగా ధ్యానాభ్యాసమునుండి జారిపోయి యా దేహసంబంధముచేత నీ జన్మమునందు బీద లుగా యుండఁబడిన బ్రహ్మవేత్త గృహమునందుపుట్టి జ్ఞానసం బంధ మధికరించి మోక్షమును పొందుచున్నాఁడు. దీనినే పూర్వవాసన యనఁబడును. పూర్వవాసన యుండినయెడల తనకు తానై మోక్షము సిద్ధించును. వాసనలేనివారు యెంత కష్టపడినను యాత్మజ్ఞానమును పొందఁజాలరు. మనకు సంసార వాసన విశేషించి యుండుటచేత మరల సంసారానుభవము నందే పుట్టుచున్నాము. సంసార విషయములయందు సదా మనస్సును ఉంచుట సంసారవాసన యనఁబడును. ఆవాసనచే జన్మాదులు కలుగుచుండును.

శ్లో॥ దృఢ భావనయా త్యక్త పూర్వాపర విచారణం
యదాదానం పదార్థస్య వాసనా సాప్రకీర్తితా.

ముక్తికోపనిషత్తు.

ఈ సంసారానుభవము అనాదికాలమునుండి అనగా మనకు జన్మము శతశతము (నూరునూర్లు)గా వచ్చుచు ఒక్కొక్క

జన్మమునందును 50, 60, 70 సంవత్సరములవరకు పుత్ర పౌత్రాదులతోడ ఆశాపాసముగనుండి మరణమైన వెంటనే తన బంధువు లందరు కొన్ని సంవత్సరములు ఏడ్చుచుండి పిమ్మట వారున్ను ఆదేప్రకారము ఒకరినొకరు విడిచి మరణము నొందుచున్నారు. అట్టి అనిత్యమైన సంసారమునే స్థిరముగా నమ్మి సదా దానియందే మనస్సుగలవాడై మరణకాలమునందు దానినే స్మరించుచుండుటచేత నా జ్ఞప్తివల్లనే మరల సంసారమునందే పుట్టుచున్నాడు. ఈజన్మము రాక ఈ దేహము ఎప్పుడు నశించుననగా

శ్లో. జన్మాంతర శతాభ్యస్తా మిథ్యా సంసార వాసనా
సాచిరాభ్యాస యోగేన వినా నక్షీయతే క్వచిత్. ముక్తి.

ఈమిథ్యా (మాయ, లేక అబద్ధమైన) సంసారవాసన వల్ల అనేకనూర్ల సంవత్సరములుగా జన్మమెత్తి అలవాటుపడి యుండుటచేత ననేక దినములు యోగాభ్యాసమును జేసి మనస్సును నిలుపుదల చేయువరకీ యాత్మబ్రహ్మమునం దైక్యము కాజాలదు. ఇదియునుగాక లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అని మూడు వాసనలు గలవు.

శ్లో. లోకవాసనయా జంతో శ్శాస్త్ర వాసనయాపిచ
దేహవాసనయా జ్ఞానం యథావ న్నైవ జాయతే.

ముక్తికోపనిషత్తు.

లోకమున తాను చేయునట్టి మంచికార్యముల వలన తన్ను యెల్లవారు పొగడుచుండవలయునని యెడి తలంపే లోకవాసన యనఁబడును. తామే యెక్కువ చదివిన శాస్త్రపండితులమని గర్వించి శివవిష్ణువులకు భేదము కల్పించి శివుఁడే గొప్పవాఁడు శైవమతమే గొప్పమతము, విష్ణువే గొప్పదైవము వైష్ణవమతమే శ్రేష్ఠమైన మతమని ఒకరితో నొకరు వాదులాడి పోరాడుచుండుటయే శాస్త్రవాసన యనఁబడును. దేహము చెడకుండ ముసలితనము, వ్యాధులు, చావు మొదలైనవి రాకుండవలయుననియు మూలికలు మొదలైన సిద్ధౌషధములను భుజించి కాయసిద్ధిని పొందవలయు ననెడి తలంపే దేహవాసన యనఁబడును. ఈవాసనలంతయు నశించువరకనేక జన్మము లెత్తుచున్నాఁడు ఇటువంటి పునర్జన్మము లేక మోక్షమును పొందుటకు మార్గము.

శ్రుతి. వాసనాస్త్వం పరిత్యజ్య అంతశ్శాంత సమస్తేహా
భవ చిన్మాత్రవాసనః తామప్యథః పరిత్యజ్య
మనోబుద్ధి సమానతాం శేషస్థిర సమాధానో
మయిత్వం భవమారుతే అశబ్దమస్పర్శ మిత్యాది.
ముక్తికోపనిషత్తు.

సమస్తవాసన లన్నియు మోక్షమునందలి యిచ్ఛవిడిచి జగత్తు సర్వమనిత్యమనియు, బ్రహ్మమేసత్యమనినమ్మి బ్రహ్మమును ధ్యా

నించుము. తర్వాత ఆధ్యానమునుకూడ విడిచిపెట్టి మనస్సు బుద్ధి యీరెంటిని సంచలములేక స్థిరముగా నిలిపి

శ్రుతి. హృదయం నిర్మలం కృత్వా చింతయిత్వా ప్యనామయం
అహమేవ పరంసర్వమితి పశ్యేత్పరం సుఖం

పైంగలోపనిషత్తు.

హృదయమున యేతలంపులేక స్ఫటికమువలె నిర్మలముగా జేసికొని ఆపరబ్రహ్మమే నేననియు, నేనే సర్వమనియు మౌనముగా ఊరకుండుటయే పరమసుఖము. ఇట్లు అభ్యసించినయెడల తనయొక్క ఆత్మబ్రహ్మమునం దెల్లు యేకమై పోవుచున్నదనగా.

మిక్కిలి ప్రాపంచకవాసనలను పొందని మనస్సునందుఁ బూర్వాభ్యాసముచేత జగజ్జీవేశ్వరులు తోఁచినను అస్తిభాతులచేత ఆత్మయని తెలిసి, తరంగములేని సముద్రమువలెను గాలిలేని దీపమువలెను, పూర్ణచంద్రునివలెను ప్రకాశించుచు, స్వప్నములేని గాఢనిద్రవలెను భేదము పోఁగొట్టుకొని సంపూర్ణమైనట్టి తురియావస్థయందు చలించకుండునటుల నిర్వికల్ప సమాధియందు బొంది సర్వము అఖండమైనట్టియు, కాలత్రయమునందు నశించనట్టియు, అవస్థాత్రయమందు కలియునట్టియు, శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపముగలిగి ప్రకాశించుచు నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను అనుధ్యానమును మఱచి మనోబుద్ధుల రెండును శూన్యముజేసి సకలతలంపులను మఱచి

దేహాది ప్రపంచము మొదలగు దృశ్యములు మఱచి తాను తానై తన్మయుంబుగా కేవల చిన్మాత్రుండై సాక్షిగానుండు టయే అసంప్రజ్ఞాత సమాధియనియు నిర్వికల్పసమాధియని యుం జెప్పంబడును. ఇట్లు నిర్వికల్ప సమాధియందుండుటచేత వారియాత్మ బ్రహ్మమునందు యెట్లు యేకమై కలసిపోవుననగా

శ్లో. యథా జలేజలం క్షిప్తం క్షీరంక్షీరే ఘృతం ఘృతే
అవిశేషో భవేత్తద్వత్ జీవాత్మ పరమాత్మనోః
యథోదకే తోయ మను ప్రవిష్టం తథాత్మరూపో
నిరూపాధిసంస్థితః. పైంగలోపనిషత్తు.

జలములో జలము, పాలలో పాలు, నేతిలో నేయి, కలసి ఏకమై పోవునట్లును, (ఘటము పగిలినప్పుడు ఘటాకశము మహాకాశములో కలసినట్లును) ఈ శరీరము నశించిన వెంటనే జీవోపాధి (సంకల్పము మనస్సు) నశించి బ్రహ్మమునందు ఆత్మ కలిసి యేకమై పోవుటే విదేహముక్తి యనంబడను. కర్పూరమును వెలిగించినప్పుడు వెలిగి యేమియు మిగలక ఆ తేజస్సు మహాతేజస్సుయందు కలసి యేకమై పోవునటుల ఈ యాత్మ బ్రహ్మమునందు కలసి యేకమై పోవును దీనిని అసంప్రజ్ఞాత సమాధిచే పొందవలయును. సంప్రజ్ఞాత సమాధి, అసంప్రజ్ఞాత సమాధి అని రెండువిధములు.

శ్లో. సంప్రజ్ఞాత సమాధిస్స్యాత్ ధ్యానాభ్యాస ప్రకర్షతః
ప్రశాంత వృత్తికం చిత్తం పరమానంద దీపకం.

ముక్తికోపనిషత్తు.

నేనె బ్రహ్మము బ్రహ్మమే నేను అనగా (సోహంభావ ధ్యానమును) ఏకాంత స్థలమునందు గూర్చుండి చిత్తమును నానావిధముల పోనీక తదేకధ్యానముగా ధ్యానించుచుండుట సంప్రజ్ఞాత సమాధి లేక సవికల్పసమాధి యనఁబడును.

శ్లో. అసంప్రజ్ఞాత నామాయాం సమాధి ర్యోగినాంప్రియః
ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకం

ముక్తికోపనిషత్తు.

నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను (సోహంభావ) ధ్యానమునుమఱచి, మనోబుద్ధులు రెండున్ను శూన్యమై, సకల తలంపులు మఱచి, దేహాది ప్రపంచము మొదలగు సకల దృశ్యములను మఱచి, తాను తానై తన్మయంబుగా కేవల చిన్మాత్రుఁడై సాక్షిగా నుండుటయే అసంప్రజ్ఞాత సమాధి యనియు, నిర్వికల్ప సమాధియనియుఁ జెప్పఁబడును. ఈఅసంప్రజ్ఞాత సమాధిచే

శ్లో. అజ్ఞానహృదయ గ్రంథే ర్నిశ్శేష విలయ స్తథా
సమాధినావికల్పేన యదా అద్వైతాత్మదర్శనం.

అధ్యాత్మోపనిషత్తు.

నిర్వికల్ప సమాధినిష్ఠాభ్యాసముచేత నజ్ఞాన మయమగు సమస్త హృదయ గ్రంథులు (సంకల్ప వికల్పములు) నశించి కేవల అద్వయ బ్రహ్మమగు ఆత్మసాక్షాత్కారము కలుగును. ఇందువల్ల

శ్లో. ఘటాకాశ మహాకాశ మివాత్మానం పరాత్మని
విలాప్యాఖండ భావేన తూష్ణీంభవ సదాముసే
చిదాత్మని సదానందే దేహారూఢ మహంధియం
నివేశ్య లింగముత్సృజ్య కేవలోభవ సర్వదా.

అధ్యాత్మోపనిషత్తు.

ఘటాకాశ మహాకాశములో కలసి యేకమై పోవునట్లు సకల తలంపులను మరచి బ్రహ్మమునందు ఆత్మను యైక్యము చేసి శిలారీతి (మౌనము) గా ఊరకుండుటయే పరమసుఖము.

ఇటువంటి మౌనసమాధి నిష్ఠయందు లేనివారు కోటి జన్మము లెత్తినను ఆత్మజ్ఞానము కలిగి మోక్షమును బొంద జాలరు యెట్లనఁగా

శ్లో. ఆత్మానాత్మా వివేకేన పునస్సంసార నిర్వృతిః
తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో నసిధ్యతి.

ఆత్మానాత్మా వివేకములేనివారు కోటిజన్మము లెత్తినను మోక్షమును బొందఁజాలరు.

శ్లో. అయమాత్మా బ్రహ్మ, ఆత్మా నారాయణఃపరః.
అను రీతిని ఆత్మయే పరబ్రహ్మమని తెలిసి ఆత్మానుభవమును

పొందనివారు వనవాసముచేసి తలక్రిందులుగా నిలిచి అన్నాహారము లేక తపస్సుచేసి యెంతకష్టపడినను ముక్తిని పొందఁజాలరు.

శ్లో. అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః.

ఆత్మజ్ఞానము లేనివారికే విగ్రహారాధనలను జెప్పఁబడియున్నదిగాని కేవల మాత్మజ్ఞానులకు విగ్రహారాధనలతోఁ బని లేదు. ఆత్మజ్ఞానులు దేని నారాధించుచున్నారనఁగా

శ్లో. దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్.

"పూజ, పూజ అనునది ఈసోహంభావధ్యానమేపూజ ఈదేహమే దేవాలయముగాను ఇందుపసించునట్టి ఆత్మయే పరబ్రహ్మముగాను ఎవరైతే తెలిసికొని బ్రహ్మాత్మైక్యానుసంధానమును పొందుచున్నారో అట్టివారు పునర్జన్మము లేనివారై నిత్యముక్తియగు మోక్షమును పొందుచున్నారుగాని తక్కిన వారు ఎంతకష్టపడినను ముక్తిని పొందజాలరు.

యోగాభ్యాసముచేసి మనస్సును నిలుపుటకు శక్తిలేని వారు (ఆత్మధ్యానమునందు వ్రాయఁబడినరీతిని) లోకవ్యవహారములయందుండునపుడు, సోహంభావధ్యానమును యేకాంత స్థలమునందుండునపుడు, బ్రహ్మస్థానమగు నాభిస్థానమును ఆకాశరూపము (బట్టబయలు)గాఁ జూచు విధమొకటి, శాంభవిముద్రచే నభ్యసించుట మరియొకవిధము, సోహంభావధ్యానము

నందుండి అసంప్రజ్ఞాత సమాధియందుండుట యింకొకవిధము. ఈమూడువిధయభ్యాసములలో నేదైన నొకదాని నభ్యసించుచు వచ్చినయెడల చిత్తశాంతి గలిగి మోక్షమును బొందఁగలరు. మఱియు,

మ. ఏను మృతుండ నౌదునని • యెంత భయంబు మనంబులోఁ బల్క
మానుము సంభవంబుగల • మానవకోట్లకు చావు నిక్కమౌ
గాన హరిం దలంపుమిఁకఁ • గల్గదు జన్మము ధాత్రిపైని యో
మానవనాథ బొందెదవు • మాధవలోకనివాససౌఖ్యముల్.

శ్రీమద్భాగవతమునందుఁ జెప్పఁబడినరీతిని సోహంభావధ్యానమే హరిధ్యానముగాని హరిని పూజించుట, విగ్రహారాధనము చేయుట మొదలగునవి ధ్యానముకాదని యర్థము. ఈ సోహంభావధ్యానమువల్ల జననమరణము లేక నిజమోక్షమును బొందఁగలరు.

యోగాభ్యాసము తెలియనివారు కొందరు తమయొక్క చిత్తమును యేసంకల్పము లేక నిలుపవలయునవెడి తలంపులో నేకాంతస్థలమునఁ గూర్చుండి ప్రయత్నింతురుగాని ఆసమయమునందే తా మిదివరలోఁ జేసిన లోకవ్యవహారవిషయములన్నియుఁ దటాలున స్మరణకు వచ్చి వాటి కేయేప్రతిక్రియలు చేయవలయునని యూహపుట్టునేగాని ధ్యానమునందేమాత్రము వీరియొక్క మనస్సుండజాలదు కాఁబట్టి మొట్టమొదటనుండి యోగాభ్యాసమును జేయుచు రావలయును.

## హంసగాయత్రీ.

——:o:——

ఓంభూః హంసస్సోహం-ఓం భువః హంసస్సోహం
ఓగ్ం సువః హంససోహం-ఓం మహః హంసస్సోహం
ఓం జనః హంసస్సోహం-ఓగ్ం సత్యం హంసస్సోహం
ఓం తత్సవితుర్వరేణియం హంసస్సోహం.
ఓం భర్గో దేవస్యధీమహి హంసస్సోహం
ఓం ధియో యోనః ప్రచోదయాత్ హంసస్సోహం
ఓం పరోరజసిసావదోం హంసస్సోహం
ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మాభూ
ర్భువస్సువరోం హంసస్సోహం-తత్వమసి

ఈ హంసగాయత్రీస్వరూపధ్యానమువలన జఠ
రాగ్ని వృద్ధియై, కుండలిశక్తిని ప్రబోధించి మృత్యువును జయిం
చుటయేకాక, అజీర్ణము, ఆమవాతము, క్షయ, కాశజ్వ
రము, ప్లీహ, గుల్మజ్వర, కఫ, పిత్తాదిరోగములను బోనడచి
క్షుత్పిపాసల నణచి నిద్ర, అలచటలు లేకుండఁ జేసి, శరీరము
తేలికనిచ్చి విషము భుజించినను ప్రమాదము చేయకుండును.
వేయేల! ఈప్రాణాయామమును క్రమక్రమముగా నభ్యసిం
చుచు వచ్చినయెడల సర్వరోగములు నశించుటయేగాక
సంపూర్ణసుఖకరమయిన యారోగ్యములనిచ్చి, బ్రహ్మతేజస్సు
ను కలిగి, సర్వబంధ విముక్తుఁడయిన మోక్షపదవిని పొందును.

## హంసమును మార్చువిధము.

—:o:—

హంసమునకు సూర్యనాడి, చంద్రనాడి యనియు, శివుఁడు, శక్తియనియు, ఇడా, పింగళాయనియుఁ జెప్పఁబడును. కుడినాసిక ద్వారమునందు వచ్చు శ్వాసమునకు సూర్యనాడి, శివుఁడు, ఇడాయనియు, ఎడమ నాసికద్వారమునందు వచ్చు శ్వాసమునకు చంద్రనాడి, శక్తి, పింగళానాడియనియు, ఈరెండునాడులు సంధించు స్థలము సుషుమ్నానాడియనియుఁ జెప్పఁబడును. సుషుమ్నానాడి యనఁగా మూలాధారము నుండి మస్తకము వరకు వచ్చునాడి. దీనిని నిమిషమున కొక మాటు మార్చుటకు ప్రాతఃకాలమున 4 ఘంటలకుమును పే లేచి సూర్యనాడియందున్న హంసమును చంద్రనాడిలో మార్చుటకు కూర్చుండి కుడిచేతిని క్రింద నానుకొని పెడకాళ్లతోఁ గూర్చుండి యెడమకాలి చీలమండయొక్క పెద్దనరమును యెడమచేతియొక్క మధ్యవ్రేలితోఁ గదుపుచు వచ్చినయెడల రెండుమూడు నిమిషములలోఁ జంద్రనాడియందు మారును. చంద్రనాడియందుండిన హంసమును సూర్యనాడిలో మార్చుటకు పెడకాళ్లతోఁ గూర్చుండి యెడమచేతిని క్రింద నానుకొని, కుడిచేతి మధ్యవ్రేలితోఁ గుడికాలి చీలమండయొక్క పెద్దనరమును కదుపుచు వచ్చిన యెడల సూర్యనాడియందు మారును. ఇదిగాక కూర్చుండి యోగదండమును గాని లేక తనకు తగిన యెత్తుగల పీఠను కుడిచేతి చంకకును మోచేతి మధ్యకు యాపీఠము నరమునకు తాకునట్లు నొక్కినట్టయిన కుడి

ప్రక్క నుండిన హంస యెడమప్రక్కకు మారును. ఎడమప్రక్క నుండు హంసమును కుడిప్రక్కకు మార్చవలెనన్న యెడమచేతి చంకకు మోచేతిచుట్టకొంక పీఠయుంచి పై చెప్పినరీతిని చేసినట్టయిన కుడిప్రక్కకుమారును. ఈహంసను యెల్లప్పుడు సూర్యనాడి యందుంచుకొని యుండు నిమిత్తమయి యోగులు సదా తమ చేతియందు యోగదండము నుంచుకొని యుండుటకు కారణమయినది. సాధారణముగ కూర్చున్నపుడు హంసమును మార్చవలెనన్న యెడమచేతిని క్రింద నానుకొనియెడమవీపుకుమాత్రమే గోడకు నానుకొని యుండినయెడల చంద్రనాడియం దుండిన హంస సూర్యనాడియందు మారును. సూర్యనాడియందుండిన హంసమును చంద్రనాడికి మార్చవలెనన్న కుడిచేతిని క్రింద నానుకొని కుడివీపును పై చెప్పిన రీతిగ చేసినట్టయిన హంస చంద్రనాడిలో మారును. పరుండియున్నపుడు హంసమును మార్చవలెనన్న కుడివైపు యొరగిలి పరుండి కుడిచేతిని తల క్రింద యుంచుకొనినయెడల సూర్యనాడియందుండి చంద్రనాడికి మారును. ఎడమవైపు యొరగిలి పరుండి యెడమచేతిని తలక్రింద నుపయోగించినయెడల చంద్రనాడియందుండి సూర్యనాడికి మారును. ఈమహారహస్యమయిన విషయము మీవరకు విని కననివా రచిరకాలమభ్యాసమువల్ల నిమిషమునకు రెండుమూడుసారులు మార్చవచ్చును. నడచునప్పుడు గొడుగుగాని లేక బట్టను బంతివలె చుట్టి యెడమచంకయందే

యుంచుకొని పోయినయెడల హంస సూర్యనాడియందే యుండును. చంద్రనాడియం దుండవలెనన్న పైచెప్పిన రీతిని కుడిచేతి చంకయం దుంచవలయును. ప్రతిదినము తప్పక యుదయము 4 గంటలు మొదలు 6 గంటలవరకు హంసను ఆయా వారములయందు యీక్రిందచెప్పిన రీతిని

ఉ. మంగళభాను కృష్ణగురు♦వారములందున సూర్యనాడియున్
రంగుగ సోమ శుక్ర బుధ♦వారముల న్మతి శుక్లపక్షమం
దుం గురువాసరంబునను♦నొప్పగ మేలగు చంద్రనాడియెం
చంగదినాదినాల్గు మొద♦లారవగంటకు నొప్పియుండినన్.

క. శనివార మహర్నిశములు
నొనరంగా సూర్యనాడి♦యొప్పినయెడలన్
దనరు ధనధాన్యసంపద
లనయంబును గార్యసిద్ధి♦యాయుర్వృద్ధిన్.

అభ్యసించుచు వచ్చినయెడల నేయాపత్తుకలుగక మనోల్లాసముగ నుందురు. యేకార్యమునైన తలఁచి పోవునపుడు హంసము సూర్యనాడియందుండునపుడు బోవువారికి కార్యసిద్ధియగును.

యోగియయినవాఁడు కొంచెమైనను విసుగు విరామములేక యోగాభ్యాసమును చేయుచు రాత్రింబగళ్లు హంసను సూర్యనాడియందే యుంచుటవల్ల వాని కచిరకాలములోనే యోగము సిద్ధియగును. ఈహంసయే సకలజీవజంతువుల

శరీరములయందు ప్రాణవాయువుగా రేచక పూరకంబున (ఉచ్ఛ్వాశనిశ్వాసములు) ఊర్ధ్వముగా వ్యాపించి సంచరించు చుండును. ఆపానవాయు పూరకరూపంబున అధోముఖ ముగా వ్యాపించి సంచరించుచుండు యీ రెంటికి మధ్యనుండు యాత్మను బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు సహా నుపాసించు చుందురు. ఈయాత్మయే హంసయని చెప్పఁబడును. ఈహం సమువల్లనే ప్రాణాపానవాయువులు సంచరించు చుండును ప్రతిదినము 21,600 తడవులు రేచక పూరకంబున నాసికా ద్వారములగుండా ద్వాదశాంగుళ యష్టాంగుళముల వరకు వెలుపలికి వచ్చుచు మరలలోపలికిఁ బోవుచు నీప్రకారము సూర్యనాడినుండి చంద్రనాడి మార్గంబుగాను, చంద్రనాడి నుండి సూర్యనాడి మార్గంబుగాను దిరుగుచుండును.

---

జాగ్రత, స్వప్న, సుషుప్తి, తుర్యావస్థలు.

---

జాగ్రతలో జాగ్రత, జాగ్రతలో స్వప్నము, జాగ్రతలో సుషుప్తి, జాగ్రతలో తుర్యము.

స్వప్నములో జాగ్రత, స్వప్నములో స్వప్నము, స్వప్న ములో సుషుప్తి, స్వప్నములో తుర్యము.

సుషుప్తిలో జాగ్రత, సుషుప్తిలో స్వప్నము, సుషు ప్తిలో సుషుప్తి, సుషుప్తిలో, తుర్యము.

తుర్యములో జాగ్రత, తుర్యములో స్వప్నము, తుర్యములో సుషుప్తి, తుర్యములో తుర్యము లని 16 అవస్థలు మనకు గలదు.

1 జాగ్రతలో జాగ్రత—మాటలు వినునప్పుడుగాని లేక వేదాంత శ్రవణముచేయుచుండునపుడుగాని శ్రద్ధతో విని మరవకుండుట.

2 జాగ్రతలో స్వప్నము—వేదాంతమును పరామరికగ విని ఆవిషయము కొంతజ్ఞాపకముండి కొంతమరచిపోయి ఇతరులకు జెప్పుటకు చక్కగా తెలియకుండుట.

3 జాగ్రతలో సుషుప్తి—వేదాంతమును వినవలయునని కూర్చుండి మనస్సు నావిషయములయందు నిలుపక వేరే తలంపులను, తలంచుచుండుటచేత విన్నసంగతి యిట్టిదని ఇతరులకు చెప్పుటకు జ్ఞప్తిలేకుండుట.

4 జాగ్రతలో తుర్యము—తత్వజ్ఞానమును విచారించి యేకాంతస్థలమునందు కూర్చుండి తాను వినిన విషయములన్నియు ఆలోచించుచుండుట.

5 స్వప్నములో జాగ్రిత—స్వప్నముగని లేచిన తరువాత తాను స్వప్నములో కన్న విషయములన్నియు మరవక చెప్పుట.

6 స్వప్నములో స్వప్నము—స్వప్నములో గన్న విషయములు కొంతజ్ఞాపక ముండి కొంత జ్ఞాపకము లేకుండుట.

7 స్వప్నములో సుషుప్తి—స్వప్నముగని లేచి ఆ స్వప్నములో తానుకన్న విషయములను బొత్తిగా జ్ఞాపకము నకు రాకుండుట.

8 స్వప్నములో తుర్యము—తాను స్వప్నమునందు కన్న మంచిచెడ్డలను విచారించి సంతోషింపక దుఃఖింపక, ఇవియన్నియు మనోవ్యాపారమని నిశ్చయించుకొని ఆత్మజ్ఞాన మును విచారించుట.

9 సుషుప్తిలో జాగ్రత—నిద్రించిలేచి ఆనిద్రసుఖ మిట్టిదని ఇతరులకు చెప్పుట.

10 సుషుప్తిలో స్వప్నము—నిద్రించి లేచి నిద్రసుఖ మిట్టిదని తోచియు తోచకుండుట.

11 సుషుప్తిలో సుషుప్తి—నిద్రించి లేచినతరువాత కన్నది బొత్తిగా తోచకుండుట.

12 సుషుప్తిలో తుర్యము—నిద్రించిలేచి యీనిద్రా వస్థ అజ్ఞానవిషయము, దీనికి సాక్షియైన ఆత్మయే సత్యమని తెలిసికొనుట.

13 తుర్యములో జాగ్రత—[illegible]యందుండు నపుడు జాగ్రత వ్యాపారములైన ప్రపంచ[illegible]ుట.

14 తుర్యములో స్వప్నము—స్థితియందుండు నపుడు జాగ్రతవ్యాపారములైన ప్రపంచవృత్తి కలుగకుండుట.

15 తుర్యములో సుషుప్తి—నిష్ఠయందు ఏసంకల్ప వికల్పములు లేకుండుట.

16 తుర్యములో తుర్యము—పైచెప్పిన 15 అవస్థలు ఏదిన్ని లేక అఖండపరిపూర్ణమైన పరబ్రహ్మమే తాననియు తనకంటె వేరొక వస్తువు లేదని తెలిసికొని తాను తానై యుండుట. ఈపదియారవ భాగమే అన్నిటికంటెను ఎక్కువైన స్థితియని స్పష్టముగా తెలిసికొనినయెడల సర్వము బ్రహ్మస్వరూపమే యని యెరుంగుదురు.

## సర్వం బ్రహ్మమయం.

శ్లో. అథనిత్యో నారాయణః బ్రహ్మనారాయణః శివశ్చనా
రాయణః శక్రశ్చనారాయణః దిశశ్చనారాయణః
యోహవై రుద్రస్సభగవాన్ యశ్చబ్రహ్మ యశ్చవిష్ణుః
యశ్చమహేశ్వరః యశ్చవినాయకః యశ్చస్కందః
యశ్చేంద్రః యోహవై నృసింహో దేవోభగవాన్
యశ్చబ్రహ్మ యశ్చవిష్ణు యశ్చమహేశ్వరః యశ్చోం
కారః యేచైకాదశరుద్రః యశ్చవిరాట్పురుషః

నారాయణుఁడు నిత్యుఁడు బ్రహ్మ నారాయణుఁడు శివుఁడు నారాయణుఁడు ఇంద్రుఁడు నారాయణుఁడు దిక్కులు నారాయణస్వరూపము. ప్రసిద్ధికెక్కిన భగవంతుఁడగు రుద్రుఁడే

బ్రహ్మ, విష్ణువే మహేశ్వరుఁడు, వినాయకుఁడే కుమారస్వామి, ఇంద్రుడు, ప్రసిద్ధికెక్కిన భగవంతుఁడగు నృసింహామూర్తియే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుఁడు ఓంకారవాచ్యుఁడైన పరబ్రహ్మ స్వరూపము, ఏకాదశరుద్రులు, విరాట్పురుషుఁడు.

శ్లో. తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదుచంద్రమాః
దదేవ శుక్రం తద్బ్రహ్మ తదాప స్తత్ప్రజాపతిః
శ్వేతాశ్వతరోపనిషత్తు.

అగ్ని, సూర్యుఁడు, వాయువు, చంద్రుఁడు, జలము పరిశుద్ధమును, బ్రహ్మమును ఆపరమాత్మయే

శ్లో. యథా సైన్ధవ ఘనోన స్తరోబాహ్యాం కృత్స్నోరసఘన
ఏవైవంవాఅరే యమాత్మా స న్తరోబాహ్యః కత్స్నః.
ప్రజ్ఞాన ఘనఏవేతి.

సముద్రసంబంధమైన యుదకముయొక్క ఉప్పుగడ్డ, వేరుగాక సర్వము నీళ్లయొక్క ఘనీభావమెట్లో యారీతినే యాపరమాత్మ స్వరూపము లోపల వెలుపల లేనిదై సమస్తము ప్రజ్ఞానముయొక్క ఘనీభావము, అనఁగా విజ్ఞానముకంటె వేరు లేదు.

శ్లో. ఏకోదేవ స్సర్వభూతేషు గూఢః
ఏకోవిష్ణు రనేకేషు జంగమస్థావరేషుచ
తైలంతిలేషు కాష్ఠేషువహ్నిః క్షీరే ఘృతంయథా.

స్వయంప్రకాశమానుఁడగు పరబ్రహ్మము ఒక్కఁడే, సర్వభూతములయందు రహస్యముగాను, నువ్వులయందు నూనె, అగ్నిమధనకట్టెలయందు నిప్పు, క్షీరమందు నేయివలెనే ఒక్కఁడగు విష్ణువు జంగమస్థావరాదులయందున్నాఁడు.

శ్లో. సర్వమిదం ప్రోక్తం పృథివీచాన్తరిక్షంచ ద్యౌశ్చదిశశ్చావాన్తరదిశాశ్చ సవై సర్వమిదం జగత్ సచభూతం సచభవ్యం.

ఏపరబ్రహ్మము చేత ఈజగత్తును, భూమియును, ఆకాశమును స్వర్గమును, దిక్కులును మూలలును సర్వము గ్రిచ్చఁబడి యున్నదో ఆపరబ్రహ్మమే యీకనఁబడెడియు భూతభవిష్యత్తైన జగత్తగుచున్నాఁడు.

శ్లో. హగ్ంసశ్శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జాగోజా ఋతజా అద్రిజా ఋతంబృహాత్. తైత్తిరీయోపనిషత్.

ఆదిత్యుఁడను ఆకాశమునందుండెడి వాయువును, యజ్ఞవేదికయందలి అగ్నియును, గృహములకు వచ్చియుండెడి యతిథియును, మనుష్యుల, దేవతల శరీరములయందున్న యాత్మస్వరూపమును, కర్మఫలభూతమైన స్వర్గాదిలోకముల యందుండు వాఁడును, ఉదకములయందును, భూమియందును, స్వర్గమునందును, పర్వతములయందును, జన్మించి యుండెడి అన్నియును పరబ్రహ్మమే. ఇట్టి బ్రహ్మమునందు

శ్లో. ఏషాం వృత్తిస్సమావృద్ధా పరిపాక్వా చసాపునః
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తానేతరే శబ్దవాదినః
కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనా స్సురాగిణః
తప్యజ్ఞానతయానూనం పునరాయాంతి యాంతిచ
అవిద్యాయామన్తరేవర్తమానాః స్వయంధీరాః
పణ్డితంమన్యమానాః దన్ద్రిమ్యమాణాః
పరియంతిమూఢా అన్ధేనైవనీయమానాయథాన్ధాం

ఎవరు సచ్చిదానందమందు, అనుసంధానము కలిగి మనోవృత్తివ్యాపారము విడిచి అంతట నిండినవారై ప్రకాశించుదురో, వారే సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మత్వము పొందుదురు. అట్టివారు

శ్లో. తురీయంనిరాకారమేకంబ్రిహ్మ, ప్రపఞ్చోపశమంశాన్తం
శివయద్వైతంచతుర్థంమన్య న్తేసఆత్మా ఏకామేవాద్వయం
బ్రహ్మ. సర్వభూతేషుయేనైకంభావమవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధిసాత్వికమ్,

బుద్ధ్యాదీంద్రియాతీతమైన నిర్వికారమగు పరబ్రిహ్మయొక్కటే ప్రపంచముయొక్క యాకృతి రాగద్వేషాదిదోషములు అనగా, ప్రకృతిసంబంధవికారములు లేని అద్వైత శివస్వరూపమును తురీయమునుగా బ్రిహ్మవేత్తలు తలంచుచున్నారు. సజాతి విజాతిస్వగతభేదరహితముగ ప్రకాశించునది పరబ్రిహ్మమొక్కటే.

గీత. సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్వికమ్
అ. 18. 20. శ్లో.

ఏకస్తద్వేదభగవాన్ ధాతా నారాయణఃప్రభుః.

ఏజ్ఞానముచేత సమస్తభూతములయందు, అఖండమైన ట్టియు, నాశరహితమైనట్టియు, ఏకమైన పరమాత్మస్వరూప మును ఎవ్వఁడు చూచుచున్నాఁడో ఆజ్ఞానమును సత్వగుణము వలన పుట్టినదానిగా తెలియుము. సమస్తము నిచ్చుప్రభు వగు భగవంతుఁడైన నారాయణుఁ డొక్కఁడే యని తెలిసి కొనుము.

"ఏకఏవ పరోహ్యాత్మా భూతేష్వాత్మన్యవస్థితః
ఏకం సదైకం పరమః పరేశః సవాసుదేవోన యతోన్య
దస్తి ఏకోవ్యాపిసమశ్శుద్ధో నిర్గుణః ప్రకృతేంపరః,
జన్మవృధ్యాదిరహిత ఆత్మసర్వగతోవ్యయః.

సమస్తభూతములయందుండెడు పరమాత్ముఁడొక్కఁడే దేనికంటె నన్యమైనదిలేదు. అటువంటిదియును, ఎల్లప్పుడు ఏకస్వరూపమైనదియు పరస్వరూపుఁడగు పరేశుఁడే ఆవాసు దేవుఁడు. ఏకస్వరూపమును సర్వవ్యాపియును, సమస్త స్వరూపమును, పరిశుద్ధమును, నిర్గుణమును ప్రకృతికంటె పర మును జన్మవృద్ధ్యాదులు లేనిదియును నగు ఆత్మ సర్వగతమై నాశరహితముగా నున్నది. ఇత్యాది శ్రుతిస్మృతిప్రమాణ

ములచొప్పున పరబ్రహ్మమైన దేవుఁ డొక్కఁడే యని నిస్సంశ
యముగ సిద్ధించెను.

శ్లో. సత్వాత్సంజాతుతే జ్ఞానం, త్రివిధంనరకస్యేదంద్వారం
నాశనమాత్మనః, కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేత త్త్రియం
త్యజేత్ అహంకారం బలందర్పం కామంక్రోధం పరిగ్రహమ్

ఆశ్రిత వాత్సల్యైక నిధియగు శ్రీకృష్ణ భగవా
నుల వాక్యముల చొప్పున, జ్ఞానోత్పత్తికి కారణమైన సత్వ
గుణము నవలంబించి నరకప్రాప్తికి హేతువుగల, కామ,
క్రోధ, లోభమను మూఁడుగుణములను విడిచిపెట్టి అహం
కారము, సామర్థ్యము, దర్పము (నేను సర్వవిషయముల
యందు సమర్థుఁడను నాకు సాటియైనవేటి యేచోటు లేదను
చిత్తవృత్తి) కామము, క్రోధము, గృహదారాదులయందు
ఆసక్తి, మమకారము, దురాగ్రహము విడిచినవాఁడే పర
బ్రహ్మ భావమును పొందుటకు సమర్థుఁడగుచున్నాఁడనుటను
విశ్వసించి తద్వత్ప్రవర్తించుచు మతవైషమ్యములేక, పక్ష
పాతమును మాని, సత్యమును ఊని యుండుట యుచితమని
తోఁచు బుద్ధిమంతులకు మాత్రమే బహువిధ నామరూపము
లతో బహు సిద్ధాంతములయం దనేక జనులచే నారాధింపఁ
బడు పరబ్రహ్మ స్వరూపము ఒకటియై యున్నది. నిర్వికల్ప
బ్రహ్మ నిష్ఠయందును, వేదాంతశాస్త్రములయందును, అను

భవముగల బ్రహ్మవేత్తలు బోధించు అభేదవాక్యముల యదార్థము స్ఫురించును.

శ్లో. సితనీలాది భేదేన యథైకం దృశ్యతేనభః
    భ్రాంతిదృష్టిభిరాత్మాపి తథైకస్సన్ పృథక్ పృథక్
    ద్వైతభ్రాంతి రవిద్యాఖ్యా రజ్జౌ సర్పభ్రాంతిరివా
    ద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణిదేవ ... ...
    నానాత్మభేదకల్పితం జ్ఞానమజ్ఞానం యదా
    హ్యేవైష ఏ తస్మిన్నుదరమనం తరంకురుతే
    అథతస్య భయం భవతి
    మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహనానేవ పశ్యతి.

శ్రీవిష్ణుపురాణము, బ్రహ్మపురాణము, తైత్తిరీయ, కఠోపనిషత్తు.

ఒకటైనటువంటి ఆకాశము యెట్లు తెలుపు నలుపు మొదలైన భేదములతోఁ జూడఁబడునో అదేప్రకారము ఒక్కటియైయుండు పరమాత్మ భ్రాంతి దృష్టిగలవారిచేత వేరువేరుగాఁ జూడఁబడుచున్నాఁడు. ఇట్టి ద్వైత భ్రాంతియే అవిద్యయని పేరు గలది. రెండవది లేని సర్వానుశూన్యమై సమస్తవస్తుస్వరూపమై వెలుగు పరబ్రహ్మస్వరూపమందు దేవతాది భేదములను త్రాటియందు సర్పభ్రాంతివలె కలుగఁ జేసికొనిన కల్పనజ్ఞానమే అజ్ఞానము ఈయజ్ఞానమే వేరువేరుగాఁ జూడఁబడుటకు కారణము. ఇట్టి అజ్ఞానమును శ్వేతరము గలదనెడి భ్రమను పుట్టించి భోగవాంఛను ప్రబలించి, తెలి

విని నశింపఁజేసి దుఃఖముల పాలుచేయును, జననమరణాదులు యెడతెగక, కలుగుట సిద్ధము.

శ్లో. నిమిషార్థం నతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా
యథాతిష్ఠంతి బ్రహ్మాద్యా స్సనకాద్యా శ్శుకాదయః
తస్మాత్సర్వం పరిత్యజ్య తత్వనిష్ఠోభవానఘ
భోగేచ్ఛాం దూరత స్త్యక్త్వాత్రయమే తత్సమాచర
వాసనాక్షయవిజ్ఞాన మనోనాశా మహామతే
సస్వరూపానుసంధాన మేవం కృత్వా సుఖీభవ
స్వరూపానుసంధాన వ్యతిరిక్తా న్యశాస్త్రాభ్యాసై
రుష్ట్రకుంకుమ భారవత్ వ్యర్థతా
స్వరూపానుసంధానంవినాన్యథాచారపరోనభవేత్
సంశాన్తసర్వసంకల్పః పశాంతశక వేషణః
నిర్వికల్ప పదఙ్గత్వా స్వస్థోభవ మునీశ్వర.

తేజోబిందూపనిషత్తు, తురీయాతీతావధూపనిషత్తు, అన్నపూర్ణోపనిషత్తు, సన్యాసోపనిషత్తు, వరాహోపనిషత్తు, మహోపనిషత్తు, ఇత్యాదిశ్రుతిసహస్రంబులరీతిని సనకసనందనాదులు, శుకబ్రహ్మం, వశిష్ఠాది మహానుభావులు బ్రహ్మా నందమగ్నులై, యెడతెగని మౌననిష్ఠను పొంది సుఖించినట్లు ఎవరు సమస్తసంకల్పములు వదలిచిత్తవిశ్రాంతి కలిగి, అన్య శాస్త్రములయందును భోగములయందు నిచ్ఛలేక భ్రమవల లోఁ జిక్కక, స్వప్రకాశమానమైన బ్రహ్మజ్ఞానముచేత నిర్వి

కల్పమౌన సమాధినిష్ఠయుందుందురో, వారే జీవన్ముక్తులు. అయితే పరబ్రహ్మస్వరూపమందు నిశ్శేషముగా మనస్సు లీన మైనను, శరీరముండు వరకు వారన్నపానాదులు పుచ్చుకొను సమయమున లేక

శ్లో. దుశ్చింతనం మత్కథన మన్యోన్యం మత్ప్రభాషణం
మదేకపర మోభూత్వా కాలం నయమహామతే.

వరాహోపనిషత్తు.

వ్యవహరించుసమయమున మనస్సు, బ్రహ్మమందు లీన ముగాక, భిన్నమై యుండును భిన్నముకాక యుండినయెడల కార్యములు జరుగవు, అట్లు ఒకసమయమందు లీనమై మరి యొక సమయమున భిన్నమైన పక్షమున, వారు జీవన్ముక్తులు గారుకదా, యను శంక పరిహారార్థము

శ్లో. ద్వివిధ శ్చిత్తనాశోస్తి సరూపో రూప ఏవచ
సరూపోశౌమనోనాశో వై దేహీ ముక్తిగోభవేత్."

ముక్తికోపనిషత్తు.

ఈరీతిగా సరూపమనోనాశమనియు, అరూపమనోనాశ మని రెండువిధములు అందు సరూపమనోనాశము జీవన్ముక్తుల యందును, అరూపమనోనాశము విదేహముక్తులయందును మరియు

చిత్తనాశాభిధానం హియథా తే విద్యతే పునః
మైత్ర్యాదిభి ర్గుణైర్యుక్తం శ్శాంతిమేతి నసంశయః
ముక్తికోపనిషత్

ఈరీతిని కరుణ, మైత్రి, ముదిత, ఉపేక్షాదిసుగుణము లతోఁ గూడి రాజసతామసవృత్తులు వదలి వ్యవహరించుటయే సరూపమనోనాశనమని యున్నది. వారు వ్యవహారసమయ మునం దుండునపుడు

శ్లో॥ పద్మపత్రం యథాతోయైః స్వస్థైరపినలిప్యతే
శబ్దాదివిషయా మ్యోభి స్తద్వజ్ఞానీనలిప్యతే
యస్మాన్మం త్రబలోపేతః క్రీడన్ సర్పైర్నదృశ్యతే
క్రీడన్నపినలిప్యేత తద్వదింద్రియపన్నగైః.

తామరాకు జలములో వుండిన్ని, ఆజలముచే అంట బడక యుండునట్లు వారు విషయములను నీటిచే స్పృశింపఁ బడరు. మరియు మంత్రవేత్తులు యేప్రకారము పాములతో ఆట్లాడుచున్నను వాటిచే కరువఁబడక యుందురో ఆరీతిని వారి యింద్రియములు సర్పము లనెడి విషముల కాటుకు లోఁ బడదు. ఇట్టివారి

శ్లో. లవణంతోయ సంస్పర్శాత్ ద్రవతోయమయంభ
వేత్ మనోహిబ్రహ్మ సంస్పర్శాత్ తథా బ్రహ్మమయం
భవేత్.

మనస్సు ఉప్పునీటియందుగలసి నీరైనటుల బ్రహ్మము నందు గలసినంతట బ్రహ్మమయంబగును. ఆమనస్సు బ్రహ్మ

మయము కాగానే మనోమయమైన ప్రపంచమంతే కల్పబ్రహ్మస్వరూపమే యగును, కాఁబట్టి న

అయి శ్లో॥ మనసావచసాదృష్ట్యాగృహ్యాతేనైర్యాగపీంద్రియైః
మై అహమేవ నమత్తోన్య దితిబుద్ధ్యధ్వమంజస
స మనస్సుచేతను, వాక్కుచేతను చతుర్దశేంద్రియ వ్యాపారముల చేతను, తలఁచినది వచించినది, చూచినది లోను గాఁగల వన్నియు పరబ్రహ్మమే యనియు అపరబ్రహ్మమే తామసి చాంచల్యములేక ప్రకాశింతురు. ఇట్టివారే కృతార్థులు బ్రహ్మవిద్యాగరిష్ఠులని వేదాంత సిద్ధాంతము.

శ్లో. ఓం మహాగ్రాసాయమహాదేవాయ శివ ఓం మహా
గ్రాసాయ మహాదేవాయశూలినేమహేశ్వరాయ
మృతాయతస్మైరుద్రాయునమోస్తు, శివయేవ
సదాధ్యేయంసర్వవస్సంసార మోచకః
హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
ఇతిషోడశంనామ్నాం కలికల్మషనాశనం
నాతః పరోతరోపాయ సర్వవేదేషు దృశ్యత
ఇతిషోడశ కలావృతస్య జీవస్యావరణవినాశ
నం తతః ప్రకాశతే పరంబ్రహ్మ మేఘాపాయేరవి
రశ్మిమండలీవేతి హరేరామ హరేరామ.

సమాప్తము.

